"వాళ్ళకి ఎప్పుడు ఇచ్చావ్?"

"ఇవాళే ఏడుగంటలకి."

"ఇంకా ఎన్ని వున్నాయి అలాంటి రీల్స్."

"చాలా."

"ఎక్కడివి అవి నీకు?"

"నావి కావు."

"మరెవరివి?"

మాట్లాడలేదు అతను.

"చెప్పు. ఎవరివి?"

"ఏమో?"

"ఎవరివో చెప్తే మాట్లాడకుండా వెళ్ళిపోతాను. లేదా నీ దగ్గరున్న ఆ ఫిల్మ్స్ అన్నీ తగలపెట్టేస్తాను."

అయినా మాట్లాడలేదు అతను.

"దీని అర్థం ఏమిటి?"

కాలండర్ మీద 30వ తారీకుమీద వేసిన ఇంటూ గుర్తూ బాంబే - మద్రాస్ ఫ్లైట్ అని వ్రాసివున్న వైపు చూపించి అడిగాడు విహారి.

నోరు విప్పలేదు అతను. తలవంచుకున్నాడు.

విహారి మామూలుగా అతను తనకు లొంగడని, జవాబు చెప్పడని గ్రహించాడు. బలవంతంగా చెప్పించాలి.

ఓ సారి చుట్టూ చూసాడు.

చిన్న టేబిల్ ఫేన్ వుంది ఓ మూల నేలమీద. దానివంక కాసేపు చూసాడు సాలోచనగా.

"చెప్పవా?" అడిగాడు.

పెదవి విప్పలేదు అతను.

విహారి క్రింద వున్న ఆ టేబిల్ ఫేన్ దగ్గరకి లాక్కి

శాడు అతన్ని. దాని పక్కన కూర్చోబెట్టి, బలంగా రెండు చేతులతో టేబిల్ ఫేన్ రెక్కలచుట్టూ భద్రత కోసం ఏర్పాటు చేసిన తీగలచట్రం తీసేసాడు. ఇప్పుడు టేబిల్ ఫేన్ బోడిగా, బోసిగా వుంది, కేవలం రెక్కలు మాత్రమే కనబడుతూ.

స్విచ్ ఆన్ చేసాడు విహారి.

ఫేన్ రెక్కలు తిరగడం మొదలెట్టాయి. క్రమంగా వేగం అందుకుంది. ఫుల్ స్పీడు పెట్టాడు విహారి.

గిరగిర తిరుగుతున్నాయి టేబిల్ ఫేన్ రెక్కలు.

"చెప్పవా నే నడిగే ప్రశ్నలకి సమాధానాలు?" అడిగాడు విహారి కఠినంగా అతన్ని.

మౌనం వహించాడు అతను.

చటుక్కున అతని ప్రక్కన కూర్చుని తలని, అతని తలని టేబిల్ ఫేన్ వైపు జరిపాడు.

గుంజుకున్నాడు అతను. తన మొహం వేగంగా కదులుతున్న ఆ మూడు రెక్కలవైపు పోతోంది. కళ్ళముందు కనబడుతున్నాయి ఆ రెక్కలు. బలంగా ఎదురు తిరగాలనుకున్నాడు కాని చేతులు కట్టేసివున్నాయి.

ఇంకా దగ్గరగా.

ఇంకా, యింకా దగ్గరగా.

"చెప్పవా?"

అతని మొహంమీద చల్లగా తగులుతోంది టేబిల్ ఫేన్ గాలి. ముందుకు వున్న అతని ముక్కుకు తగిలాయి రెక్కలు.

కెవ్వున అరిచాడు అతను.

ఏం జరిగిందో తెలియలేదు అతనికి. పెదాలమీదనుంచి,

గడ్డంమీదనుంచి క్రిందకి చుక్కలు చుక్కలుగా పడుతున్నాయి రక్తంబొట్లు టపటపా.

ముక్కుదగ్గర బాగా మండుతోంది. భరించలేని విపరీతమైన మంట.

"వద్దు. వద్దు" అరిచాడు బాధగా.

"మరిచెప్పు. ఈసారి నీ మెడ ఆ రెక్కలకి అడ్డుపెడితే తెగి కిందపడుతుంది, నీముక్కులాగానే!"

"చెప్తాను."

"ఎవరు ప్లెషర్ మర్చెంట్స్?"

తలుపు చప్పుడయింది.

"ఎవరో వచ్చారు" అన్నాడు అతను.

"ఎవరు వస్తారు ఈ సమయంలో."

"ఏమో నాకే తెలీదు."

మళ్ళీ తలుపు చప్పుడయింది.

"చెప్పు. ఎవరు ప్లెషర్ మర్చంట్స్?"

"తలుపు చూసిరా."

ఈసారి గట్టిగా, ఆగకుండా తలుపు చప్పుడు వినిపించింది.

విహారి టేబిల్ ఫేన్ ఆపేసి, అతని చేతులకి కట్టిన తన బెల్ట్ సరిగావుందో, లేదో పరీక్షించి, లేచి తలుపువైపు నడిచాడు ఎడంచేతిలో చిన్నకత్తెరతో.

తలుపు తెరిచాడు.

టెలిగ్రాం డెలివరీమేన్.

సంతకంపెట్టి టెలిగ్రాం అందుకుని చింపి చదివాడు తలుపు గడియవేసి.

"ఫ్రెష్ స్టాక్ నీడెడ్ ఫర్ క్రిస్టమస్."

కలకత్తానుంచి వచ్చింది ఆ టెలిగ్రాం.

దాన్ని మడిచి జేబులో పెట్టుకుని లోపలికి వెళ్ళాడు మళ్ళీ. చేతులకున్న బెల్ట్‌ని విడిపించుకోవాలని విశ్వప్రయత్నం చేస్తున్నాడు అతను.

"ఇప్పుడు మాట్లాడు. ప్లెషర్ మర్చెంట్స్ ఎవరు?"

"చాలామంది వున్నారు."

"పేర్లు, ఎడ్రసులు చెప్పు."

"నాకు ఒక్కరి పేరే తెలుసు."

"చెప్పు ఎడ్రసుతో సహా."

"మిస్టర్ ధనీలాల్, 32 మెరైన్ డ్రైవ్."

"ఇంకా ఎంతమంది వున్నారు?"

"మరో పదిమందిపైనే."

"నిజమే చెప్తున్నావా?"

"నిజమే."

"నవంబర్ 30 న ఏమిటి?

మాట్లాడలేదు.

"ఏమిటి ఆరోజు?" అడిగాడు విహారి.

"ధనీలాల్ నన్ను ఏర్‌పోర్ట్‌కు రమ్మన్నారు ఆ రోజు."

"దేనికి?"

"ఏమో?"

"వూరెళ్తున్నారా ఆయన?"

"తెలీదు. రమ్మన్నారు. అంతే."

"నీకు ఇంగ్లీష్ వచ్చా?"

"రాదు."

"నీకు టెలిగ్రాంలు, వుత్తరాలు వస్తూంటాయా ఎక్కడ నుంచయినా?"

"ఏం?"

"సమాధానం చెప్పు."

"వస్తూంటాయి. ఇందాకా వచ్చింది టెలిగ్రామా?"

"వాటిని ఏం చేస్తావ్?"

"ధనీలాల్‌కు ఇస్తాను వెంటనే. ఈ వ్యాపారానికి సంబంధించిన విషయాలు చూడడానికి ఆయన చాలా మందిని నాలాంటి వారిని నియమించారు అక్కడక్కడ-టెలిగ్రాంలు మొదలయినవి మాకు వస్తే వారికి ఇస్తాం."

"ఇంకా ఎంతమంది వున్నారు నీలాంటివాళ్ళు?"

"ఏమో?"

"ధనీలాల్ ఎడ్రసు ఏం చెప్పావ్?" అడిగాడు విహారి వెంటనే. ఇందాక తప్పు చెప్పివుంటే మళ్లీ ఆ నంబర్ గుర్తుండకపోవచ్చు, వేరే చెప్పచ్చని.

"32 మెరైన్ డ్రైవ్" చెప్పాడు అతను తడుముకోకుండా.

విహారి ఇల్లంతా వెతకి ఓ తాడు సంపాదించి, అతన్ని అంగుళం కదిలేందుకు వీల్లేకుండా కట్టేసాడు. ఆ మనిషి మీద ఎన్నిరకాలుగా తాడుని చుట్టాడంటే, తాళ్ళతో చేసిన వలలో బంధించారా అన్నట్లుగా కనపడతాడు ఎవరయినా చూస్తే. ఒంటిమీద రెండంగుళాలుకూడా ఖాళీ లేకుండా కట్టాడు అతన్ని. అతను తప్పించుకుంటే తనపని కష్టసాధ్యం అవుతుందని తెలుసు విహారికి.

తర్వాత ఆ బ్లూ ఫిలింస్ అన్నీ తాళం తెరచి అల్మైరాలోంచి తీసి నేలమీద కుప్పగా పోసాడు. సిగరెట్ వెలిగించుకుని, ఆ అగ్గిపుల్లతో అంటించాడు ఫిల్మ్లని.

కిటికీ తలుపులు అన్నీ లోపలకి వేసి గడియపెట్టాడు. ఎలక్ట్రిక్ స్విచ్ ఆపేసాడు. నీళ్ళ గదిలో పంపులు రెండూ బలంగా మూసాడు తర్వాత నీళ్ళు కారకుండా.

తాళం కప్ప అందుకుని, బయటకి వచ్చి తలుపు బయట గొళ్ళెంపెట్టి, తాళంవేసి, తాళంచెవిని జేబులో వేసుకున్నాడు.

నెమ్మదిగా నడవసాగాడు.

# 8

నవంబర్ 30.

సాయంత్రం రాత్రిని ఆహ్వానించే వేళ.

మునిమాపు వేళ.

శాంటాక్రుజ్ ఏర్‌పోర్ట్‌లో మద్రాసు వెళ్ళే విమానం సిద్ధంగావుంది.

షెడ్యూల్ ఫ్లైట్ కాదది.

చార్టర్డ్ ఫ్లైట్.

బొంబేలోని ఓ కాన్వెంట్ విద్యార్థులకోసం, స్టూడెంట్స్ కాబట్టి హాఫ్ ఫేర్‌తో కన్సెషన్ మీద బయలుదేరుతున్న ఛార్టర్డ్ విమానం.

ఇంకో అయిదు నిముషాలలో బయలుదేరుతుంది. మద్రాసులో వాళ్ళని వదలడానికి బయలుదేరుతుంది. పదిరోజులు దక్షిణ భారతదేశంలోని ప్రసిద్ధ స్థలాలు చూసాక మళ్లీ వాళ్లు తిరిగి వస్తారు పదిరోజుల తర్వాత.

విమానం నిండా పిల్లలు. ఆడపిల్లలు.

"ఏవ్రో విమానం అది హెచ్ ఎస్-748.

థర్టీఫోర్ సీటర్ ఏవ్రోలో 34 మంది కాన్వెంట్ విద్యార్థులంతా కూర్చుని కబుర్లు, కేరింతలతో గడుపుతున్నారు కాలం.

ఆ 34 మంది పిల్లలకి వీడ్కోలు చెప్పడానికి వచ్చారు వాళ్ళ తలిదండ్రులు. పిల్లలు కొత్తప్రదేశం చూడగలుగు

తున్నారనే సంతోషంతోపాటు, వాళ్ళు ఒంటరిగా వెళు తున్నారనే బాధతో వీడ్కోలు చెప్తున్నారు.

కమాండర్ సీట్లో విహారి కూర్చుని వున్నాడు. కో-పైలట్ లేడు ప్రక్కన.

ఇంజన్ స్టార్ట్ చేసిన తర్వాత విమానం పైకెగరడానికి చాలా సేపు పడుతుంది. అనేక డయల్స్‌లో రీడింగ్స్ చూసుకోవాలి. ఇంజన్‌లోకి గేస్ వదలాలి.

లెక్క పెట్టసాగాడు విహారి.

"ఫోర్, త్రి, టు, ఒన్...జీరో."

రన్ వేమీద పరిగెత్తసాగింది విమానం. వెంటనే నిర్ణీత ప్రదేశంలో విమానం గాలిలోకి లేచింది. పదిహేనువందల అడుగులు చూపిస్తోంది అల్టిమీటర్ కొద్ది క్షణాలలో.

'పబ్లిక్ ఎడ్రస్ సిస్టమ్'లో చెప్పాడు విహారి.

"డియర్ గరల్స్,

వి ఆర్ ఆన్ ది ఎయిర్. ప్లీజ్ లూజ్ యువర్ బెల్ట్స్. హియర్ విగో."

మరో పావుగంట తర్వాత చెప్పాడు విహారి తను వెతుకు తున్న లైట్లు నేలమీద దూరంగా కనపడగానే.

"డియర్ కిడ్స్,

ప్లీజ్ ఫేస్టెన్ యువర్ సీట్ బెల్ట్స్ ఎండ్ స్టాప్ స్మోకింగ్, ఇఫెటాల్ యు డు. వి ఆర్ లేండింగ్ ఎగైన్."

'ఆటోమేటిక్ పైలట్' బటన్ నొక్కి కాక్‌పిట్ తలుపు తెరుచుకుని కేబిన్‌లోకి వచ్చాడు.

అప్పటికే చాలామంది సీట్ బెల్ట్స్ కట్టుకుంటున్నారు; చిన్న పిల్లలు కాబట్టి లేకపోతే విమానంలోంచి పడిపోతా రేమోనని భయంతో త్వరత్వరగా కట్టుకుంటున్నారు.

పర్సర్ (మేల్ ఎటెండెంట్), ఏర్ హోస్టెస్ వాళ్లకి సహాయం చేస్తున్నారు.

"దేనికి మళ్ళీ దిగడం?" అడిగాడు పర్సర్, విహారిని కొద్దిగా ఆశ్చర్యంగా.

"ఎమర్జెన్సీ లాండింగ్."

"ఏమయింది?" అడిగాడు ఖంగారుగా.

"ఏం కాలేదు. వెనక్కి రమ్మని ఆదేశించారు."

"మద్రాస్ వచ్చేసామా అప్పుడే?" అడిగింది ఓ పాప.

"లేదు" అన్నాడు విహారి నవ్వి.

అందరూ పదిహేను ఏళ్ళలోపు వాళ్ళే. పదినుంచి పదిహేనులోపు. ముప్పైనాలుగుమంది మొత్తం.

వాళ్లవంక చూసి చిన్నగా నిట్టూర్చి తలుపు తెరచుకుని మళ్లీ కాక్‌పిట్‌లోకి వెళ్ళాడు.

చకచకా డయల్స్ అన్నీ చెక్ చేసాడు. టేక్ ఆఫ్ తేలిక గాని ఏర్‌క్రాఫ్ట్ లేండింగే చాలా కష్టమయిన పని. దిగబోయేముందు అనేక డయల్స్ చెక్ చేసుకోవాలి.

ఆల్టిమీటర్, ఆర్. పి. ఎమ్ ఇండికేటర్ (రివల్యూషన్ ప్రొపెల్లర్ మీటర్) ఔట్‌సైడ్ ఎయిర్ స్పీడ్ ఇండికేటర్, కేబిన్ ప్రెషర్ గేజ్, ఇవన్నీ సరిగా వున్నాయో లేవో చూసుకుని, మేప్‌లో తన పొజిషన్ చెక్ చేసుకున్నాడు.

తను దిగేది అధునాతనమయిన ఏర్‌పోర్ట్‌లో కాదు. ఓ నేలమీద. చీకట్లో. కష్టం, అలవాటుపడ్డ పైలట్‌కి తేలిక.

గ్లైడ్ స్కోప్ వుపయోగించి, ఇంస్ట్రుమెంటల్ లాండింగ్ సిస్టమ్ ఆన్ చేసాడు.

రేట్ ఆఫ్ డిసెంట్ ఇండికేటర్‌మీద కేంద్రీకరించాడు తన దృష్టి.

నిమిషానికి అయిదువందల అడుగులు దిగుతున్నాడు. వెయ్యి అడుగులదాకా కూడా దిగచ్చు.

రన్ వేలాంటి నేలమీద ఆగింది, విమానం దిగి, కొంచెం దూరం పరిగెత్తి.

చీకట్లో నించోనున్న ఓ పదిమంది చేతుల్లో పొడవాటి లాంతలతో వచ్చారు విమానం తలుపు దగ్గరకి. మెట్లు లేవు ఎటాచ్ చేయడానికి.

చిన్నపిల్లలు చీకటిని చూసి దడుసుకున్నారు. పెద్దవాళ్లు ఆశ్చర్యపడ్డారు కొద్దిగా.

అయిదు నిముషాలలో విమానంలోంచి అంతా - విహారి తప్ప, మిగతా 36మంది దిగబడ్డారు బలవంతంగా, ఏడుపుల మధ్య.

"ఎంత దూరం ఇక్కడనుంచి?" అడిగాడు విహారి ఒకళ్ళని.

"ఫర్లాంగుకూడా వుండదు. రండి చూద్దురుగాని."

మరో పావుగంటలో ఓ పెద్ద కాంపౌండ్‌లోకి వెళ్ళారు అంతా జీప్స్‌లో. విహారికూడా వాళ్ళని అనుసరించాడు. ఆ కాంపౌండ్‌లో సినిమాహాల్స్‌లాగా వున్న నాలుగయిదు పెద్ద హాల్స్, పైన రేకుల కప్పులతో, వాసయోగ్యమైన ఓ పాతిక చిన్నచిన్న టెంపరరీ హాట్‌మెంట్స్ వున్నాయి దానికి చుట్టుప్రక్కల.

విహారిని ఆ సినిమాహాల్స్‌లోకి_స్టుడియో ఫ్లోర్స్, హాల్స్ కావు - తీసుకువెళ్ళి చూపించారు. అధునాతనమైన మూవీ కెమేరాలు, లైటింగ్స్ ఏర్పాట్లు, సెట్స్ కట్టడానికి వీలుగా పరికరాలు మొదలైనవన్నీ వున్నాయి. ఓ హోటల్ గది సెట్ కట్టి వుంది సిద్ధంగా.

ఆ హాట్ మెంట్స్‌లో పిల్లలు, చిన్నపిల్లలు, పెద్దవాళ్ళు, ఆడ, మొగ, అందరి మొహాల్లో నైరాశ్య, విచారం, విషాదం, బ్రతుకుమీద భారం ద్యోదక మవుతున్నాయి. వాళ్ళచేత బలవంతంగా నటింపచేసేందుకు, పారిపోకుండా చూసేందుకు పాతికమందిదాకా వున్నారు బలాఢ్యులయిన వాళ్ళు చేతుల్లో లాఠీలతో. వాళ్ళ శరీరంమీద చిన్న గీత కూడా అవకుండా బాధించి తాము చెప్పినవాటికి ఒప్పుకు నేలా చేసే పద్ధతులు చాలా తెలుసు ఆ బలాఢ్యులకి.

చాలామంది అర్ధనగ్నంగా వున్నారు. కట్టుకునేందుకు బట్టలుకూడా ఇవ్వటం లేదు. అంగ సౌష్టవం పోకుండా వుండేందుకు మాత్రం తిండి పెడుతున్నారు కడుపునిండా.

## 9

మరో పావుగంటలో విహారి విమానంలో వున్నాడు కాక్‌పిట్‌లో.

విమానం స్టార్ట్ చెయ్యగానే ఎక్కారు పన్నెండుమంది ప్లషర్ మర్చెంట్స్.

విహారికి తెలుసు వాళ్లు అంతా ప్లెషర్‌మర్చెంట్స్ అని. ఈ బ్లూ వరల్డ్ సృష్టించి, ఆ ప్రపంచాన్ని ప్రజలకి అందించి డబ్బు చేసుకుంటున్న వ్యాపారస్థులు వాళ్ళందరూ.

అంతా స్వయంగా సంగతి సందర్భాలు తణిఖీ చేసేందుకు వచ్చారు, క్రిష్టమస్ న్యూ ఇయర్ దగ్గర పడ్డాయి కాబట్టి ఫిల్మింగ్ చురుకుగా జరుగుతోందో, లేదో చూసుకోడానికి.

క్రిష్టమస్ లోపల కొత్త బ్లూఫిలింస్ సిద్ధంచేసి ప్రపంచం లోని నలుమూలలకీ పంపాలి. నిర్విరామంగా జరుగుతోంది ఫిల్మింగ్.

అయిదు నిముషాల తర్వాత ఆటోమేటిక్ పైలట్ స్విచ్

ఆన్ చేసాడు విహారి. కాక్‌పిట్‌లోంచి కేబిన్‌లోకి వెళ్ళాడు. ఏమిటన్నట్లుగా చూసారు ప్లషర్ మర్చెంట్స్.

"మీ పేర్లు, వృత్తులు తెలుసుకోవచ్చా!" అడిగాడు సిగరెట్ అంటించుకుని మామూలుగా.

"దేనికి?" అడిగాడు ఒకడు.

"వూరికే."

"నో."

వెనక దాచివుంచిన కెమేరా తీసి నాలుగుసార్లు గబగబా క్లిక్‌మనిపించాడు.

"ఏమిటిది? ఎందుకు ఆ పని చేసావ్?" లేచాడు కోపంగా ధనీలాల్.

"వూరికే. నా ఆల్బంకి."

కాక్‌పిట్‌లోకి వెళ్ళి తలుపు లోపల గడియ వేసుకున్నాడు విహారి వెంటనే. కెమేరా ఓ ప్రక్కన పెట్టి వైర్‌లెస్ సెట్ అందుకుని శాంటాక్రుజ్ ఏర్‌పోర్ట్‌ని కాంటాక్ట్ చేసి అడిగాడు:

"జసీజ్ ఛార్టర్ ఫ్లైట్ ఫ్రమ్ బాంబే టు మద్రాస్. టేప్ రికార్డర్ ఆన్ చెయ్యండి వెంటనే."

శాంటాక్రుజ్‌లో వైర్‌లెస్ వుద్యోగి టేప్ రికార్డర్ ఆన్ చేసాడు రిసీవర్ పికప్‌కి కనెక్ట్ చేసి.

"ఏమయింది ఇందాకటినుంచి? రేడియో కాంటాక్ట్ లేదే గంటనుంచి?"

"నా పేరు విహారి. కమాండర్ విహారి. ఈ ఫ్లైట్ షెడ్యూల్డ్ పైలెట్స్ ఇద్దరూ తాళ్ళతో కట్టబడి శాంటాక్రుజ్ ఏర్‌పోర్ట్ రన్‌వే ప్రక్కన చీకటిగా వుండేచోట పడేయబడ్డారు. వాళ్ళని విడిపించండి.

పెప్పర్‌మర్చెంట్స్ అనే ఓ పన్నెండుమంది ఆ పనికి కారణం. వాళ్ళలో ఒకరయిన సేట్ ధనీలాల్ వయసు ఏభైతొమ్మిది, ఎడ్రసు 32 మెరైన్ డ్రైవ్, బాంబేని కలుసుకుని ఓ చిన్న అబద్ధం చెప్పాను. నమ్మారు నన్ను పూర్తిగా.

ఛార్టరు ఫ్లైట్‌లో 34 మంది కాన్వెంట్ విద్యార్థులని తీసుకువెళ్ళి వాళ్ళ స్టూడియోలకి చేరిస్తే నాకు పాతిక వేలు ఇస్తామని ఒప్పుకున్నారు. బాంబే సమీపంలో వున్న..."

రివాల్వర్ పేలిన చప్పుడు.

లోపల బోల్ట్ వేసుకున్నా కాబిన్ నుంచి కాక్‌పిట్ కున్న తలుపు తెరచుకుంది అకస్మాత్తుగా. ధనీలాల్ లోపలకి వచ్చాడు అకస్మాత్తుగా పొగలుకక్కుతున్న రివాల్వర్‌తో.

విహారి చెప్పటం ఆపి వెనక్కి తిరిగి చూసాడు ఆశ్చర్యం నటిస్తూ—

"ఏమిటి?" అడిగాడు.

"అంతా గమనిస్తూనే వున్నాను. నువ్వు నా దగ్గరకి వచ్చిన దగ్గరనుంచి నీ గతచరిత్ర గురించి ఆచూకీ తీయించాను. నీ మీద నమ్మకం పోయింది. ఇదివరలో నువ్వు డబ్బుకి ఆశపడి ఎలాంటి పాడుపనీ చెయ్యనివాడివి, ఇప్పుడే ఎందుకు చేస్తున్నట్లు? మర్యాదగా విమానం దింపేయి వెంటనే బయలుదేరినచోట."

"ఎక్కడా రన్‌వే లేదు క్రింద. నేను చెప్పేది..."

"ఢాం."

ధనీలాల్ చేతిలోని రివాల్వర్ పేలింది. గుండు విహారి కుడి భుజంలో గుచ్చుకుంది.

"క్రేష్‌లేండ్ చెయ్యి వెంటనే. రక్తం కారిపోతుంది ఆలస్యం చేస్తే. క్రిందకి దిగితేనే నీకు వైద్యసదుపాయం లభించేది."

మెరుపులా లేచాడు విహారి అంత బాధలోనూ. అనుకోలేదు, ఎదురుచూడలేదు ధనీలాల్ విహారి ఎదురు తిరుగుతాడని. క్షణకాలంలో ధనీలాల్ క్రిందపడ్డాడు. రివాల్వర్ విహారి చేతిలోకి వచ్చేసరికి మరో రెండు సార్లు పేలింది విమానంలో రివాల్వర్.

అదృష్టవశాత్తు కేబిన్ వైపు గురిపెట్టబడివుంది రివాల్వర్. రెండు గుళ్ళు వెళ్ళి విమానం కిటికీకి అమర్చిన గాజు పలకలకి తగిలాయి. కాక్‌పిట్‌కి ఏంకాలేదు.

అంతే!!

గాజుపలక బ్రద్దలవగానే ప్రెషరైజ్ చేయబడ్డ విమానం కేబిన్‌లోకి బయటిగాలి ఒక్కసారిగా దూసుకువచ్చింది. 4,500 అడుగుల ఎత్తున వందలమైళ్ళ వేగంతో వెళ్తున్న ఆ విమానం కేబిన్‌లోకి గాలి దూసుకువచ్చింది.

ధనీలాల్‌ని బలమంతా వుపయోగించి బయటకి, కాబిన్ లోకి నెట్టాడు విహారి. నెడుతూ చూసాడు. ఇద్దరు పగిలి పోయిన ఆ గాజు కిటికీలోంచి బయటకి, విమానంలోంచి బయటకి గాలి తీవ్రత చేత లాగివేయబడ్డారు. అరుస్తూ బయటకి పడిపోయారు వాళ్ళు.

పుస్తకాలు, సీట్లకి కట్టివున్న గలీబులు ప్రతీ చిన్న వస్తువు గాలిచేత ఆ కిటికీలోంచి లాగివేయబడుతోంది బయటకి. అంతా సీట్లని గట్టిగా పట్టుకుని బయటకి, గాలి లాగుతూంటే అరుస్తున్నారు ప్రాణభయంతో.

విహారి క్షణకాలం ఆలోచించాడు. వాళ్ళంతా పెద్ద మనుషులు. చట్టం కళ్ళు కప్పగలరు. చట్టం కళ్ళు తెరచినా దాని నోరు మూసి, చేతులు, కాళ్ళు విరగ్గొట్టగలరు తమ అధికారంతో, ధనబలంతో. వీళ్ళని న్యాయస్థానానికి అప్ప

గించినా, రుజువులు దొరకవు. దొరికినా న్యాయస్థానం విధించే శిక్ష, అసలు శిక్షఅంటూ విధిస్తే, వీళ్ళ పాపానికి సరిపడా విధించదు.

వీళ్ళని వదిలివేస్తే అనేకమంది అనూయకమయిన వాళ్ళు వీళ్ళ వ్యాపారానికి బందీఅయి శాశ్వతంగా బలి అవుతారు. వీళ్ళని వదలకూడదు. వీళ్ళని వదలకూడదు. అవును. తన ప్రాణం పోయినా సరే వీళ్ళని వదలకూడదు ఎంతమాత్రం.

తన చేతిలోని రివాల్వర్‌తో గురిచూసి మూడు కిటికీల కున్న అద్దాలని పగలకొట్టాడు విహారి. గాలి ఉధృతంగా వచ్చింది అన్నివైపులనుంచి. మిగిలిన కిటికీల కున్న గాజు తలుపులు కూడా చిట్లిపోతున్నాయి ఆ గాలి వుధృతానికి.

అతి బలవంతంమీద కాబిన్‌కీ, కాక్‌పిట్‌కి మధ్యవున్న తలుపు వెయ్యడానికి ప్రయత్నించి వేసాడు. ఆ తలుపు గాలి ప్రెషర్‌కి ఏ క్షణంలోనయినా విరిగిపోవచ్చు. తను కూడా బయటకి నెట్టివేయబడవచ్చు వాళ్ళలాగే.

తన సీట్లో కూర్చుని, సీట్ బెల్ట్ కట్టుకుని విమానాన్ని ఇంకా పైకి తీసుకువెళ్ళాడు 7500 అడుగుల ఎత్తు. కాబిన్ ప్రెషర్ గేజ్ వంక చూసాడు 'జీరో' చూపిస్తోంది.

గబగబా వైర్‌లెస్ సెట్ తగిలించుకుని చెప్పాడు భుజం నుంచి రక్తం ఇంకా కారుతూంటే.

"బాంబేకి వుత్తరాన ఇరవైఏడు మైళ్ళ దూరంలోవున్న పంచవటి సేవాశ్రమంలో బ్లూ ఫిలింస్ తయారుచేస్తున్నారు. అక్కడ అనేకమంది చిన్నపిల్లలని బంధించి వుంచారు. వాళ్ళని వెంటనే విడిపించడం మీ బాధ్యత.

ఆ పన్నెండుమంది ప్లెషర్ మర్చెంట్స్‌ని కలిపి తీసిన రీల్ వున్న కెమేరాని పేరాష్యూట్‌లో 16 డిగ్రీస్

ప్రాంతంలో వదులుతున్నాను. వాళ్ళందరినీ యిప్పుడే ఫోటోలు తీశాను. బహుశ, వాళ్ళలో ఎవరూ బ్రతుకుతా రనుకోను."

గబగబా పేరాచ్యూట్ కి కెమేరా కట్టి, "ఇజెక్ట్" అని వ్రాసివున్న బటన్ మీద వేలు వుంచాడు. అది నొక్కితే ఆటోమేటిక్ గా పేరాచ్యూట్ క్రింద పడిపోతుంది విచ్చుకుని.

"వాళ్ళందరి మీద కసి తీర్చుకున్నాను..."

"హలో విహారి. ఏం అబద్ధం ఆడావు ధనీలాల్ తో. ఎలా నమ్మాడు నిన్ను ధనీలాల్?" అడిగారు అవతలనుంచి తాము వినేదంతా నమ్మలేనట్లుగా.

"అసలు దేనికి ఇదంతా చేసావు?" అడిగారు మరెవరో.

"దుర్మార్గులు" పళ్ళు పటపట కొరికాడు కమాండర్ విహారి. "ఓ పోర్నోగ్రఫీ పుస్తకంలో చూసాను బొమ్మ. తర్వాత 'ది స్కూల్ గర్ల్' అనే లెస్బియనిసమ్ తో నిండిన బ్లూ ఫిలిం చూసాను. ఆ రెండిటిలో వున్న పద్మాలు గేళ్ళ పిల్ల నా..."

"స్సీ?"

దుఃఖాన్ని ఆపుకుంటూ చెప్పాడు విహారి:

"నా చిన్న చెల్లెలు. మూడేళ్ళ క్రితం తప్పిపోయింది. నా చిన్న చెల్లెలిని ఎత్తుకు వెళ్ళి ఈ స్లెవర్ మర్చెంట్స్ ఆ విధంగా వాడుకున్నారు తమ వ్యాపారం కోసం. అందుకే అందరినీ నా ప్రాణం పోతున్నా..."

కాబిన్ కీ, కాక్ పిట్ కి, మధ్య తలుపు పగిలిపోయింది పెద్ద శబ్దంతో. హోరున గాలి తోసుకువచ్చింది. కాక్ పిట్ నిండా గాలి, చెవులు చిల్లులుపడే రొద. వినపడటంలేదు

ఎంత బిగ్గరగా అరచి చెప్పినా.

విమానంపని అయిపోయిందని గ్రహించాడు విహారి, ఓ మూల పొగచూడగానే.పూర్తిగా ధ్వంసం అయిపోతోంది.

'ఇజెక్ట్' బటన్ నొక్కాడు విహారి.

తెల్లటి పేరాచ్యూట్ మరుక్షణంలో విడిపోయింది విమానంనుంచి, నేలవైపుకు కెమెరాతో.

నాలుగయిదు క్షణాల తర్వాత ఏవ్రో HS-748 గాలిలో పేలిపోయింది గేసొలిన్ టేంకర్ అంటుకుని.

బ్లూ ఫ్లేమ్స్—నీలి మంటలు ఆకాశం నిండాయి.

—: ఐపోయింది :—

# ఏడు హత్యలు

## వాసవదత్త

ప్రొఫెసర్ వామ్ డ్రెస్సింగ్ టేబుల్‌ని వెనక్కి జరిపి, చేతుల్ని డెట్టాల్‌తో శుభ్రంగా కడిగి తుడుచుకున్నారు.

ఇన్‌స్పెక్టర్ రంజిత్ కుడికంటిని తడుముకుని లేచి నిలబడ్డాడు.

"అయితే కంటి కేమీ జరగలేదన్నమాట" అన్నాడు రంజిత్.

"అబ్బె, ఏదో నలుసుపడి ఉంటుంది. నాలుగు వందల మైళ్ళు ఎండలో మోటార్ సైకిల్ పైన ప్రయాణం వలన కలిగిన ఫలితం అది. ఈసారినుండి గాగుల్స్ ఉపయోగించు"

అన్నారు ప్రొఫెసర్ వామ్.

రంజిత్ మెడ్రాస్‌కి పోలీస్ కాన్ఫరెన్స్‌కి అటెండ్ అయ్యేడు. ఆ వారం రోజుల్లో నగరంలో అనేక విచిత్ర సంఘటనల్ని వామ్ ఎదుర్కొనవలసి వచ్చింది.

వారంరోజులపాటు కల్లోల పరచిన కేసు ఆ ముందరి రోజు రాత్రి అకస్మాత్తుగా ముగిసింది.

డ్రెస్సింగ్ టేబుల్‌కున్న సొరుగుల్ని తెరిచి కొన్ని పరికరాల్ని పైకి తీసేరు వామ్.

మొట్టమొదటి పరికరం నూతిలోనుండి బకెట్లని పైకిలాగే గాలం. దాని చివరలు బాణం మొనల్లా పదునుగా ఉండి తళతళలాడుతున్నాయి. అది మామూలు గేలం మాదిరికాక చాలా బరువుగా, దృఢంగా పెద్దసైజులో ఉంది. దానికింకా అక్కడక్కడ రక్తపు మరకలు అంటుకుని ఉన్నాయి.

రెండవ పరికరం పదునయిన శూలం మొన. దాని చివరన ఉండవలసిన కడ్డీ భాగం మొదలంటూ కోసివేయబడింది. దానికికూడా జేగురురంగులో ఎండిన రక్తపు మరకలున్నాయి.

మూడవది ప్లాస్టిక్ సంచి. దాని మూతివద్ద గుండ్రని కన్నం ఉండి, చుట్టూరా బిగించేందుకు వీలుగా స్టీల్ వైర్ ఉంది.

నాలుగవ పరికరం ఇనుపగోళ్ళ సెట్టు. పాతకాలం మల్లయోధులు వేళ్లకి ఆ గోళ్ళని తొడుగుకుని జంతువులతో ముష్టాముష్టి పోరాడి వధించేవారు.

అయిదవది ఒక బూట్లజత. మందమయిన ఎనుముచర్మంతో కుట్టిన పెద్దబూట్లు, వాటి అడుగున ఫుట్‌బాల్ ఆటగాళ్లు ఉపయోగించే ముల్లు ముల్లుగా ఉండే ఉక్కునాడాలు వున్నాయి. ఉక్కునాడాలకి సన్నని చర్మపు తునకలు అతుక్కుని ఉన్నాయి.

"క్రిందటి వారం జరిగిన హత్యలలోని కీలక పాత్రల్ని ఈ పనిముట్లు నిర్వహించేయి" అన్నారు వామ్.

ఇన్స్పెక్టర్ రంజిత్ కుర్చీని ముందుకు లాక్కొని కూర్చున్నాడు.

## 2

అది ఏడు రోడ్ల జంక్షన్.

అమ్ములపొదినుండి వెలువడ్డ బాణాల్లా ఏడు రోడ్లూ నలు దిక్కులా సాగుతాయి.

జంక్షన్ నిర్మానుష్యంగా వుంది. ఒకే ఒక వ్యక్తి జంక్షన్ వద్ద ఎలక్ట్రిక్ స్తంభం దిగువ నిలబడి వున్నాడు. అతని నోటిలోని చుట్ట గుప్ గుప్పున పొగల్ని కక్కుతోంది. పొడుగాటి షేర్వాని, తెల్లని గ్లాస్కో పంచె, కళ్లకి రిమ్ లెస్ అద్దాలు, చేతిలో సన్నని వాకింగ్ స్టిక్ వున్నాయి. మనిషి ఆరడుగుల పొడవుండి, భారీగా వున్నాడు. మనిషి నడి ప్రాయం దాటని కారణంచేత, చేతిలోని వాకింగ్ స్టిక్ అలంకార ప్రాయంగా వుండిపోయింది.

జంక్షన్లో మేరుపర్వతంలా వున్న ఏడంతస్తుల భవనం కార్పొరేషన్ లైట్లకాంతిలో కళకళలాడుతోంది. అతను దానికి యజమాని. కె. పి. రామ్ డిపార్ట్మెంటల్ స్టోర్స్ నగరంలో చాలా ప్రసిద్ధి చెందింది. భవనం అడుగుభాగాన్న ఏయిర్ కండిషన్డ్ ఆఫీసులో అతనుంటాడు, పైన అంతస్తుల్ని రకరకాల డిపార్ట్మెంట్స్గా విభజించి, సూపర్ బజార్ లాంటి డిపార్ట్మెంటల్ స్టోర్స్ని నడిపిస్తున్నాడు. కస్టమర్స్ని పైకి తీసుకుని వెళ్ళేందుకు లిఫ్ట్ సౌకర్యం వుంది.

ఆరోజు శనివారం అవటంచేత ఎనిమిది గంటలకే మూసి వేసి ఉద్యోగులందర్ని ఇళ్లకి పంపివేసేడు.

కె. పి. రామ్ పేరు వింటే గొప్ప గొప్ప వ్యాపారులు, పోలీసు అధికారులు, ఉన్నత పదవుల్లో వున్న ఆఫీసర్లు గౌరవంతో లేచి నిలబడతారు.

అతను చాలా మర్యాదస్తుడని, చాలా ధనవంతుడని అంతటా మార్మోగింది. అతిసామాన్యుడు అతడ్ని కలిసినా కె. పి. రామ్ మర్యాదతో ఆహ్వానిస్తాడు. అతని ఖ్యాతి సుగంధంలా వెల్లివిరియడానికి ఆ ఒక్క సుగుణం చాలు.

అతను సిగార్ ఆఖరి దమ్ములాగి పారవేసేడు. గుప్పున వదలిన పొగ కరిగేలోపున అతని ప్రక్కన దీర్ఘకాయుడొకడు ప్రత్యక్షమయ్యేడు.

నీలం సూట్, ఈవెనింగ్ కాప్ ధరించేడతడు.

“గుడ్ ఈవెనింగ్. మీ కోసమే ఎదురుచూస్తున్నాను” అన్నాడు కె. పి. రామ్ అతనితో కరచాలనం చేసి.

నీలంసూట్ అతన్ని అనుసరించేడు.

ఇద్దరూ జంక్షన్ విడచి, మొదటి రోడ్ లో నడవసాగేరు. పది నిముషాలు మౌనంగా నడిచేరు.

పేవ్ మెంట్లపైన బిక్షగాళ్ళు చేసే గురకలు చప్పుడు మినహాయిస్తే వాతావరణం నిశ్శబ్దంగా వుంది. తొమ్మిది గంటలు దాటిన తర్వాత జనసంచారం లేకపోవడంచేత రోడ్డంతా నిర్మానుష్యంగా వుంది. చెదురుగా ఒకటి అర టాక్సీ జూమ్ అంటూ వారిని అధిగమించి పోతోంది.

“గత ఆరు రోజులుగా జరుగుతున్న ఆందోళనల్ని ప్రతి పౌరుడిలాగే ఉత్సాహంగా తిలకించేను. కాని నిన్నటి సంఘటనతో నా మనసు చెదిరిపోయింది” అన్నాడు కె. పి. రామ్ నిశ్శబ్దాన్ని చీలుస్తూ.

నీలంసూట్ మౌనంగా పైప్ పీలుస్తూ నడవసాగేడు.

"నేను స్వయంశక్తితో నా భవిష్యత్తుని నిర్మించుకుంటూ ఔన్నత్య శిఖరాన్ని చేరుకున్నాను. ప్రతి చిన్నపనిని నాకు నేనే చూసుకుంటాను. కాని ఈ విషయంలో మీ హెల్ప్ కావాలి" అన్నాడు కె. పి. రామ్.

"నాతో వివరంగా చర్చించాలంటే పదండి. పార్క్ కి వెడదాం" అన్నాడు నీలం సూట్ వ్యక్తి.

"వద్దు. నడుస్తూనే వివరిస్తాను" అన్నాడు కె. పి. రామ్.

"మీ యిష్టం. అలాగే కానీయండి" అన్నాడు నీలం సూట్ జేబు తడుముకుంటూ.

కె. పి. రామ్ మరో పొడుగాటి సిగార్ తీసి వెలిగించి మొదలుపెట్టేడు:

"ఈ రోడ్ లో మత్స్యేంద్రా క్లినిక్ వుంది. దాని పేరు మీరు వినే వుంటారు. డాక్టర్ మత్స్యేంద్రసేన్ దానికి సోల్ ప్రొప్రయిటర్. పూర్వం కలకత్తాలో నేచురల్ థెరపీ ఇన్స్టిట్యూట్ ని నడిపేవాడు. ప్రకృతి చికిత్సలో అతన్ని మించిన వైద్యుడు లేడని ఆసియా అంతటా వ్యాపించింది.

పదేళ్ళుగా అతను ఈ ప్రదేశంలో ప్రాక్టీస్ కొనసాగిస్తున్నాడు. ఎడమచేతివైపు ఉన్న నాలుగు బిల్డింగ్స్ ని పడగొట్టి పెద్ద పోలీక్లినిక్ ని స్థాపించి, రకరకాల ఆధునిక యంత్రాల్ని తెప్పించి భారీ ఎత్తున ప్రాక్టీస్ మొదలెట్టేడు.

రెండేండ్లలో అతని ప్రాక్టీస్ ఉచ్ఛదశకి చేరుకుని ధనవంతులందరూ అతన్ని ఫేమిలీ డాక్టర్ గా చేసుకున్నారు. స్వతహాగా డాక్టర్ సేన్ చాలా మంచివాడు. అతనికి డబ్బు కాపీనం తప్పిస్తే మరే చెడు అలవాటూ లేదు."

కె. పి. రామ్ సిగార్ దమ్ములాగేందుకు ఆగి, ఊపిరితిత్తుల నిండా పొగపీల్చి వదిలేడు.

"ఔను. మనిషి చాలా ఉత్తముడు. కాని ఫారిన్ నుండి బంగారం స్మగుల్ చేసి, ఇతరదేశాలకి గంజాయి ఎగుమతి చేస్తాడని తెలుసు" అన్నాడు నీలం సూటు.

కె. పి. రామ్ అతని ముఖంలోకి తేరిపారచూసి తిరిగి మొదలెట్టేడు:

"అతడు స్మగ్లర్ అని నాకు తెలియదు. కాని ప్రఖ్యాత వైద్యుడని చెప్పడానికి ఎలాంటి సందేహంలేదు. ఆస్టియో పతీలో అందెవేసిన చెయ్యి. ఏ రోగాన్నయినా సరే అతడు ఆస్టియోపతీ ద్వారా నయం చేసేస్తాడు. ఆస్టియోపతీ ఒక చిత్రమయిన-ప్రక్రియ. అలోపతీ, హోమియోపతీ, నేచురో పతీలాగే ఇదికూడా పురాతనమయిన థెరప్పీ. కాని ఈ వైద్యా నికి ఏవిధమయిన మెడిసన్స్ వాడరు. అందుకే రోగులు వందలకొద్ది అతని చుట్టూ మూగేవారు. మచ్ఛేంద్రసేన్ వారి దగ్గరనుండి వేలకొద్దీ రాబట్టేవాడు."

నీలంసూట్ వ్యక్తి మధ్యలో కల్పించుకుని అన్నాడు:

"అక్యుపంక్చర్ లాగే ఆస్టియోపతీకి కూడా మందులు అన వసరం. నాడీ స్థానాల్లో సూదుల్ని గుచ్చి, వాటి స్పంద నాల్ని మార్చే విధానం అక్యుపంక్చర్. ఆస్టియోపతీ సిద్ధాంతం ప్రకారం కొన్ని ఎముకలు కీళ్ళనుండి తొలగి ప్రక్కనున్న నరాల్ని, కండరాల్ని నెమ్మదిగా ఒత్తి బాధ స్తాయి. దానిమూలంగా రకరకాల రోగాలు తలెత్తుతాయి. తిరిగి ఆ ఎముకల్ని యథాస్థానానికి తెచ్చినప్పుడు నరాల మీద ఒత్తిడి తగ్గి రోగం నయమవుతుంది."

కె. పి. రామ్ ఈ థియరీ విని ఆశ్చర్యపోయేడు.

"మీకు వైద్యంలోకూడా పరిజ్ఞాన ముందన్నమాట" అన్నాడు.

నీలంసూట్ నవ్వి ఊరుకున్నాడు.

"మశ్చేంద్రసేన్‌కి చెప్పుకోదగినంత ఘోర శత్రువు లెవరూ లేరు. అతని సంపాదన చూస్తే తోటి డాక్టర్లకే కంటగింపు. ధనికుడ్ని చూసి ద్వేషించడం లోకసహజం. కాని ఆ చిన్నకారణానికి అతన్ని హత్య చేసేందుకు ఎవరికీ ఆస్కారంలేదు" అన్నాడు కె. పి. రామ్.

ఇద్దరూ మశ్చేంద్రా క్లినిక్‌కి ఎదురుగా ఉన్నారు. రోడ్డుకి కుడిచేతివైపున అతని పాలీక్లినిక్ వుంది.

మశ్చేంద్రసేన్ మరణించినందువలన అది సీల్ చేయబడింది. అత్యంత ఆధునికమయిన పరికరాలతో, వందమందికి పైగా నర్సులతో కళకళలాడే క్లినిక్ శాశ్వతంగా మూతబడింది.

"అదే అతని క్లినిక్" అన్నాడు కె. పి. రామ్.

నీలంసూట్ వ్యక్తి తలూపేడు.

"సోమవారంనాడు మశ్చేంద్రసేన్ ఫామిలీ సర్కస్‌కి వెళ్లేరు. అతను తొమ్మిది గంటలకి డిస్పెన్సరీనుండి ఇంటికి వచ్చేడు. నౌకర్లు టేబుల్ పైన డిన్నర్ ఏర్పాటుచేసి వెళ్ళిపోయేరు. సేన్ స్నానంచేసి బాత్‌రూమ్‌లోనుండి వస్తూండగా మేడమీద అడుగుల చప్పుడయింది.

అతను టార్చి వెలిగించి చూసేడు. అంతే. రివ్వుమని బుల్లెట్ దూసుకునివచ్చి టార్చిని ఎగరగొట్టింది. మశ్చేంద్రసేన్ భయపడి పెరడులోకి పరుగెత్తేడు. ఈసారి హంతకుడు పిస్టల్ పేల్చలేదు. మశ్చేంద్రసేన్ నూతిదగ్గరికి పరుగెత్తేడు.

నూతిగట్టువద్ద పాచిపట్టి ఉన్నందువలన జర్రున జారిపోయేడు. అతను లేచి నిలబడేలోగా వీపులో పదునయిన ఆయుధం దూరింది. రక్తం బట్టలమీద చిందకుండా హంత

కుడు దూది పట్టుకున్నాడు. నూతిగట్టువద్ద రక్తంతో తడిసిన దూది కనిపించింది. మశ్చేంద్రుని శవాన్ని పీక పట్టుకుని నీటిలోకి విడిచి రక్తం పూర్తిగా కారిపోయిన తర్వాత గాలంతో గ్రుచ్చి పైకిలాగి వ్రేలాడదీసేడు."

పూర్తిచేసేడు కె. పి. రామ్.

"వెరీ వెరీ సైంటిఫిక్. హంతకుడు హత్య క్లినికల్ గా చేసేడు" అన్నాడు నీలంసూట్ వ్యక్తి.

ఇద్దరూ మొదటి రోడ్డు దాటి రెండవ రోడ్ లోకి తిరిగేరు.

* * *

"అదే ఈ గాలం. క్రైమ్ బ్రాంచ్ వారి నడిగి తీసుకున్నాను" అన్నాడు రామ్.

"చాలా హారిబుల్. హంతకుడు చాలా నీట్ గా హత్య చేసేడు" అన్నాడు ఇన్ స్పెక్టర్ రంజిత్.

"అవును. హత్య జరిగిన విధానం గమనిస్తే హంతకుడికి వైద్యపరిజ్ఞానం ఉందని తెలుస్తోంది. కత్తితో సరిగ్గా హృదయానికి, ఊపిరితిత్తులకి దిగువన పొడవడం, రక్తం చిందకుండా కాటన్ వుపయోగించడం, రక్తం పూర్తిగా కారేటట్టు నూతిలో దించడం, తిరిగి పదునయిన గాలంతో మెడలో గుచ్చి వ్రేలాడదీయడం అతని నైపుణ్యాన్ని వెల్లడి చేస్తున్నాయి" అన్నారు ప్రొఫెసర్ రామ్.

బట్లర్ వేడి వేడి కాఫీ రెండు కప్పుల్లో తెచ్చి టేబుల్ మీదుంచేడు. మరో పెద్ద ప్లేట్ లో బ్రౌన్ గా వేచినటోస్ట్స్, వెన్న వున్నాయి.

రంజిత్ టోస్ట్ కి వెన్నరాచి రెండు తుంపులు కొరికి "నైస్" అన్నాడు కొద్ది కాఫీ సిప్ చేసి.

ఆదివారం అయినందువలన ఇన్ స్పెక్టర్ రంజిత్, కేసు

పూర్తయినందువలన ప్రొఫెసర్ వామ్ ఇద్దరూ హాలిడే మూడ్‌లో ఉన్నారు.

సీలింగ్ ఫాన్ గిరగిరా తిరుగుతూ చల్లని గాలి అందిస్తోంది.

రంజిత్ టిఫిన్ పూర్తిచేసి మూతి తుడుచుకుని "ఏమైనా ఆధారాలు దొరికేయా" అన్నాడు.

"హంతకుడ్ని పట్టివ్వడానికి ఒక్క ఆధారంకూడా లేదు. హత్య గావించిన బాకు నూతివద్ద కనిపించలేదు. గాలంమీద వుండవలసిన వేలిముద్రలు నీటిలో కరిగి మాయమయ్యేయి. ఇక గత్యంతరంలేక పోలీస్ డాగ్స్‌ని రెండింటిని తెప్పించి హత్యాప్రదేశాన్ని వాసన చూపించేము. కాని ప్రయోజనం లేకపోయింది" అన్నారు వామ్.

"మన డిపార్ట్‌మెంట్ కుక్కలు చాలా మంచివని పేరుంది?" అన్నాడు రంజిత్.

"అవును. మన డాగ్స్ చాలా ఉత్తమ జాతివి. కాని హంతకుడు హత్యగావించేముందు బట్టలకి స్పిరిట్ పూసుకుని వచ్చేడు. హత్య పూర్తికాగానే గార్డెన్‌లోకి నడిచి ఫౌంటెన్ వద్ద బట్టల్ని విడిచి వాటికి నిప్పంటించేడు. ఫౌంటెన్‌లో దిగి శుభ్రంగా స్నానంచేసి చీకట్లోపడి మాయమయ్యేడు. కేవలం డ్రాయర్ మాత్రం అతడి ఒంటిమీద మిగిలింది. ఈవిధంగా కుక్కలు వాసన చూసేందుకు అవకాశం లభించలేదు.

"హంతకుడు చాలా తెలివైనవాడిలా వున్నాడు" రంజిత్ అన్నాడు.

"చాలా తెలివిగా హత్యగావించేడు. గత వారమంతా ఈ కేస్‌తోటే రాత్రింబగళ్ళు శ్రమించేను. సమయానికి నువ్వుకూడా ఊరిలోలేవు" అన్నారు వామ్.

"ఫరవాలేదు. మీ నోటంట వింటాను. చెప్పండి" అన్నాడు రంజిత్.

# 3

మొదటి రోడ్ లాగే ఆ రోడ్డుకూడా నిర్మానుష్యంగా ఉంది.

నీలంసూట్ వ్యక్తి బూట్లచప్పుడు, కె.పి. రామ్ వాకింగ్ స్టిక్ చప్పుడూ లయబద్ధంగా వినిపిస్తున్నాయి.

కార్పొరేషన్ లైట్లు చీకటి అధికమవుతున్న కొద్దీ ధగధగాయమానంగా వెలుగుతున్నాయి.

"కూర్మారావు ఇల్లు ఈరోడ్ లో వుంది. అతను పేరు మోసిన ముత్యాల వర్తకుడు" అన్నాడు కె. పి. రామ్.

"అతన్ని చాలాసార్లు కలిసేను. ఒకసారి రంగూన్ హోల్ సేల్ వర్తకులు ఇతన్ని ముత్యాలు టోకుధరన పంపమంటే సగం ముత్యాలూ, సగం బార్లీగింజలూ కలిపి పంపేడు. వారు ఇదేమిటని అడిగితే సరుకు డిశ్పాచ్ చేసేంతవరకే నా పూచీ, అటుపైన ముత్యాలన్నీ బార్లీగింజలుగా మారిపోయినా తనకేమీ పట్టదు అని సుప్రీంకోర్టు వరకూ వెళ్ళిన వ్యక్తి కూర్మారావు" అన్నాడు నీలంసూట్.

"అయితే అతని సంగతి నాకంటె మీకే ఎక్కువగా తెలుసులా ఉంది" అన్నాడు కె. పి. రామ్.

"అతని చరిత్ర తర్వాత చెప్తాను. ముందు అతని గురించి ఏదో చెప్పబోయేరు. అదేమిటో చెప్పితే వింటాను" అన్నాడు నీలంసూట్.

కె. పి. రామ్ పీలుస్తున్న సిగార్ ఎప్పుడో ఆరిపోయింది. కొత్త సిగార్ తీసి నోట పెట్టుకున్నాడు.

నీలంనూట్ వ్యక్తి ఆరిపోయిన తన పైప్ తోపాటు, అతని సిగార్ ని కూడా వెలిగించేడు.

"థాంక్స్" అని దమ్ముపీల్చి పొగ వదులుతూ కె. పి. రామ్ తిరిగి కథనం సాగించేడు:

"కూర్మారావు తన జ్యూయలరీ అంతటిని మేడమీది గదిలోనే ఉంచుతాడు. రాత్రిపూట అదేగదిలో ఓమూలపడక వేసుకుని నిదురపోతాడు.

ఆ గదికి బర్గ్లర్ అలారం అరేంజ్ మెంట్ ఉంది. దొంగలు గది తలుపువద్దకు రాగానే అలారం గణగణమంటూ మ్రోగుతుంది. మ్రోగుతున్నపుడు పారిపోదామని చూసిన వ్యక్తికి మెట్లవద్ద షాక్ తగులుతుంది. ఇంతేకాక ఆ దొంగ ముఖాన్ని క్లియర్ గా ఫోకస్ చేసేందుకు పది పదిహేను ఆర్క్ లాంప్ లు గప్పునంటూ వెలిగి అతని ఫోటో ఆటోమేటిక్ గా తీయబడుతుంది.

కాని దీనంతటికి ముఖ్యమయిన లోపం ఒకటి ఉంది. కరెంట్ సప్లై లేకపోతే ఈ అరేంజ్ మెంటు యావత్తూ వృధా అయిపోతుంది. కూర్మారావు ఆ గదిని మరింత పటిష్ఠం చేయడానికి ఈ మధ్యనే స్వంత డైనమోని ఏర్పాటుచేసి కరెంట్ లేని పక్షాన డైనమోద్వారా సప్లై ఉండేట్లు చేసుకున్నాడు.

మంగళవారంనాడు దురదృష్టవశాత్తు డైనమో పాడయిపోయింది. కూర్మారావు హుటాహుటిన ఫోన్ చేసి ఎలక్ట్రిషియన్ ని పిలిపించేడు.

ఎలక్ట్రిషియన్ వచ్చిన కొద్ది నిముషాలకి కరెంట్ సప్లై కూడా పోయింది. కూర్మారావు ఎలక్ట్రిషియన్ని మేడమీదికి పిలిపించి అలారం పనిచేయడం లేదని చెప్పేడు. మిట్ట

మధ్యాహ్నం మేడపైన గదిలోకి వెలుతురు బాగా రాదు. అయినా ఎలక్ట్రీషియన్ నల్లని కళ్ళద్దాలు పెట్టుకుని ఉన్నాడు.
కూర్మారావుకి అనుమానం వేసి అతడ్ని దగ్గరగా రమ్మన్నాడు. ఎలక్ట్రీషియన్ నవ్వుతూ దగ్గరికి వెళ్ళి కళ్ళద్దాలు తీసివేసేడు. కూర్మారావు ముఖం వెలవెలబోయింది. అతడి చేయి అప్రయత్నంగా టెలిఫోన్ మీదికి పోయింది.

ఎలక్ట్రీషియన్ చేయి బేగ్ లోకి వెళ్ళి రక్కున బయటికి వచ్చింది. ఒకేఒక దెబ్బతో టెలిఫోన్ వైర్ని కట్ చెయ్యడం, రెండవపోటుతో కూర్మారావుని పడవడం జరిగింది.''

''ఎలక్ట్రీషియన్ని ఎవరూ గుర్తించలేదా?'' అడిగేడు నీలంసూట్ వ్యక్తి.

''ఎవరూ శ్రద్ధగా గమనించలేదు. అతను భారీగా, పొడుగ్గా ఉన్నాడని అన్నారు'' చెప్పేడు కె. పి. రామ్.
మాట్లాడుతూన్నంతసేపూ ఇద్దరూ నడుస్తూనే ఉన్నారు. ఆ రోడ్ లోనే ఉంది కూర్మారావు ముత్యాల దుకాణం.

''అదే కూర్మారావు దుకాణం. దుకాణానికి కూడా అలారం అరేంజ్ మెంట్ ఉంది'' అన్నాడు కె. పి. రామ్.
''అలారం లేకముందు ఒకసారి దుకాణంలోకి వెళ్ళేను. అలా వెళ్ళడం రెండవసారి. ఒకసారి అనుపానులు తెలుసుకున్నాను. రాత్రి ప్రవేశించడంలో సులువయింది'' అన్నాడు నీలంసూట్.

కె. పి. రామ్ జేబురుమాలుతో ముఖం తుడుచుకున్నాడు.

''కాని ఆరోజు విలువయిన ముత్యాలేం దుకాణంలో లేవు'' అన్నాడు నీలంసూటు.

''రాత్రిపూట దుకాణాల్లోకి దూరడం గురించి మీవద్ద

ట్రెయినింగ్ తీసుకోవాలి" అన్నాడు కె. పి. రామ్.

"ష్యూర్. ఆ నీటిగొట్టంపట్టుకుని ఎక్కి బాల్కనీ మీదికి వెళ్ళాలి. ఆ తర్వాత—" నీలంసూట్ వ్యక్తి ఇంకా వివరించబోతూండగా కె. పి. రామ్ అతడి చేయినొక్కి—

"మీరు తొందరగా నడవండి. తాళాలు బద్దలుకొట్టడం గురించి తర్వాత తెలుసుకుంటాను. పోలీసుకి కనబడితే ఇద్దరినీ లాకప్‌లో పెడతారు" అన్నాడు కె. పి. రామ్ ముందుకి దారితీస్తూ.

నీలంసూట్ అడుగులో అడుగు వేసుకుంటూ అతన్ని అనుసరించేడు. ఇద్దరూ మూడోరోడ్డులోకి తిరిగేరు.

* * *

"రెండు రోజుల్లో రెండు హత్యలు. హారిబుల్! రెండింటిని నేను చూడలేకపోయేను" అన్నాడు ఇన్‌స్పెక్టర్ రంజిత్.

"ఈ శూలపు మొనయే ఆ హత్యాయుధం. కాని దీని మీద వ్రేలి ముద్రలు లేవు" అన్నారు వామ్.

"అవును. ఎలక్ట్రిషియన్ రబ్బరు గ్లవ్స్ వేసుకుని ఉంటాడు."

"కరెక్ట్. ఎలక్ట్రిషియన్ వద్ద గ్లోవ్స్ ఉండడం చాలా సహజం. ఈ సారి కూడా హంతకుడు తెలివిగా ప్రవర్తించేడు" అన్నాడు వామ్.

ఇన్‌స్పెక్టర్ రంజిత్ హత్యాయుధాన్ని తీసుకుని పరిశీలించేడు.

దానికింకా ఎండి పోయిన రక్తపు మరకలు ఉన్నాయి. పదకొండంగుళాల పొడవు, బెత్తెడు వెడల్పు ఉండి రెండు వైపులా పదును కల్గిన మొనదేలిన ఆయుధం అది. ప్లాస్టిక్‌తో

పోత పోసిన శూలం తాలూకు కడ్డీని మొదలంటా కోసి వేయగా మిగిలిన భాగం అది.

దానిని ఎక్కడో చూసినట్లనిపించింది రంజిత్‌కి.

“శూలపు మొనని చూసి మొత్తం శూలాన్ని ఊహించు. దానితో పాటు ధరించ వలసిన శిరస్త్రాణం, కవచాన్ని కూడా ఊహించు” అన్నారు వామ్.

రంజిత్ కళ్లు మూసుకొని ఆయన చెప్పిన విధంగా మనో ఫలకం మీద ఊహించాడు.

“ఆఁ. ఆ కవచాన్ని ఒకసారి మ్యూజియమ్‌లో చూసేను. నాకు బాగా గుర్తు. ఆయుధాల గదికి చెరో వైపున సైనికుల బొమ్మలున్నాయి. వాటి చేతుల్లోని శూలం ఇది” అన్నాడు రంజిత్.

“రైట్. నాకూ అలాగే తోచింది. ఎంక్వయిరీ చేయగా నిజమని ఋజువయింది. కూర్మారావు ఎలక్ట్రిషియన్ కోసం ఫోన్ చేసినపుడు షిఫ్ట్ మీద నలుగురు మాత్రమే పని చేస్తున్నారు. నేను నలుగురి ఇళ్ళకి వెళ్ళి ప్రతి ఒక్కరిని ముఖాముఖీగా కలుసుకున్నాను. నాలుగో వ్యక్తి ఇల్లు మూసి ఉంది. లోనికి వెళ్ళి చూస్తే అతడు కాళ్ళూ, చేతులూ కట్టబడి మూల పడి ఉన్నాడు. మత్తుమందు వాసన చూపినందు వలన ఒంటిపైన స్పృహ లేదు.

ఆతడ్ని అంబులెన్స్‌లో పంపించి, చుట్టు ప్రక్కల సెర్చ్ చేసేను. ఒక నల్ల బాగ్‌లో కొన్ని కాగితాలు, కొంచెం చిల్లర, ఒక టికెట్ల కట్ట, ఇనుప వస్తువుల్ని కోసే చిన్న స్టీల్ రంపం దొరికేయి. ఆ టికెట్లు మ్యూజియమ్ గేట్ పాస్‌లు. నెల రోజుల టికెట్లు అవి. హంతకుడు నెల రోజులుగా ప్లాన్ వేసుకుని మ్యూజియమ్‌కి వెళ్ళి శూలం మొనని కోసి తెచ్చేడు.

ఆ తర్వాత మ్యూజియమ్ అధికారుల్ని, గేట్ కీపర్స్‌ని కలిసి నెల రోజులుగా ఎవరయినా వచ్చేరా అని అడిగేను. నెల రోజులూ తాము పరీక్షగా చూడలేదని, కాని నాలు గైదు సార్లు ఒక నల్లసూటు వ్యక్తిని చూసేమని, అతడు ఆయుధాగారంలోని వస్తువుల చరిత్ర గురించి గంటల తరబడి నిలబడి వ్రాసుకునే వాడని తెలిసింది. బేగ్‌లో ఉన్న కాగితాలలో ఆయుధాల గురించి అక్కడక్కడ నోట్స్ ఉన్నాయి'' అన్నారు వామ్.

''ఈ సారి కూడా హంతకుడు తెలివిని ప్రదర్శించేడు. బాకుని ఉపయోగిస్తే రసీదుని బట్టి ఆరా తీసేందుకు అవకాశం వుంది. కాని, మ్యూజియమ్‌కి వచ్చే వేలాది ప్రేక్షకుల్లో కలిసి పోయి అక్కడి వస్తువుతో హత్యగావించే డతడు'' అన్నాడు రంజిత్.

''ఇంతే కాదు ఇంకా ఉంది ఈ కేసు'' అన్నారు వామ్.

రంజిత్ మరి కొంచెం కాఫీ కప్పులో వంచుకుని త్రాగుతూ విన సాగేడు.

# 4

మూడవరోడ్డుకి ఇద్దరూ చేరేసరికి తొమ్మిదిన్నర అయింది. ఆ రోడ్డులో నటరాజ్ టాకీస్ ఉంది. మొదటి ఆట వదిలిన కారణం చేత ఆ రోడ్డంతా గృహాలకి వెళ్ళుతున్న ప్రేక్షకులతో క్రిక్కిరిసి ఉంది. రిక్షాలూ, టాక్సీలూ రివ్వు మంటూ దూసుకుని పోతున్నాయి. తాము చూసిన సినిమా కథని నెమరువేసుకుంటూ, తమకు నచ్చిన సన్నివేశాల్ని వర్ణించుతూ మెల్లగా నడుస్తున్నారు ప్రేక్షకులు.

నీలంసూటు వ్యక్తి, కె. పి. రామ్‌లు పేవ్‌మెంట్ మీద నడుస్తూ వీరిని గమనించ సాగేరు.

నీలం సూటు వ్యక్తి టైమ్ చూసి "మీరెవర్నో కలియాలి కాబోలు" అన్నాడు.

కె. పి. రామ్ కూడా రేడియమ్ డయల్ వాచ్‌ని చూసుకుని తలాడించేడు.

నీలం సూట్ వ్యక్తి అందరూ నిష్క్రమించే వరకు ఆగి తిరిగి నడక సాగించేడు.

కె. పి. రామ్ అతన్ని అనుసరిస్తూ మూడవ సిగార్‌ని వెలిగించి కథనం సాగించేడు:

"ఆ సినిమా టాకీస్ పక్క యిల్లే వరహాలరావుది. అతడికి ఇద్దరు భార్యలు. గుంటూరులో డెబ్భయి ఎకరాల మాగాణి భూమిని తెగ నమ్మి ఇక్కడ వచ్చి స్థిరపడ్డాడు. పట్నంలో ఉన్న అన్ని కంపెనీల్లో నాలుగణాల భాగం వరహాలరావుకుంది. నాలుగు నైట్ క్లబ్స్‌లో అతనికి సగం లాభాలు చెందుతాయి.

ఈ మధ్యనే ఏదో కన్నడ చిత్రాన్ని సర్వహక్కులతో కొనేసి మైసూరులో 20 వారాలు ప్రదర్శించి చాలా ఆర్జించేడు. కొద్ది రోజుల్లో దాన్ని తెలుగులో నిర్మించే ఊహ మీద ఉన్నాడు. నెల రోజుల క్రితం మద్రాస్‌లోని రెండు స్టూడియోల్ని కాంట్రాక్ట్ చేసి తన పిక్చర్‌ని సాధ్యమైనంత వేగంగా నిర్మించి మార్కెట్‌లోకి వదలాలి అని మాట్లాడి వచ్చేడు.

రాయలసీమ, సీడెడ్, తెలంగాణాల్లోని ముఖ్యమైన డిస్ట్రిబ్యూటర్స్‌ని సంప్రదించి అంతా సిద్ధం చేసేడు. తన వద్ద లక్షలు మూలుగుతున్నా తన డబ్బు దమ్మిడి కూడా ఖర్చు పెట్టకుండా మొత్తం డబ్బుని డిస్ట్రిబ్యూటర్ దగ్గర్నుండి తక్కువ వడ్డీకి అప్పుగా తీసుకున్నాడు. ఇన్‌కం

టాక్స్ ఎగవేయడానికి ఇదో చక్కని మార్గం. ముందుగా నాలుగు చక్కని పాటల్ని రికార్డ్ చేయించి పబ్లిసిటీ కోసం మార్కెట్‌లో వదజల్లేడు. ఇక కెమరా వర్క్ ఆరంభం కావాలి.

కాని అకస్మాత్తుగా విధి ఎదురు తిరిగింది.

వరహాలరావు బుధవారం నాటిరాత్రి తన బిజినెస్ పార్టనర్స్‌కి, మిత్రులకి సాయంత్రం ఏడుగంటలకి డిన్నర్ ఏర్పాటు చేసేడు. అందరూ శుభాకాంక్షలు తెలిపి డిన్నర్ టేబుల్ చుట్టూ చేరి ఫలహారాలు ఆరగించసాగేరు. ఇంతలో మెడ్రాస్‌నుండి స్టూడియోవారు ట్రంక్ కాల్ చేసేరు.

వరహాలరావు డిన్నర్ మధ్యనుండి ఎగిరి గంతువేసి ఫోన్ రిసీవ్ చేసుకోనడానికి మేడపైకి వెళ్ళేడు. మిత్రులు అతన్ని కంగ్రాచ్యులేట్ కూడా చేసేరు. అంత వెంటనే స్టూడియో నుండి రిప్లై వస్తుందని ఎవరూ ఊహించలేదు. అందరూ కబుర్లు చెప్తూ, కేరింతలతో అరగంటసేపు గడిపేసేరు. అప్పటికిగాని వరహాలరావు సంగతి వారికి జ్ఞాపకం రాలేదు. ట్రంక్ కాల్ అంతసేపు అవుతుందా అని అనుమానం వచ్చి ఒక మిత్రుడు పైకి వెళ్ళి చూసేడు.

వరహాలరావు శవం సోఫాలో పడివుంది. టెలిఫోన్ అతని చేతిలోనే ఉంది. అతన్ని తలపై కొట్టి స్పృహపోగొట్టి తలమీదుగా ప్లాస్టిక్ సంచి తొడగబడివుంది. కంఠానికి బిగుసుకుని శ్వాస ఆడకుండా జిప్ కంఠంచుట్టూ బిగించి ఉంది.''

ముగించేడు కె. పి. రామ్.

''ఈసారి హత్య మరోవిధంగా జరిగింది'' అన్నాడు నీలంకోట్.

బహుశా, అతని పైప్ ఆరిపోయింది కాబోలు జేబు తడుముకున్నాడు. మరో జేబులోనుండి లైటర్ తీసి వెలిగించడానికి ప్రయత్నించేడు. రెండు మూడుసార్లు తంటాలు పడి వెలిగించేడు.

కె. పి. రామ్ ఏదో అనబోయేడు.

నీలంకోటు వ్యక్తి అతన్ని అమాంతం ఉక్కు కౌగిల్లో బిగించి చీకటిగా ఉన్న సందులోకి ఈడ్చేడు.

కె. పి. రామ్ నోటిలోనుండి ఎలాంటి శబ్దమూ వెలువడ లేదు. ముఖంమీద మాత్రం స్వేద బిందువులు ముత్యాల్లా పేరుకున్నాయి.

"నన్ను చంపకు" అన్నాడు గొంతు పెగుల్చుకుని.

"షటప్. నిన్ను చంపడానికి కాదు లాగింది. మనని ఎవరో వెంటాడుతున్నారు. పది నిముషాలుగా గమనిస్తున్నాను. పైప్ వెలిగిస్తున్నట్లు నటించి లైటర్ వెలుతురులో గమనించేను. రెండవ జేబులో రివాల్వర్ ఉందో లేదో ముందుగా తడిమి చూసుకున్నాను."

అన్నాడు నీలంసూట్ వ్యక్తి.

అతను చెప్పినట్లుగానే వారికి ఫర్లాంగు దూరంలో ఒక వ్యక్తి వారి వెంబడే వస్తున్నాడు. వీరు కనిపించక పోయేసరికి అతడు రివ్వున వెనుదిరిగి జంక్షన్ వైపుకి నడుచుకుంటూ వెళ్ళి కనుమరుగయ్యేడు.

మరో అయిదు నిముషాలు ఆగి తిరిగి ఇద్దరూ నడక మొదలు పెట్టేరు.

కొద్ది సేపటిలో వారు మూడవ రోడ్డుని అధిగమించి నాలుగవ రోడ్డుని ఆరోహించేరు.

  

ఇన్‌స్పెక్టర్ రంజిత్ కాఫీ కప్పుని బల్ల మీదుంచి, "ఓ మై గాడ్, మూడు రోజుల్లో మూడు హత్యలు. థాంక్ గాడ్. నేను లేక పోబట్టి నాకు బ్లాక్ మార్క్ రాలేదు" అని నిట్టూర్చేడు.

"ఈ ప్లాస్టిక్ బాగ్‌యే వరహాలరావు హత్యకి కారణం. బాగ్‌కి ఎక్కడా ఇసుమంత కూడా చిల్లు లేదు. గాలి రాక మరణించేడు. మనిషి ముఖం నీలంగా మారిపోయింది" అన్నారు ప్రొఫెసర్ వామ్.

బట్లర్ వచ్చి ఖాళీ కప్పులు, ప్లేట్లు ట్రేలో ఉంచి తీసుకుని వెళ్ళిపోయేడు. రంజిత్ అతనిని పురమాయించి పాకెట్ సిగరెట్లు, అగ్గిపెట్టె తెప్పించుకున్నాడు.

ఆదివారం కదా హాయిగా కబుర్లు చెప్పుకుందామని అతను, ప్రొఫెసర్ ఇంటికి వచ్చేడు. కాని హృదయ విదారక మయిన యీ మృత్యువుల్ని గురించి వినవలసి వచ్చింది.

"ఈ సారి ఏవైనా ఆధారాలు దొరికేయా" అడిగేడు రంజిత్.

ప్రొఫెసర్ అలవోకగా నవ్వేరు. అంటే మంచి ఆధారాలు ఆయన కంట పడ్డాయి అని అర్థం.

"ప్లాస్టిక్ బాగ్ మీద చక్కని ఫింగర్ ప్రింట్స్ దొరికేయి. అది కాక హతుడి జేబులో ఒక విజిటింగ్ కార్డ్ దొరికింది. దాని మీద అర్ధచంద్రాకారంలో ఉన్న చిప్ప గొడ్డలి మాదిరి బొమ్మ ఉంది" అన్నారు.

రంజిత్ కార్డ్‌ని అందుకుని చూసేడు.

"ఒక ముఖ్య విషయ మేమిటంటే ఈ హత్యలని చేస్తున్న వ్యక్తి ధనం కోసం చేయడం లేదు" అన్నారు వామ్.

"అవును. అలాగే కనిపిస్తోంది. కూర్మారావు జ్యూయలరీని

అపహరించడానికి హంతకుడికి బోలెడు అవకాశం లభించింది'' అన్నాడు రంజిత్.

''ఫింగర్ ప్రింట్స్ ఆధారంగా ముందుకి సాగవలసింది. అతిథుల్లో ఒకరు అతన్ని హత్యచేసి ఉండాలి'' అన్నాడు రంజిత్ తిరిగి.

''దాదాపు రెండు వందల మంది గెస్ట్స్ ఉన్నారు. అందరూ ఉన్నతమయిన పదవుల్లో ఉన్నవారు. అయినా సందేహిస్తూ వారి వేలి ముద్రలు తీసుకుని, ఈ ఫింగర్ ప్రింట్స్‌తో పోల్చి చూసేము. కాని అవి ఒకటి కావు'' అన్నారు వామ్.

''అయితే అతిథుల్లో హంతకుడు లేడు. ఈ సారి పోలీస్ కుక్కల్ని ఎందు కుపయోగించలేదు?'' అడిగేడు రంజిత్.

''ప్రయత్నించేము. కాని పోలీసులు వచ్చే లోగా వందలాది మంది హత్యా ప్రదేశంలో తిరిగేరు. అందరూ తిరిగిన తర్వాత కుక్కలు అనుమానితుడ్ని గుర్తించలేవు. అందరి శరీరపు వాసనలు మిళితం అయితే పోలీసు కుక్కలు పనికి రావు'' అన్నారు వామ్.

''డామిట్. హంతకుడు చాలా లక్కీ ఫెలో. అతడికి తెలివి తేటలతో పాటు అదృష్టం కూడా తోడైంది'' అన్నాడు రంజిత్.

ప్రొఫెసర్ వామ్ గాలంని, శూలంని, ప్లాస్టిక్ సంచిని భద్రంగా బీరువాలో ఉంచి, తిరిగి కుర్చీలో కూర్చున్నారు.
రంజిత్ సిగరెట్ పాకెట్ విప్పి, సిగరెట్ ముట్టించేడు.

## 5

''ఇందాక చాలా భయపడ్డాను'' అన్నాడు కె. పి. రామ్ మెడ తడుముకుంటూ.

నీలంకోటు వ్యక్తి నవ్వి సారీ అన్నాడు.

ఆ రోడ్డు కూడా నిర్మానుష్యంగా ఉంది. ఇది సరాసరి జంక్షన్ కి దారి తీస్తుంది. అయిదవ రోడ్డుకి వెళ్ళాలంటే తిరిగి జంక్షన్ కి చేరుకుని వెళ్ళాలి.

పేవ్ మెంట్స్ మీద ఊరకుక్కలు, బిచ్చగాళ్ళు నిద్ర పోతున్నారు. రాత్రి పెరుగుతున్న కొద్దీ మంచు తెర సన్నని మేలి ముసుగులా కమ్ముకువస్తోంది.

"ఆ కనిపించేదే నరసింహమూర్తి ఇల్లు. బయటికి ఎంత సాదాగా అగుపిస్తుందో లోపల అంత ఆధునికంగా, ఆకర్షణీయంగా ఉంటుంది. నరసింహమూర్తి పెద్ద బ్రోకరు. పెద్ద పెద్ద గవర్నమెంటు టెండర్లు సంపాదించి లక్షలాది ధనం ఆర్జించేడు.

ప్రస్తుతం నాలుగే నాలుగు హోటళ్ళు, రెండు నైట్ క్లబ్స్ లో షేర్స్ ఉన్నాయి. అతని చేతి క్రింద వంద మంది రౌడీ లున్నారు. ప్రతి సినిమా టాకీస్ వద్ద టికెట్లు బ్లాకులో అమ్మించి రోజుకి వెయ్యదాకా ఆ విధంగా చిల్లర ఖర్చులకి ఆర్జిస్తాడు.

ప్రతి రేస్ ల సీజన్ లో అరడజను మంది అసిస్టెంట్స్ ని బుక్కీలుగా నియమించి బెంగుళూరు, మద్రాస్, హైదరాబాదు రేసులకి పంపుతూంటాడు. ఈ విధంగా అతడు సంపాదించేదంతా పాపపు సొమ్ము.

ఇంత ఆర్జించినా పైసా కూడా తిని ఆనందించలేడు. ఏది తిన్నా అరగదు. డయాబిటిస్, డిస్పెప్సియా, కాన్ స్టిపేషన్ వంటి రోగాలు కాక పైల్స్, హెర్నియా వంటి ఆపరేషన్ కావలసిన రోగాలున్నాయి.అహర్నిశలూ ట్రాంక్విలైజర్స్, విటమిన్ మాత్రలు, ఇన్సులిన్, టానిక్ లు మింగుతూనే ఉంటాడు.

ఇద్దరు కొడుకులూ దౌర్భాగ్యుల్లా తయారయ్యేరు.

అతడి అదృష్టమో అని హంతకుడు అతడ్ని అంతం చేసి పుణ్యం కట్టుకున్నాడు. ఇన్ని హత్యల్లో అతడు చేసిన మంచిపని అదొక్కటే.

గురువారంరాత్రి నరసింహమూర్తి నైట్ క్లబ్ లో కడుపు నిండా తాగేసి ఇంటికి వచ్చేడు. గుమ్మంలో అడుగు పెట్టుతూనే హంతకుడు మీదపడి గుండెల్లో గుచ్చి చీల్చి చంపేడు. ఆ సమయాన అందరూ అదమరచి నిద్రపోతున్నారు. నరసింహమూర్తి అరచిన అరుపులు వారి చెవులకి చేరేసరికి హంతకుడు మాయమయ్యేడు."

అన్నాడు కె. పి. రామ్.

"పోలీసులకి ఆధారాలు దొరికేయా" అడిగేడు నీలం సూట్.

"ఏవో కొన్ని క్లూలు దొరికేయని చెప్పుకుంటూండగా విన్నాను" అన్నాడు కె. పి. రామ్ క్రొత్త చుట్ట తీసి వెలిగించి.

* * *

"ఏమిటా క్లూలు" అడిగాడు రంజిత్.

ప్రొఫెసర్ వామ్ హంతకుడు ఉపయోగించిన ఇనుప గోళ్ళు తీసి చూపించేడు. వాటికి కూడా రక్తం అంటి ఉంది.

అదికాక హంతకుడి విజిటింగ్ కార్డు ఇక్కడ కూడా లభించింది.

"ఈ హత్యలో హంతకుడి ప్లాను చూచాయగా అర్థమవుతుంది" అన్నారు వామ్.

రంజిత్ గోళ్లని చూచి ఆలోచించి అన్నాడు:

"చనిపోయిన వ్యక్తి పేరు నరసింహమూర్తి. హంతకుడు

అతడ్ని ఇనుప గోళ్ళతో చీల్చి చంపేడు. చాలా చక్కగా అమరింది.''

వామ్ హత్యాయుధాన్ని, విజిటింగ్ కార్డ్‌ని పొడు గాటి కవర్లో ఉంచి సీల్ చేసి దాచేరు.

రంజిత్ ప్రొఫెసర్ దగ్గరికి ఉదయం పదిగంటలకి వచ్చేడు. అప్పుడే మధ్యాహ్నం మూడున్నరయింది. అతనికి తెలియకుండానే సమయం గడిచిపోయింది.

''ప్రొఫెసర్! నేను మధ్యాహ్నం టిఫిన్ తీసుకునే వేళ యింది. మధ్యాహ్నం భోజనంకూడా మరచిపోయి మీ కబుర్లు వింటూ ఉండిపోయేను. ఏదైనా గట్టి టిఫిన్ తెప్పించండి'' అన్నాడు.

వామ్ బెల్ నొక్కి బట్లర్‌ని పిలిచేరు.

కొద్ది నిముషాల్లో ట్రే నిండా తినుబండారాలు, రెండు గ్లాసులనిండా చక్కని రోజ్ మిల్క్ తీసుకుని వచ్చేడు బట్లర్.

''హంతకుడు హత్యాప్రదేశంలో వదిలిపెట్టిన కార్డ్‌లో అంతరార్థం తెలిస్తే అతడ్ని బంధించవచ్చు'' అన్నాడు రంజిత్.

''ఇప్పుడా అవసరంలేదు. అయినా ఆ సమయం వచ్చి నప్పుడు విజిటింగ్ కార్డ్‌లోని రహస్యం చెపుతాను'' అన్నారు వామ్.

''ఇంతవరకూ నలుగురు వేర్వేరు పద్ధతుల్లో హత్యగావించ బడ్డారు. నలుగురూ గొప్ప ధనవంతులు. కాని చివరి ఇద్దరి హత్యలలోమాత్రం కాగుడులు లభించేయి'' అన్నాడు ఇన్ స్పెక్టర్ రంజిత్ కేస్‌ని సమీక్షించి.

''బహుశా నలుగురి వద్దకూడా విజిటింగ్ కార్డ్‌లని వదిలి

ఉంటాడు. మొదటి హత్యలో శవం నూతిలో లభించింది. కాబట్టి కార్డ్ నూతిలో పడిపోయి ఉండాలి. కాబట్టి కార్డ్ గురించి ఏమీ తెలియక రెండవ హత్యలో దానికోసం వెతికే ప్రయత్నం చేయలేదు" అన్నారు వామ్.

రంజిత్ చివాలున లేచి ఫోన్ దగ్గరికి వెళ్ళి, "ఫోన్ చేసి కార్డ్ గురించి వెతకమంటాను" అన్నాడు.

ప్రొఫెసర్ అతన్ని వారించి కూర్చోమని సౌంజ్ఞ చేసేరు.

ఇన్స్పెక్టర్ తిరిగి కుర్చీలో కూర్చుని మిగిలివున్న కాస్త కాఫీని గొంతులో పోసుకుని "చెప్పండి వింటాను" అన్నాడు.

# 6

"ఇప్పుడు అయిదవ రోడ్డులోకి వెళుతున్నాం కనుక అయిదవ హత్య గురించి చెప్పాలి. క్రొత్త సిగార్ మీరు వెలిగించాలి" అన్నాడు నీలంసూటు వ్యక్తి నవ్వుతూ.

కె. పి. రామ్ గంభీరంగా ఉండిపోయేడు.

నీలంసూటు వ్యక్తి లైటర్‌తో అతని చుట్టని వెలిగించి ఆ వెలుతురులో వెంటాడిన వ్యక్తికోసం ప్రక్కల చూపులు చూసేడు. కాని కంటికి ఎవరూ కనిపించలేదు.

"ఈ హత్య అనుకోని విధంగా జరిగింది" అన్నాడు కె. పి. రామ్.

"ఇప్పటి వరకూ అన్ని హత్యలూ అనుకోని విధంగా జరిగేయి" అన్నాడు నీలంసూటు.

"అలా కాదు. ఈసారి ఎవరు మరణిస్తారో నాకో వ్యక్తి ముందుగానే చెప్పాడు. కాని నేను అతని హెచ్చరికని సీరియస్‌గా తీసుకోలేదు" అన్నాడు కె. పి. రామ్.

"అలాగా. అయితే త్వరగా చెప్పండి" అన్నాడు నీలంసూటు వ్యక్తి.

"మీరు పి. వి. రావు పేరు వినే ఉంటారు" అడిగాడు కె. పి. రామ్.

"పి. వి. రావ్ అంటే సినిమా ఏక్టర్ రావ్ యేనా. చాలా గొప్ప కేరక్టర్ ఏక్టర్ అని విన్నాను."

"అవును. అతనే. ఈసారి అతను మరణిస్తాడని,అదీగాక శుక్రవారంనాడే హత్య జరిగి తీరుతుందని మా అకౌంటెంట్ నాతో వాదించేడు" అన్నాడు కె. పి. రామ్.

నీలంసూట్ వ్యక్తి తక్కున ఆగిపోయేడు.

"అతని కెలా తెలిసింది. అతని పేరేమిటి?" అడిగేడతను.

"మా అకౌంటెంట్ అశ్వత్థామ. స్వతహాగా చాలా తెలివయినవాడు. ఇంతవరకు జరిగిన హత్యలు వరుసగా సోమ, మంగళ, బుధ, గురువారంనాడు జరిగేయి కాబట్టి ఈ రోజు శుక్రవారంకూడా హత్య జరుగుతుందని చెప్పేడు. ఇంతవరకు వరుసగా నాలుగురోడ్ల యందలి నివాసులు మరణించేరు. ఈసారి అయిదవ రోడ్ లోని పి. వి. రావ్ చస్తాడని చెప్పేడు" అన్నాడు కె. పి. రామ్.

ఇద్దరూ ఇప్పుడు పి.వి.రావ్ ఇంటికి ఎదురుగా ఉన్నారు. రావ్ ఇల్లు అంధకారంలో మునిగివుంది.

నీలంసూట్ ఆ ఇంటిని పరికించి ముందుకి కదిలేడు.

కె. పి. రామ్ కూడా కొన్ని క్షణాలు ఆగి ముందుకి నడిచేడు.

"ఈ వీధిలో పి.వి రావ్ కాక ఇంకా చాలామంది గొప్ప వాళ్లు ఉన్నారు. అతడే మరణిస్తాడని మీ అకౌంటెంట్ కి ఎలా తెలిసింది. అకౌంటెంట్ అశ్వత్థామకి జ్యోతిష్యంలో ప్రవేశముందా?" అడిగేడు నీలంసూట్.

"అశ్వత్థామకి పురాణం అంటే చాలా ఇష్టం. రోజూ సాయంత్రం మా ఇంటికి వచ్చి నాకు పురాణం చదివి వినిపిస్తాడు. కాని అతడికి జ్యోతిష్యంలో బొత్తిగా ప్రవేశం లేదు.

గురువారం సాయంత్రం రోజూలాగే వచ్చి కొంత పురాణ పఠనం చేసేడు. మాటల సందర్భంలో గడిచిన నాలుగు హత్యల గురించి తర్కించేము. అశ్వత్థామ కొంతసేపు ఏదో మనస్సులో గుణించుకొని ఈసారి పి. వి. రావ్ మరణిస్తాడని చెప్పేడు. నేను హాస్యానికలా అన్నాడు కాబోలు అని ఊరుకున్నాను.

శుక్రవారంనాడు పి. వి. రావ్ మెడ్రాసునుండి ఊళ్లోకి దిగిపడ్డాడు. ఏదో తమిళ చిత్రంలో గుర్రపుస్వారీ చేస్తూండగా గుర్రం ఆర్క్ లాంప్ లకి బెదిరి అతన్ని నేలమీదికి గిరాటు వేసింది.

ఆ దెబ్బకి పి. వి. రావ్ మోకాలు చిప్ప బాగా దెబ్బ తింది. ఇక రెండు నెలలు తిరిగి స్టూడియోముఖం చూడనని రావ్ ఇంటికి వచ్చేడు. ఆ గుర్రాన్ని కావాలని ఎవరో గిట్టనివారు బెదిరించేరని పుకారు బయలుదేరింది. ఏది ఎలా ఉన్నా శుక్రవారంనాడు రావ్ ఇంటిపట్టున ఉన్నాడు.

అతని కుటుంబం యావత్తూ ప్రొడ్యూసర్ కార్ లో ఊటీ, కోయంబత్తూర్, కొడైకానాల్ కి ట్రిప్ కొడుతూ ఉన్నారు. రావ్ మధ్యాహ్నం పడక వేసి సాయంత్రం ఎనిమిది గంటలకి లేచేడు.

అతను బెడ్ పైనుండి లేవగానే పైనుండి క్రుళ్ళిన గ్రుడ్లు, టమాటాలు ముఖంమీద పడ్డాయి. అతని నటనానుభవంలో తొలిసారిగా మెడ్రాస్ లో ఒకసారి అలాంటి సన్మానం జరిగింది. తిరిగి చచ్చేముందు జరిగింది.

అతడు తలెత్తి చూసేసరికి కాలయముడిలా నల్లనిదుస్తుల్లో దీర్ఘకాయుడొకడు కనిపించేడు. రావ్ ప్రాణాలు పైన ఉండిపోయేయి. ముఖం గుర్తు పట్టడానికి వీలులేకుండా దీర్ఘకాయుడు నల్లని పట్టీ కళ్ళకి కట్టుకున్నాడు. రెండు చిల్లుల నుండి కళ్ళు తళతళలాడుతున్నాయి.

ఒకే ఒక తన్నుతో రావ్ నేలమీదికి దొర్లిపోయేడు. హంతకుడి కాళ్ళకి ఇనుపముళ్ళు తాపడం చేసిన పెద్దబూట్లు ఉన్నాయి. రావ్ గుండెలమీద ఎక్కి పచ్చడి పచ్చడిగా తొక్కి చంపేడు హంతకుడు."

ముగించేడు కె. పి. రామ్.

"అశ్వత్థామ చెప్పినట్లుగానే జరిగింది" అన్నాడు నీలంసూట్.

* * *

"ఈ సారి హత్యాప్రదేశం వద్ద విజిటింగ్ కార్డ్, హత్యాయుధంగా ఉపయోగించిన బూట్లు లభించేయి" అన్నారు ప్రొఫెసర్ వామ్.

"ఈసారి పోలీస్ డాగ్స్‌ని ఉపయోగించి ఉండాల్సింది" అన్నాడు రంజిత్.

"లాభంలేకపోయింది. మొట్టమొదటిసారి లాగే జాగ్రత్తపడ్డాడు హంతకుడు" అన్నారు ప్రొఫెసర్.

"విజిటింగ్ కార్డ్ రహస్యాన్ని ఛేదించి ఈ హత్యలన్నిటికి గల కనెక్షన్ తెలుసుకుంటే హత్య చేసేందుకు గల మోటివ్ తెలుస్తుంది. అప్పుడు హంతకుడ్ని బంధించవచ్చు" అన్నాడు రంజిత్.

ప్రొఫెసర్ వామ్ కాఫీ సిప్ చేయసాగేరు.

"అకౌంటెంట్ అశ్వత్థామకి జరుగబోయే హత్యగురించి

ముందుగానే ఎలా తెలిసింది? అతడు పోలీసులకి తెలియజేసి ఉండాల్సింది'' అన్నాడు రంజిత్.

''అప్పుడు ముందుగా అరెస్ట్ చేసేది అశ్వత్థామనే. పి.వి. రావ్ హత్య చెయ్యబడతాడని అతనికి ఎలా తెలుసు అని ఎంక్వయిరీ జరుపుతారు. ప్రథమ అనుమానితుడు అశ్వత్థామ అవుతాడు'' అన్నారు వామ్.

ఇన్స్పెక్టర్ ఆలోచించేడు. ఈ హేతువాదం సమంజసంగా తోచి తలూపేడు.

''అశ్వత్థామని తర్వాతయినా కస్టడీలోకి తీసుకుని ఉండాల్సింది'' అన్నాడు రంజిత్.

''వీలుకాలేదు'' అన్నారు ప్రొఫెసర్.

# 7

''అశ్వత్థామని పోలీసులకి పట్టివ్వాలిసింది'' అన్నాడు నీలం సూటు.

''నాకు ఆ పని చేయడానికి మనస్కరించలేదు'' అన్నాడు కె. పి. రామ్.

వారిప్పుడు ఆరవ క్రాస్ రోడ్‌లో నడుస్తున్నారు.

దూరంగా టవర్ క్లాక్ టంగ్ టంగ్ మంటూ పన్నెండు గంటలు కొట్టింది. ఇక కొద్ది సేపటిలో రెండవ ఆటకూడా వదిలేస్తారు. రిక్షావాళ్ళు సినిమా టాకీస్ వైపు తొక్కుతూ ఎదురయ్యేరు.

ఒకరిద్దరు రిక్షావాళ్ళు కాలినడకన వస్తున్న వీరిని చూసి ఎక్కమని అడిగేరు. కాని వీరిద్దరూ తమ ధోరణిలో నడుస్తూ మాట్లాడుకోసాగేరు.

''ఈరోజు శనివారం. హంతకుడి లెక్కలో ఆరవరోజు. ఈరోజు సాయంత్రంకూడా యథాప్రకారం అశ్వత్థామ

మాయింటికి వచ్చేడు. అతని ధ్యాస అంతా జరిగిన హత్యల మీద నే ఉండడంచేత పురాణ పఠనం సాఫీగా జరగలేదు. నే నతడ్ని మాటల్లోకి దించుదామని పి. వి. రావ్ హత్య గురించి కదిల్చేను. అప్పు డత దే మన్నాడో తెలుసా?" అడిగేడు కె. పి. రామ్.

నీలంసూట్ ప్రశ్నార్థకంగా చూసేడు.

"ఈ సారి హంతకుడు నన్ను చంపవచ్చునని చెప్పేడు అశ్వత్థామ" అన్నాడు కె. పి. రామ్.

"కాని మీరింకా బ్రతికే ఉన్నారు. అప్పుడే శనివారం దాటి, ఆదివారం కొద్దిసేపటిలో రాబోతోంది" అన్నాడు నీలంసూటు.

"అవును నేను బ్రతికే ఉన్నాను. కాని అశ్వత్థామయే మరణించేడు" అన్నాడు కె. పి. రామ్ కొద్దిగా విచారంగా.

నీలంసూట్ వ్యక్తి బాణం దెబ్బతిన్న పక్షిలా ఎగిరి పడ్డాడు. అతనిలో క్రోధం ఉవ్వెత్తున లేచింది.

"ఇన్ని హత్యలు జరిగినా నాకు ఏమీ అనిపించలేదు. కాని ఎప్పుడయితే నా అకౌంటెంటు హత్యగావించ బడ్డాడో ఇక ఆగలేకపోయేను. మీ సహాయం అర్థించేను. మనిద్దరం కలిసి హంతకుడ్ని రాత్రికి రాత్రే అంతం చేద్దాం" అన్నాడు కె. పి రామ్. అతడి పిడికిళ్ళు బిగుసుకున్నాయి.

"అలాగే చేద్దాం. అందుకు ఈ రోజు రాత్రి చాలా అనుకూలంగా ఉంది" అన్నాడు నీలంసూట్.

అతను చెప్పినట్లుగానే గాఢాంధకారం అంతకంతకూ అలుముకుంటూ ఉంది. ఆ రోడ్డులో దీపాలు గుడ్డిగా వెలుగుతూ ఏ క్షణాన్నయినా ఆరిపోవడానికి సిద్ధంగా ఉన్నాయి. దట్టంగా పేరుకున్న మంచు తెర ఉన్ని కంబళిలా ఆవరించింది.

"ఈరోజు మంచు బాగా కురుస్తోంది" అన్నాడు నీలం సూటు వ్యక్తి.

"ఈ మంచు తెర చాటునే హంతకుడు అశ్వత్థామని చంపి మాయమయ్యేడు. వెంటనే పురాణం ముగించి అశ్వత్థామ బయటపడ్డాడు. ఆ ప్రక్క రోడ్ నుండి ఈ రోడ్ లోకి వచ్చేడు. ఈ రోడ్ లో దీపాలు కాంతిహీనంగా ఉంటాయి. అదీకాక సాయంత్రం ఎనిమి దయితేనేగాని మునిసిపాలిటీ వారు వెలిగించరు.

అతడు తలవంచుకుని రావ్ హత్య గురించి ఆలోచిస్తూ నడవసాగేడు. చీకటిదారి కావడంచేత ఎవరూ లేరు. సినిమా ఆట మొదలయి పోవడంచేత టాకీసుకి వెళ్ళే జనం కూడా లేరు.

హఠాత్తుగా అశ్వత్థామపైకి హంతకుడు విరుచుకు పడ్డాడు. ఏళ్ళుపైబడ్డ ముసలివాడు అశ్వత్థామ. డేగ చేతిలో చిక్కిన పిచ్చుకలా వణికిపోసాగేడు. హంతకుడు అశ్వత్థామ మెడలోని జందెంలాగి దానితోనే పీకచుట్టూ బిగించి లాగేడు.

చూస్తూండగానే అశ్వత్థామ నాలుక వెళ్ళుకు వచ్చింది. హంతకుడు చల్లగా జారుకుని కనుమరుగయ్యేడు.

నా మనస్సు ఎందుకో కీడుని శంకించింది. అశ్వత్థామ చేసిన హెచ్చరిక మనసులో మెదిలింది. నన్ను రక్షించబోయి అతను చిక్కుల్లో పడతాడనిపించి కొద్దిసేపటి తర్వాత అశ్వత్థామ వెళ్ళిన తోవంటే ఇలా వచ్చేను. అతని శవం పేవ్ మెంట్ మీద కనిపించింది" అన్నాడు కె. పి. రామ్.

నీలంసూట్ వ్యక్తి ధ్యాస ఎటో ఉంది. అతడు మరో

సారి జేబు తడుముకుని లైటర్ వెలిగించి ఆర్పివేశాడు. వెంటాడుతున్న వ్యక్తి కంటికి కనిపించలేదు.

అప్పటికే వారిద్దరూ ఆరవరోడ్డు దాటి ఏడవ రోడ్డుని ప్రవేశించేరు.

కె. పి. రామ్ కాలుస్తున్న సిగార్ ఎప్పుడో ఆరిపో యింది. అతడు రెండుమూడుసార్లు ప్రయత్నించి విసుగుతో సిగార్‌ని నేలకికొట్టి క్రొత్త సిగార్ తీసి వెలిగించేడు.

"కొద్ది గంటల్లో తెల్లవారుతుంది" అన్నాడు కె. పి. రామ్.

"అశ్వత్థామ శవం వద్ద హంతకుడి విజిటింగ్ కార్డు దొరి కిందా?" అడిగేడు నీలంసూట్ వ్యక్తి.

"ఆఁ. దొరికింది" అంటూ కె. పి. రామ్ కోటు జేబులో నుండి రెండు కార్డుల్ని పైకి తీసేడు.

నీలంసూట్ వ్యక్తి కళ్లు ఎర్రజీరల్ని దాల్చేయి.

"ఆ రెండవ కార్డు బహుశా మీ శవం పైన ఉండేది" అన్నాడు.

కె. పి. రామ్ ముఖం వివర్ణమయింది.

మరుక్షణం అతని ఇనుప హస్తాలు కె. పి. రామ్ మెడ చుట్టూ బిగుసుకున్నాయి. చూస్తూండగానే కె. పి. రామ్ ముఖం నీలంగా మారింది. అతని చేతిలోని వాకింగ్ స్టిక్ ఒరిగింది.

కొన్ని క్షణాల తర్వాత అతను కూడా నేల కూలేడు.

వెనుక అడుగుల చప్పుడయేసరికి చటుక్కున తిరిగేడు నీలం సూటు వ్యక్తి. అంతకు ముందు వెంటాడిన వ్యక్తి అతను.

అతని చేతిలోని రివాల్వర్ నీలం సూట్ వ్యక్తికి గురి పెట్టి ఉంది.

"ఆదివారం వచ్చింది. ఏడవ వ్యక్తి కూడా మరణించేడు" అన్నాడు నీలంసూట్ వ్యక్తి.

వెంటాడిన వ్యక్తి చేతిలోని రివాల్వర్ క్రిందికి దిగింది. అతను నీలంసూట్ వ్యక్తితో కలిసి జంక్షన్‌కి నడిచేడు.

# 8

"కథ ముగిసింది" అన్నారు వామ్.

"ఇప్పటికి ఏడు హత్యలు జరిగేయి. ఏడు రోడ్ల వద్ద ఏడు రోజుల్లో వారు మరణించేరు. వారి శవాలవద్ద ఏడు విజిటింగ్ కార్డులు దొరికేయి" సమీక్షించేడు రంజిత్.

"కాని అయిదు కార్డులు, అయిదు ఆయుధాలు మాత్రమే పోలీసులకి దొరికేయి" అన్నారు ప్రొఫెసర్ వామ్.

"హంతకుడ్ని బంధించాలంటే ఈ హత్యలకి గల కనెక్షన్, లేదా విజిటింగ్ కార్డ్ గుర్తుకి గల అర్థం కనుక్కోవాలి" అన్నాడు రంజిత్.

మళ్ళా అతడే అన్నాడు. "ఇదేదో 'జాక్ ది రిప్పర్' కేసులా ఉంది. వంద ఏండ్ల క్రితం లండన్‌లో పది వారాల పాటు వారానికొక స్త్రీ చొప్పున హంతకుడు చంపేవాడు. అతనిది సైకలాజికల్ కేసు."

ప్రొఫెసర్ తలాడించేరు.

"ఇది కూడా ఒక సైకో కేసు లాంటిదే. కాని సైకో కేసుల్లో హంతకులు మనోకల్లోలం వలన కొన్ని పిచ్చిపన్లు, అఘాయిత్యాలు చేస్తారు. ఆ హత్యలకి ఒక ప్లాన్ అంటూ ఉండనవసరం లేదు. కాని మామూలు సమయంలో వారు చాలా తెలివిగా మెసులు కుంటూరు. అందుకే వారిని బంధించడం కష్టం" అన్నారు వామ్.

"ప్రొఫెసర్! ఈ హంతకుడు చాలా ప్లాన్ వేసుకొని

అందర్నీ చంపేడు. నెల రోజులు మ్యూజియంకి వెళ్ళి శూలాన్ని సంపాదించేడు. అతను వాడిన అయిదు ఆయుధాలు చాలా జాగ్రత్తగా సంపాదించినవే. కాని ఆరవ హత్య–?"

అంటూ ఆగేడు ఇన్‌స్పెక్టర్ రంజిత్.

"కమాన్. నీ అనుమానం ఏమిటో చెప్పు" ప్రోత్సహించేరు ప్రొఫెసర్ వామ్.

"అశ్వత్థామ హత్య జందెంతో జరిగింది. పురాణం చదివి వస్తూండగా అశ్వత్థామ మరణించేడు. పి.వి. రావు మరణాన్ని గురించి అతడికి ముందుగా తెలిసింది. కె. పి. రామ్ కూడా చనిపోతాడని ముందుగా చెప్పేడు. కాని తనే ముందుగా మరణించేడు. అతని హత్య జందెంతో—" అంటూ ఆగేడు రంజిత్.

"ఏమిటాలోచిస్తున్నావు" అడిగేరు ప్రొఫెసర్ వామ్.

"ఏమీ లేదు. అశ్వత్థామ హత్య చిత్రంగా కనిపిస్తోంది. చిన్నప్పుడు నేను భారతం చదివేను. అందులో అశ్వత్థామ తన శత్రువైన ధృష్టద్యుమ్నుడ్ని జందెంతో పీక నులిమి చంపేడని ఉంది" అన్నాడు ఇన్‌స్పెక్టర్ రంజిత్.

"రైట్. పురాణ పఠనం చేసి వస్తున్న అశ్వత్థామ సరిగ్గా అలాగే హత్య చేయబడ్డాడు. ఆ రోజు పురాణంలో అతడు చదివిన ఘట్టం ధృష్టద్యుమ్న వధ" అన్నారు ప్రొఫెసర్ వామ్.

రంజిత్ కుర్చీలో నుండి లేచి ఎగిరి గంతు వేసి నిలబడ్డాడు. గబాలున కప్పులో వేడి కాఫీ వంచుకొని ఒకేసారిగా అంతా గొంతులో పోసుకున్నాడు.

"ఇప్పుడు నాకు హత్యల్లోని రహస్యం అర్థమయింది" అన్నాడు.

ప్రొఫెసర్ వామ్ ప్రోత్సాహకరంగా అతని భుజం తట్టేరు.

"చనిపోయిన వ్యక్తుల పేర్లు మత్స్యేంద్ర సేన్, కూర్మా రావు, వరహాలరావు, నరసింహమూర్తి, పి. వి. రావు. మధ్యలో అశ్వథ్థామ, చివర కె. పి. రామ్" అన్నాడు రంజిత్.

"అశ్వథ్థామ మినహా మొదటి అయిదుగురివి విష్ణుమూర్తి అవతారాల పేర్లు. అశ్వథ్థామ గత నెల రోజులుగా విష్ణు పురాణం చదివి వినిపిస్తున్నాడు" అన్నారు వామ్.

"అదెలాగ. నాలుగు మాత్రమే అవతారాల పేర్లు. పి. వి. రావు పూర్తి పేరు ఏమిటి" అడిగేడు రంజిత్.

"పి. వామనరావు. అతనితో కలసి మత్స్య, కూర్మ, వరాహ, నరసింహ, వామన అవతారాలు అవుతావు" అన్నారు వామ్.

"నాకు మొదటి నాలుగు మాత్రమే తెలుసు. అశ్వథ్థామకి కూడా అదే ఐడియా తట్టి అయిదవ హత్య పి. వి. రావ్‌ది అవుతుంది అని చెప్పివుంటాడు. కాని ఆ తర్వాత కె. పి. రామ్ మరణిస్తాడని ఎలా చెప్పేడు" అడిగేడు రంజిత్.

"వామన అవతారం తర్వాతది పరశురామ అవతారం. కె. పి. రామ్ పూర్తి పేరు_ కె. పరశురామ్" అన్నారు వామ్.

"ఐసీ. కాని మధ్యలో అశ్వథ్థామ హత్య జరిగింది. పురాణంలో అతను చదివి వినిపించిన విధంగా అతని హత్య జరిగింది. ఎవరో ఆ ఘట్టాన్ని చదువుతూండగా విన్నారు" అన్నాడు రంజిత్.

"కరెక్ట్. ముందు జరిగిన హత్యల విధానం కూడా ఆయా

విధంగా జరిగింది. హత్యా విధానం, హతుల పేర్లు రెండింటిని కలిపి చూస్తే కనెక్షన్ అర్థమవుతుంది. మత్స్యేంద్రా క్లినిక్ అధిపతి మత్స్యేంద్రసేన్‌ని చేపని చంపినట్లు గాలంతో చంపేడు. జ్యూయలర్ కుర్మారావుని వెల్లకిలా ఉంచి శూలంతో చంపేడు హంతకుడు. ప్రొడ్యూసర్ వరహాలరావుని పందిని చంపినట్టు సంచిలో నొక్కి చంపేడు. నరసింహమూర్తిని యినుపగోళ్ళతో చీల్చిచంపాడు. ఏక్టరు వామనరావుని పాదంతో అణిచి చంపేడు. అక్కడికి అయిదు అవతారాల పేర్లు పూర్తయాయి'' అన్నారు వామ్.

''ఆరవ అవతారం - ఏడవ హత్య - కె. పరశురామ్‌ది. ఇతనికి వారితో ఏం సంబంధం'' అడిగాడు రంజిత్.

''ఆ సంబంధం అకౌంటెంట్ అశ్వత్థామకి తెలిసే ఉండి ఉండాలి. కాబట్టి అతడు కె. పి. రామ్‌ని ముందుగానే హెచ్చరించగలిగేడు'' అన్నారు వామ్.

''వీరందరూ ప్రఖ్యాతి గాంచిన ధనవంతులు. మత్స్యేంద్ర సేన్ ఫారిన్ నుండి బంగారం స్మగుల్ చేసేవాడు. కుర్మా రావు ముత్యాలవ్యాపారం చేస్తాడు.వరహాలరావుకి కూడా అన్ని కంపెనీలలో షేర్లున్నాయి. నరసింహమూర్తి పేరుమోసిన బ్రోకరు, నైట్ క్లబ్స్‌లో,యితర కంపెనీల్లో షేర్లున్నాయి. బహుశ వీరికి కె. పి. రామ్ కంపెనీలో పార్టనర్ షిప్ ఉండిఉండాలి. అదొక్కటే వారికి అతనితో గల సంబంధం. ఆ విషయం అకౌంటెంట్ అశ్వత్థామకి తెలుసు'' అన్నాడు రంజిత్.

''కరెక్ట్. కె.పి. రామ్ డిపార్ట్‌మెంటల్ స్టోర్‌కి ఏడుగురు వ్యక్తులు డైరెక్టర్స్‌గా ఉన్నారు. ప్రథముడు కె. పి. రామ్. మిగిలినవారు మత్స్యేంద్రసేన్, కూర్మారావు, వరహాలరావు, నరసింహమూర్తి, పి. వి. రావు, అకౌంటెంట్ అశ్వత్థామ.

అందరూ వరుసగా మరణించేరు'' అన్నాడు వామ్.

"చివర్లో నీలంసూటు వ్యక్తి, అతన్ని వెంటాడిన వ్యక్తి ఏమయ్యేరు'' అన్నాడు రంజిత్.

ప్రొఫెసర్ ఊరుకున్నారు.

"హంతకు డెవరో తెలుసుకోవాలంటే, పురాణం చదవగా విన్న వ్యక్తులెవరో తెలుసుకోవాలి. ఆ వ్యక్తుల్లో ఒకరు తాము విన్న ఘట్టాల్ని ఉపయోగించి హత్యల్ని చేసేరు. చిట్టచివరికి అశ్వత్థామ హత్య వరకు పురాణంలో వర్ణనల ప్రకారం చేసేడు హంతకుడు. తేడా ఏమిటంటే ఆయా అవతార పురుషులు శత్రువుల్ని ఆ విధంగా చంపేరు. ఈ కేస్‌లో శత్రువు ఆయా అవతారాల పేర్లు గలవార్ని చంపేడు'' అన్నారు ప్రొఫెసర్ వామ్.

"ఇంతకీ ఆ నీలంసూట్ వ్యక్తిని, అతన్ని వెంటాడిన వ్యక్తిని పట్టి బంధించాలి. చివరి సారిగా కె. పి. రామ్‌ని పీకపిసికి చంపింది నీలంసూట్ వ్యక్తి. ఆ హత్య లన్నిటిలో అతని హస్తం ఉండివుంటుంది'' అన్నాడు రంజిత్.

"ఈ హత్యలన్నిటిని 'జాక్ ది రిప్పర్' వంటి సైకొలాజికల్ మేనియా చేసేడు. స్కాట్‌లాండ్ యార్డ్ పోలీసులు అతణ్ని బంధించడానికి తీవ్రకృషి చేసి సైంటిఫిక్ విధానాల్ని అవలంబించేరు. అందులో ఒక విధానం రెటీనా ఫోటో పద్ధతి. హతుడు ఆఖరిసారి చూసిన దృశ్యం అతని రెటీనా (అంటే దృశ్యఫలకం) మీద ముద్రవేసుకుని ఉంటుందనే సిద్ధాంతంమీద చాలామంది హతుల్ని ఆపరేట్ చేసి వారి రెటీనాల్ని ఎనలైజ్ చేసేరు. కాని ఫలితం లేకపోయింది. ఈ విధానాన్ని మన క్రైం బ్రాంచ్‌లో మెరుగుపరిచి ప్రవేశపెట్టేను. ఫోన్ చేసి కె. పి. రామ్ రెటీనా మీద

పడిన నీలం సూట్ వ్యక్తి ఎవరయినదీ కనుక్కో—"అన్నారు వామ్.

రంజిత్ ఫోన్ రింగవ్ చేసి, రిప్లై కోసం ఎదురు చూడసాగేరు.

"హంతకుడిది చాలా పదునయిన స్క్రీమింగ్ హెడ్. అతడు విష్ణుపురాణం ఆసాంతం విని ఆ యా పేర్లుగల వారిని రకరకాలుగా సంహరించేడు. అయిదుగుర్ని చంపేసేసరికి ఆరవ చావు పరశురాముడిది అవుతుందని అశ్వత్థామ కె. పి. రామ్‌ని హెచ్చరించేడు. హంతకుడు తన గుట్టు బయట పడుతుందనే భయంతో ముందు అశ్వత్థామని చంపేడు" అన్నారు వామ్.

"ఆఖరిచావు కె. పి. రామ్‌ది కానే అయింది. కాని అతడి జేబులో రెండు విజిటింగ్ కార్డులు ఎలా వచ్చేయి. ఒకటి అశ్వత్థామ శవంమీద దొరికింది. మరొకటి పరశురామ్ చావకముందే అతనికి చేరింది. ఇంతకీ విజిటింగ్ కార్డ్ రహస్యం ఏమిటి?" అడిగాడు రంజిత్.

"అశ్వత్థామ పురాణం చదువుతుండగా విన్న వ్యక్తులెవరు?" అడిగేరు వామ్.

"కేవలం ఇద్దరు" అన్నాడు రంజిత్.

"వారెవరు?" అడిగారు వామ్.

"ఒకరు కె. పి. రామ్. మరొకరు అకౌంటెంట్ అశ్వత్థామ."

"ముందుగా చనిపోయినది అశ్వత్థామ. పోగా మిగిలిన వ్యక్తి?"

"కె. పి. రామ్" అన్నాడు రంజిత్.

"కరెక్ట్. విజిటింగ్ కార్డులోని బొమ్మ గండ్రగొడ్డలి ముందు

భాగం. అది పరశురాముని ఆయుధం. తన పార్టనర్స్‌ని ఒకరొకరిగా తొలగించిన హంతకుడు కె. పి. రామ్'' అన్నారు ప్రొఫెసర్ వామ్.

రంజిత్ ఈ జవాబుతో దిగ్భ్రమ చెందేడు.

ఇంతలో గణగణ మంటూ ఫోన్ మ్రోగింది.

అవతలి నుండి వచ్చిన రిప్లై విని మరింత ఆశ్చర్య పోయేడు రంజిత్.

''ఆ నీలంసూట్ వ్యక్తి......?'' అంటూ నిశ్చేష్టు డయ్యేడు.

''నేనే. నేను అనుమానించేనని తెలియగానే కె. పి. రామ్ విషపు మాత్రని మింగబోయేడు. విషం గొంతు దిగకుండా పట్టుకోడానికి ప్రయత్నించేను. కాని లాభం లేక పోయింది. ఆ వెంటాడిన వ్యక్తి నేను నియమించిన బెస్ట్ సి. ఐ. డి'' అన్నారు ప్రొఫెసర్ వామ్.

—: ఐపోయింది :—

# నన్ను ఉరి తీయండి!

కె. శివరామ్

అర్ధరాత్రి!

తరుణేశ్వర్ భార్య సుగంధి, తరుణేశ్వర్ తాత ముత్తాతల కాలంనాటి వాళ్ళనుండి తరుణేశ్వర్ వరకు గల వ్యక్తుల్ని దుయ్యబట్టుతూంది కేకలతో, అరుపులతో, పడక గది నుండి.

వాళ్ళ వంశాన్ని నానాతిట్లతో ఆడిపోసుకోవడం స్పష్టంగా వినబడుతున్నది తరుణేశ్వర్ కు.

మెల్లగా పడక గదిలోకి అడుగుపెట్టాడు, క్రోధంతో.

భర్తను చూడగానే సుగంధి మరింత గట్టిగా శాపనార్ధాలతో దుమ్మెత్తి పోస్తూంది, ఎడ తెరిపి లేకుండా!

భార్యను ఎగాదిగా చూశాడు నిప్పుకణాలు రాల్చే కళ్ళతో. అతనిలోని ఆవేశం కట్టలు తెంచుకున్నది.

ఆకలి గొన్న బెబ్బులిలా మారిపోయాడు.

నిబ్బరించుకోలేకపోయాడు, తన ఆవేశంలో.

ఒక్క ఉదుటున ఉఠికాడు! మంచం మీద కూర్చుని నోటికొచ్చినట్లల్లా వాగే సుగంధి మీద పడ్డాడు.

సుగంధిని మంచం మీదకు నెట్టి, అదిమిపట్టుకుని గొంతు మీద చేతులుంచి గట్టిగా పట్టుకునేశాడు.

సుగంధి కిక్కురు మనలేక పోయింది. ఊపిరాడడం లేదు. భర్త చేతులు గొంతు నులిపే కల్లా, ఆగిపోయాయి ఛివాలున!

"ఇప్పుడు చంపితే ఒక్కసారిగా ఛస్తావు! నువ్వు అలా చావ కూడదు" అని తరుణేశ్వర్ బుసలు కొట్టుతూ, తన ఎడమ చేతిని ఆమె గొంతును అదిమిపెట్టి వుంచి, కుడిచేతితో అందిన గుడ్డనందుకుని, సుగంధి నోట్లో కుక్కేశాడు భీకరంగా.

కాళ్ళూ, చేతుల్ని ఇరికించి పట్టుకుని తుండు గుడ్డలతో బిగించి బంధించాడు, బలంగా__ఆవేశంతో!

సుగంధి,భర్త చర్యలకు గిజగిజలాడిపోయింది, భయంతో. గుండెలు గడగడలాడిపోతున్నాయి. అప్పటికే శరీరమంతా చెమటలతో తడిసిపోయింది.

నోట్లో గుడ్డలు కుక్కడం మూలంగా దవడలు నెప్పి పుట్టుతున్నాయి. ఊపిరాడడం కష్టంగా వుంది.

తరుణేశ్వర్ కత్తిని చేతపట్టుకుని వచ్చి భార్య కెదురుగా ఝుళిపించాడు, క్రూరంగా చూస్తూ!

సుగంధి బిత్తర పోయింది, భర్త చేతిలో కత్తిని చూడగానే! పై ప్రాణాలు పైనే ఎగిరి పోయినంత పనయింది!

భయంతో అటుయిటు కదలబోయింది. కాళ్ళూ చేతులూ కదల్లేకపోయాయి బంధించడం మూలంగా. అరవబోయింది. అరవలేకపోయింది, నోట్లో గుడ్డలు కుక్కబడి వుండడం మూలంగా.

బెదురు చూపులతో భర్తను చూచింది, సుగంధి.

"ఏం ఆశ్చర్యపోతున్నావా?!" గర్జించాడు తరుణేశ్వర్, సుగంధిని మింగేసేటట్టు చూస్తూ.

తన భర్తను విచిత్రపోయి చూచింది, సుగంధి.

"నీ వనుకున్నంత చవటనుకాను. నాకూ రోషం, పౌరుషం వుంది. ఆత్మాభిమానం చావ లేదింకా, నాలో!" అంటూ ఉబికిమి చూస్తూ కత్తి మొనను సుగంధి కంఠం మీద మోపాడు.

తరుణేశ్వర్ రొప్పుతున్నాడు, ఆగ్రహావేశాలతో.

ఉడికిపోతున్నాడు కసితో.

సుగంధి గిజగిజ లాడిపోయింది, కత్తి కంఠంలో దిగబడు తుందని.

"ఊ... చెప్పు, చంప మంటావా? నిన్ను చంపడానికి నీ వద్దనే అనుమతి అడుగుతున్నానని ఆశ్చర్యపోకు! నీ వింత కాలం నాకు భార్యగా ఉండి కష్ట సుఖాల్ని రుచి చూపిన దానవు. ఆ విశ్వాసంతోటే, నిన్ను అడిగి చేయా లను కుంటున్నాను, హత్య!!" అంటూ తరుణేశ్వర్ సుగంధి ఆలోచించుకోడానికి తా విచ్చాడు.

సుగంధి గుండెలు దడదడలాడిపోయాయి, కనుగ్రుడ్లు మిడకరించి చూస్తూ వుండిపోయింది.

"చావడానికి నీ కిష్టం లేదా? చెప్పు, విడాకులు ఇచ్చు కుందాం. విడాకులు ఇచ్చుకోడానికి నామర్దా అనుకుంటావా,

విడాకులు ఇచ్చుకోకుండా ఎవరి దారి వాళ్ళం చూచుకుందాం! మొత్తానికి ఈ రోజు మనిద్దరి మధ్య ఉండే బంధం తెగి పోవాలి, శాశ్వతంగా! అర్థమైందా? నీ నోట్లో గుడ్డను తీస్తాను, అరవడానికి ప్రయత్నించావో ఈ కత్తి కసుక్కున నీ గుండెల్ని, గొంతుని గుచ్చేస్తుంది, జాగ్రత్త!" హెచ్చరించాడు తరుణేశ్వర్ రౌద్రావేశాలతో, సుగంధి నోట్లోని గుడ్డను వెలికితీస్తూ.

"నువ్వో ఒక మనిషివేనా?" అరిచింది సుగంధి. నోటిలోకి తడిని తెచ్చుకుంటూ.

"రాస్కెల్..." అంటూ తరుణేశ్వర్ సుగంధి చెంపను ఛెళ్ మనిపించాడు.

"నేను మనిషిని గనకనే నువ్వు నా అర్థాంగి వన్న అర్థంతో నిన్నడుగుతున్నాను, ఏం చేయమంటావని!"

"ఏమిటిదంతా, నీకు పిచ్చి పట్టిందా?" అయోమయంగా అడిగింది సుగంధి.

"పిచ్చి పట్టి వుంటే, చచ్చి వుండేదానివీపాటికే! నేనడిగిన దానికి బదులు చెప్పు" గద్దించాడు, హుంకరిస్తూ.

"మీ రడిగిన వాటికి ఏ భార్యా సమాధాన మివ్వదు."

"నా భార్య సమాధాన మిస్తుందని నాకు తెల్సు!"

"నే నేమంత తెగించిన దాన్ని కాను, మీ చెల్లెలు లాగ!"

"మా చెల్లెలు ఊసు ఎత్తావో నరికేస్తాను."

"ఏం, మీ చెల్లి ప్రేమా, గీమా అని ఎవడ్నో లేప్పుకెళ్ళితే మంచిదా! దాన్ని ఇంట్లోకి అడుగు పెట్టనివ్వనందుకు నేను చెడ్డదాన్నా?"

"ముమ్మాటికీ నువ్వు చెడుదానివే!"

"నాలో మీ రేం చెడ్డ చూశారు?"

"నేనేమిటే, ఈ ఊరే చూస్తుంది, నువ్ మన పక్కింటి ప్రసాదుతో తిరగడం!!" పళ్ళు కొరికాడు తరుణేశ్వర్.

దిమ్మతిరిగి పోయింది సుగంధికి. తన భర్త తనకు, పక్కింటి ప్రసాదుకు అక్రమసంబధం అంటగట్టుతున్నా డేమిటి?

"అబద్ధం! సర్వ అబద్ధం!" అరిచేసింది బిగ్గరగా సుగంధి.

చెంప ఛెళ్ మని పిస్తూ, "అరవ కూడదు. మెల్లగా చెప్పు. మన మాటలు ఎవరికీ వినబడకూడదు" హెచ్చరింపు జారీ చేశాడు తరుణేశ్వర్.

"అరవక ఏం చేయమంటారు, నాకు ప్రసాదుకి రంకు తనం అంట గట్టితే మీ చెల్లెలిలా నే నేమంత నీతిబాహ్యు రాల్ని కాను" బొంగురు పోయింది సుగంధి కంఠం.

"మా చెల్లెలు పేరు ఎత్త వద్దన్నాను. దాన్ని పంపించి వేశావు. దాని మాట నీ కనవసరం, ఇక! నేనడిగిన వాటిలో నీ కేదిష్టం?? ఏది చేయమంటావో చెప్పు. ఏదీ చెప్పనంటావా నీకు ప్రసాదుకి ఉన్న సంబంధాన్ని మీ పుట్టింటి వారికి చెప్పి, వీధిలో చెప్పి, అల్లరి చేసేస్తాను. ఇంట్లో నుండి నెట్టేస్తాను" కసిగా అన్నాడు.

"నేనే ఈ ఇంట్లో నుండి వెళ్ళనన్నా వెళ్ళుతాను గానీ మీరు మాత్రం ప్రసాదుకి నాకు అక్రమసంబంధం వుందని అనకండి, అపోహపడకండి."

"ఏ ఆడదీ తను నీతిబాహ్యురాలినని చెప్పుకోదు భర్త ముందు ఊఁ...ఊఁ... బయలుదేరు. మూట ముల్లె సర్దుకో! నేను రైల్వే స్టేషను వరకే వస్తాను. రైలుంటే టికెట్ కొనిస్తాను. లేకుంటే నిన్నక్కడ ఒదిలిపెట్టేసి వచ్చేస్తాను. ఆ తరువాత నీ ఇష్టం..." అంటూ తరుణేశ్వర్ భార్య కట్లను విప్పేశాడు.

"నా మీద కక్షకొద్దీ గౌరి మీ కేవేవో చెప్పి వెళ్ళిం దండి. మీ మనసుని విరిచేసింది. నా మాట నమ్మండి. నాకు ప్రసాదుకి ఎటువంటి సంబంధమూ లేదు" కట్లు విప్పగానే తరుణేశ్వర్ కాళ్ళుపట్టుకుని వేడుకోసాగింది సుగంధి, బేలైబోయి.

"గౌరి...... ఆ పేరు ఉచ్చరించడానికే నీకు అర్హత లేదు. ఊ. బయలుదేరు."

"మీ రెందుకనో మారిపోయారు. నా మీద అపనింద మోపి విడిపించుకోవాలని చూస్తున్నారు. నే నెక్కడికీ వెళ్ళను, మిమ్మల్ని విడిచి" చెప్పింది, ఏడుస్తూ.

"వెళ్ళ వద్దు. కానీ ఏం చేయమంటావో చెప్పు. చంప మంటావా?" హుంకరించాడు తరుణేశ్వర్.

"ఏమండి, నన్ను క్షమించండీ??" బావురు మంటోంది సుగంధి.

తరుణేశ్వర్ గబగబ ఆమె గుడ్డల్ని సంచిలోకి కుక్కాడు. సంచిని ఆమె ముఖానికి విసురుతూ, "ఊ బయలుదేరు" అంటూ నెట్టాడు, ఇంటి వెలుపలకు.

తను మొండికేస్తే ఏదైనా అఘాయిత్యం చేయగల ఆవేశంలో ఉన్నాడు. గనక నిదానంగా కారణం తెల్సుకుని భర్త మనసు ప్రకారం మెలగ వచ్చన్న నమ్మకంతో, సుగంధి రైల్వేస్టేషన్‌కు నడిచింది, భర్తతో.

మార్గ మధ్యలో మౌనంగానే నడిచారు.

అర్ధరాత్రి కావడం మూలంగా రైళ్లులేవు, ఆ సమయానికి.

భార్యను స్టేషనులో వదిలిపెట్టి తరుణేశ్వర్ భారం తగ్గిన వాడిలా, తేలిక మనసుతో ఇల్లు చేరుకున్నాడు.

ఇంటి తలుపులకు తాళం పెట్టి లేదు. తను మరిచిపోయి

వుంటాడని అనుకున్నాడు, భార్యను ఇంటినుండి తరిమిన ఆవేశంలో. తలుపుల్ని తెరువబోయాడు తరుణేశ్వర్.

"ఆగు!" అంటూ నలుగురు పోలీసులతో ఇన్స్పెక్టర్ ధనార్జనరావ్, తరుణేశ్వర్‌ని చుట్టు ముట్టేశాడు.

తరుణేశ్వర్ తడబడిపోయాడు, పోలీసులు చుట్టు ముట్టగానే.

"ఎందుకు?" ధైర్యం కూడగట్టుకుని అడిగాడు.

"ప్రసాద్‌ని హత్య చేసినందుకు!!" ఇన్స్పెక్టర్ చెప్పాడు గంభీరస్వరంతో.

ప్రసాద్ హత్య అనగానే తరుణేశ్వర్ గుండెలు ఢమఢమ లాడిపోయాయి. అదురు బెదురులతో, సంభ్రమాశ్చర్యాలతో స్థంభించిపోయి నిలబడిపోయాడు!

మరుక్షణంలో ఏదో నిర్ణయించుకున్న వాడల్లా— తన పెదాల మీదకు చిరునవ్వు తెచ్చి పెట్టుకుని, "వెరీ గుడ్, మిస్టర్ ఇన్స్పెక్టర్! నేనెంతో అదృష్టవంతుణ్ణి! నా అంత అదృష్టశాలి ఎవరూ వుండరు. నేను దోషినే. నన్ను వురితీయండి!! నన్ను తప్పక వురితీయండి!!!" అంటూ ఏదో తృప్తితో తన చేతుల్ని ముందుకు చాచాడు జేడీలు తగిలించండన్న అర్థంతో తరుణేశ్వర్!

# 2

సుగంధికి దుఃఖం కట్టలు త్రెంచుకుంటూంది.

పుట్టింటి కెళ్ళాలి, పుట్టిల్లు గంపెడు పిల్లలున్న సంసారం. అంతమందిలో తనకు పూటకు ఇన్ని మెతుకులు దొరకడం, దుస్సాధ్యం.

మరి ఎక్కడి కెళ్ళాలి?

తనకి, ప్రసాదుకి అంటకట్టిన అక్రమసంబంధం సర్వ

అబద్ధమని తన అంతరాత్మకు తెల్సు. అయితే తన భర్త ఎందుకు నింద మోపాడు? అనుమానించాడా?

ఆయన అనుమానించే విధంగా తనెప్పుడూ ఆ ప్రసాదుతో మెలగ లేదు. మరి, ఈ విపరీతం, ఏమిటి? ఏడుస్తోంది సుగంధి రైల్వే స్టేషనులో మూలగా చీకటిలో కూర్చుని.

ఏడ్వగా కారిన కన్నీటి గుండా వేదన కాస్త ఉపశమించింది. కొద్దిగా ధైర్యం కూడ కట్టుకుంది.

కట్టుకున్న పెళ్ళాన్ని లేనిపోని అపనిందలతో బయటికి గెంటితే, తను రావడం సబబు కాదనిపించింది సుగంధికి. తనకు ప్రసాదుకు ఎటువంటి సంబంధమూ లేదు. లేని సంబంధాన్ని అంటగట్టి తనని అవమాన పరచాలని, తన భర్త ఇంటి నుండి వెళ్ళగొట్టాడని ఊహించుకుంది, సుగంధి.

భర్తకు దూరమైతే తన బ్రతుకంతా వ్యర్థమైపోతుందని వ్యథిత హృదయంతో కుమిలిపోయి, ఒక నిర్ణయాని కొచ్చింది.

తను పుట్టి నింటికి వెళ్ళకూడదు. వెళ్ళితే, నానా అగచాట్లకు గురి కావలసి వస్తుంది! ఇక్కడే వుండి, ఉదయాన్నే భర్తను కల్సుకుని తాడో, పేడో తేల్చుకోవాలి, స్పష్టంగా వివరాలతో!

కోర్టు కెక్కితే జీవన భృత్తి అయినా లభిస్తుందని ఆశించింది.

రకరకాల ఆలోచనలతో రాత్రంతా రైల్వే స్టేషనులోనే గడిపేసింది.

తెల్లవారగానే బయలుదేరింది, ఇంటికి!

ఇంటి వద్ద గుమికూడిన పోలీసుల్ని, జనాన్ని చూడగానే గుండెలు జారిపోయాయి.

గబగబ జనాన్ని త్రోసుకుంటూ ఇంట్లోకి ప్రవేశించింది.

"ఏమైంది?" ఆతృతతో ఆందోళన హృదయంతో ప్రశ్నించింది, ఒక కానిస్టేబుల్ని.

"ఎవరు నువ్వు?" అడిగాడు కానిస్టేబుల్.

"నేను తరుణేశ్వర్ భార్యను."

"ఓ అలాగా...మీ ఆయన ప్రసాదుని హత్య చేశాడు, రాత్రి! సార్...సార్..." అంటూ పిలిచాడు ఇన్స్పెక్టర్ని కానిస్టేబుల్.

ప్రసాద్ హత్య గావించబడ్డాడనగానే సుగంధి స్థాణువై నిలబడిపోయింది.

"ఎవరూ?" అంటూ లోపల వున్న ఇన్స్పెక్టర్ ధనార్జనరావ్ బయటికి వచ్చాడు, సుగంధని చూస్తూ.

"ఈమే సార్! తరుణేశ్వర్ భార్య!" చెప్పాడు కానిస్టేబుల్.

"మీరేనా! రాత్రి మీ రెక్కడి కెళ్ళారు?" అడిగాడు ఇన్స్పెక్టర్.

"రైల్వేస్టేషనుకు."

"ఏ ఊరెళ్ళడానికి?"

"మా ఊరు!"

"వెళ్ళలేదేం?" అడిగాడు ఇన్స్పెక్టర్.

తటపటాయించింది, నిజం చెప్పడానికి సుగంధి. "రైలు లేదు. తిరిగి వచ్చేశాను" చెప్పింది చిన్నఅబద్ధం.

"ఎన్ని గంటలకు వెళ్ళారేమిటి?"

"సుమారు రెండు గంటల ప్రాంతంలో!"

"రాత్రి రెండు గంటలకు, ఏ రైలుంది? మీకై మీరెళ్ళారా? తరుణేశ్వర్ బలవంతంమీద వెళ్ళారా?" అడిగాడు ఇన్స్పెక్టర్.

నిజాన్ని దాచలేకపోయింది. "ఆయన బలవంతం మీద నే" చెప్పేసింది.

"బలవంతం మీద మిమ్మల్ని స్లీపనుకు పంపి, ప్రసాద్ ని హత్య చేశాడు. శవాన్ని మీ బెడ్ మీద నే పడుకోబెట్టాడు. పైగా తరుణేశ్వర్ తనే హత్య చేసినట్టు ఒప్పుకున్నాడు."

"ఒప్పుకున్నారా!? ఎందుకు హత్య చేశారట?" అడిగింది సుగంధి బొంగురు కంఠంతో.

"మీకు ప్రసాద్ కు అక్రమసంబంధం వుండడం తెలియగానే తనలో కలిగిన కోపావేశాలను అణచుకోలేక ప్రసాద్ ని హత్యచేసినట్లు తరుణేశ్వర్ వాఙ్మూలం ఇచ్చాడు."

"అబద్ధం! అబద్ధం! అబద్ధం!" అరిచేసింది. ఏడుస్తోంది అరుపులతో శోకాలతో సుగంధి దీనంగా.

# 3

"ఎవరమ్మా? నా వద్దకు ఎందుకు వచ్చావు?" అడిగాడు ప్రముఖ ప్రయివేట్ డిటెక్టివ్ యువరాజ్, తన కెదురుగా కూర్చుని వున్న యువతిని చూస్తూ.

చెదిరిపోయివున్న తల, నిద్రలేమి మూలంగా ఎఱ్ఱగా బలహీనంగా కనబడే కళ్ళు, వాడిపోయిన పువ్వు రేకుల్లా ఉండే ముఖకవళికలు.

"నా పేరు సుగంధి. మా ఆయన పేరు తరుణేశ్వర్. జలజ ట్రేడర్స్ లో సూపర్ వైజరుగా పనిచేస్తున్నారు. మా కుటుంబంలో జరగరాని విచిత్రమైన విపరీతం జరిగింది రాత్రి!"

అసిస్టెంటు నూరి షార్ట్ హాండ్ లో వ్రాసుకుంటున్నాడు చకచక.

"జరిగిందేమిటో చెప్పమ్మా."

"నాకూ పక్కింటి ప్రసాదుకీ అక్రమసంబంధం అంట

గట్టి మా ఆయన వెలివేయాలని నన్ను...'' చెప్పింది జరిగినదంతా, తు. చ. విడువకుండా!

డిటెక్టివ్ లిరువురూ ఆశ్చర్య చకితులైపోయారు, దిగ్భ్రమతో. ''ఎటువంటి సంబంధమూ లేదు. అతను పెళ్ళికాని వాడు. నేనతనితో మాట్లాడినదే లేదింత మటుకు'' వేదన పూరిత హృదయంతో నివేదించుకుంది సుగంధి.

''అంత దూరంగావున్న నీకు—ప్రసాదుకి ఎలా అక్రమ సంబంధం తిరుణేశ్వర్ అంటగట్ట గలడు? అతని కేదో అనుమానం కలిగివుంటుంది, మీ ఇద్దరిమీద! అందుకే హత్య చేసి, ఒప్పుకుని వున్నాడు'' చెప్పాడు యువరాజ్.

''నాకు నమ్మకం కుదరడంలేదు, ఆయన హత్య చేశాడంటే?'' అంది సుగంధి.

''ఎందుకని?''

''ఆరేండ్లుగా ఆయనతో కాపురం చేస్తున్నదాన్ని. ఆయన స్వభావం, మన స్తత్వం తెల్సినదాన్ని.''

''నువ్వు చెప్పబోయే దేమిటో నా కర్థమైందమ్మా! తనే హత్య చేయడానికి గల కారణాన్ని చెప్పి తిరుణేశ్వర్ శిక్ష అనుభవించడానికి సిద్ధపడి వున్నాడు. అటువంటతన్ని నువ్వో నేనో లేక ఇంకెవరైనప్పటికి చేయగలిగిం దేమీ లేదు'' అన్నాడు యువరాజ్.

''మీబోటి వాళ్ళు అలాగంటే ఎలా? మీ గురించి గొప్పగా చెప్పుకుంటూండగా విని వచ్చాను. నేను పేదరాల్ని. మీ రడిగిన ఫీజుని ఇవ్వలేను. కానీ, కలిగిన దానిని ఇచ్చుకుంటాను. నా మీద అక్రమసంబంధం అంటగట్టడం అబద్ధం. అదేవిధంగా ఆయన హత్య చేయడమూ అబద్ధం!'' ఏడుస్తోంది సుగంధి బావురుమని.

యువరాజ్‌కు అయోమయం అయిపోయింది. చేయని నేరాన్ని చేశానని ఎందుకు ఒప్పుకుంటాడు? ఏమైనా కుటుంబ కలతలు కారణమా?

"మీ ఇంట్లో ఇంకెవరైనా ఉన్నారాండీ?" అడిగాడు యువరాజ్.

"చెప్పాను కదండీ, ఆయన చెల్లెలు గౌరి వుంది! అది ఎవర్నో ప్రేమించి, రాత్రే వెళ్ళింది" చెప్పింది సుగంధి అక్కసుగా.

"ఎవర్ని ప్రేమించింది?"
"ఫాల్గుణమూర్తిని!"
"వాళ్ళిద్దరికి పెళ్ళి చేయకపోయారా?"

"పెళ్ళి చేయమని అర్ధరాత్రిలో ఫాల్గుణమూర్తి, గౌరితో వచ్చాడండి!"

"గౌరి ఎక్కడికి వెళ్ళింది? మీ ఇంట్లో లేదా?" ఆశ్చర్యపోతూ అడిగాడు యువరాజ్.

"రాత్రి చావడానికని బావిలో దూకడానికి వెళ్ళిందట! అది చూసి ఫాల్గుణమూర్తి ఆమెను కాపాడి తీసుకవచ్చాడట పెళ్ళిచేసుకోడానికి! నేనొప్పుకోలేదు వాళ్ళ మాటల్ని. ఇంట్లోకి రానివ్వలేదు. వెళ్ళిపోయారు, రాత్రే! వాళ్ళు అటు వెళ్ళగానే మావారు నన్ను...నన్ను..." దుఃఖావేశంతో ఫుకోడంలో లీనమైంది సుగంధి.

"గౌరి బావిలో దూకడానికి ఎందుకెళ్ళింది?" విచిత్రపోయి ప్రశ్నించాడు యువరాజ్.

"అంతా అబద్ధం! లేచివెళ్ళడానికి పోయి—ఇద్దరూకూడ బలుక్కుని వచ్చారు. పెళ్ళిచేయమని! నేనందుకు చోటివ్వలేదు" చెప్పింది సుగంధి.

"ఎందుకు?"

"లేపు కళ్ళే ఫాల్గుణమూర్తితో కెళ్ళక—తిరిగి వచ్చి పెళ్ళి చేయండని అడగడం మాకు నచ్చలేదు. ఆ పెళ్ళేదో ఏ రిజిస్ట్రార్ ఆఫీసులోనో చేసుకోండని పంపించేశాము, పెళ్ళి ఖర్చులు మిగులుతాయని!"

"వాళ్లు ఇప్పు డెక్కడున్నారు?"

"రాత్రే గదండి, వెళ్లుతా. ఎక్కడ కెళ్లారో? ఎక్కడున్నారో?" అని చెప్పింది సుగంధి.

# 4

"మీరు వస్తారని తెల్సి ఆగాను" అంటూ ఆహ్వానించాడు క్రైం బ్రాంచ్ డిటెక్టివ్ ఇన్స్పెక్టర్ ధనార్జనరావు యువరాజ్‌ని.

"శవం ఎక్కడుంది?" అడిగాడు యువరాజ్.

"లోపల, పడగ్గదిలో!"

వెళ్ళి చూశాడు శవాన్ని, యువరాజ్. సూరి యువరాజ్ వెనుకాలే వచ్చాడు.

చాలా చిన్న పడగ్గది. మధ్య తరగతి కుటుంబీకులది గనక విశేషం లేదు, అమరికలో.

నవారున్న పట్టెమంచం మీద పరుపుంది. పరుపుమీద ప్రసాద్ శవం వెల్లకిలా వుంది. గొంతు ఉబ్బినట్టుగా వుంది. కళ్ళు కొద్దిగా వెళ్ళుకు వచ్చి ఉన్నాయి.

"చావుకు కారణం, గొంతు నులపడమా?" అడిగాడు యువరాజ్.

"కాదు, వీపులో కత్తిపోటుంది!" చెప్పాడు ధనార్జనరావు.

"మరి, గొంతు నులిపి నట్టుందే!?"

"కత్తితో పొడిచిన తరువాత గొంతుని వెనుకవైపుగా వచ్చి పట్టుకుని నులిపి వున్నాడు, హంతకుడు! రెండు బొటనవ్రేలి ముద్రలు మెడ పైభాగాన ఉండగా, ఎనిమిది వ్రేళ్ళ గుర్తులు కుత్తికమీద ఉన్నాయి."

"అంటే, హతుడు అలికిడి అవకుండా ఉండడానికి పీకను నొక్కి వున్నారన్నమాట! ప్రాణం ఎన్ని గంటల ప్రాంతంలో పోయిందని డాక్టర్ చెప్పాడు?"

"ఒకటి ముప్పావు నుండి, రెండుంపావు లోపు ప్రాణం పోయి వుండాలని చెప్పాడు."

"కత్తితో పొడవబడి వున్నాడు. అయితే బెడ్ మీద రక్తం గోచరించడం లేదే!" అంటూ యువరాజ్ ఆశ్చర్య చకితుడై పరీక్షించాడు, పరుపుమీది దుప్పటిని.

నెత్తురు మరకలు మచ్చుకైనా లేవు.

"నాకూ బోధ పడడం లేదు. హత్య ఎక్కడో జరిగి నట్లుంది" అన్నాడు ధనార్జనరావు.

"హత్యకు ఉపయోగించిన ఆయుధం కనబడిందా?" అడిగాడు సూరి.

"ఈ ఇంట్లో ఎక్కడా కనబడ్లేదు."

"ఆయుధాన్ని తరుణేశ్వర్ ఏం చేశాడట?"

"పారేశాడట!"

"ఎక్కడ?"

"ఫలానా చోటని చెప్పడం లేదు."

తరుణేశ్వర్ హత్య చేయలేదనడానికి చాలా సాక్ష్యాలు లభిస్తున్నాయి. హత్య 1-45 నుండి 2-15 లోపు జరిగి వుంటుంది. తరుణేశ్వర్ వద్ద రెండు గంటల వరకు గౌరి ఫాల్గుణ మూర్తులువుండి ఉన్నారు. ఆ తరువాత అతని భార్య సుగంధి

వుంది రెండున్నర వరకు. రెండున్నర నుండి, మూడు గంటల వరకు ఇంట్లో ఎవరూ లేరు, దంపతు లిద్దరూ రైల్వే స్టేషనుకు వెళ్ళడం మూలంగా. అదీగాక హత్య ఎక్కడో చేసి, శవాన్ని తెచ్చి ఇంటిలో పెట్టుకోడు ఏ హంతకుడు.

"తరుణేశ్వర్ని అరెస్ట్ చేశారా?" అడిగాడు యువరాజ్.

"హత్య చేసింది తనేనని ఒప్పుకున్నాడు. అరెస్ట్ చేయకుండా ఎలా ఉండగలను?!"

"ఇక్కడ హత్య జరిగినట్లు మీ కెలా తెల్సింది?"

"ఎవరో ఫోన్ చేసి చెప్పారు."

"ఏమని?"

"ఈ ఇంట్లో కేకలు వినబడ్డాయని, కేకలు బట్టి చూస్తే హత్య జరిగి వుంటుందని గట్టిగా, ఖచ్చితంగా చెప్పాడతను మమ్మల్ని రమ్మని."

"చెప్పినది ఎవరైంది తెల్సుకున్నారా?"

"అప్పుడే ఫోనులో అడిగితే - తనొక సామాన్య పౌరుడ్నని - పౌరబాధ్యతను నిర్వహిస్తున్నానని ఉపన్యాసధోరణిలో చెప్పాడట!"

తల పంకించాడు యువరాజ్, ఏదో ఊహించుకుంటూ.

"హతుడు ప్రసాద్ ఇల్లు ప్రక్క ఇల్లే గదా! ప్రసాద్ని గురించి వివరా లేవైనా సేకరించారా?" అడిగాడు నూరి.

"ఇంకా లేదు. కానీ ప్రసాద్ తండ్రి పూర్ణానందం గురించి మా డిపార్టుమెంటుకు కొన్ని రిపోర్టులు అంది వున్నాయి. పూర్ణానందం అప్పుడప్పుడు కొందరు అమ్మాయిలతో అబ్బాయిలను చేర్చి - భార్యా భర్తలని చెప్పి లాడ్జింగులలో గది అద్దెకు తీసుకుని విడిచి పెట్టుతాడట!"

"విచిత్రంగా వుందే!" అన్నాడు నూరి చిరునగవుతో.

"అవును సూరీ! పూర్ణానందం అమ్మాయిల్నీ, అబ్బాయిల్నీ లాడ్జింగ్ రూములలో వదలడం మావు ఉత్తరం మూలంగానూ, ఫోన్ ద్వారాను తెల్సింది."

"మీరు ఏక్షన్ తీసుకోలేదా?"

"నేను తీసుకోలేదు. డివిజనల్ పోలీస్ స్టేషన్‌కు తెలియజేశాను, అక్కడి ఎస్. ఐ. నుండి నాకింకా రిపోర్టు అందలేదు."

యువరాజ్ శవం వీపు భాగాన్ని పరీక్షించాడు. అక్కడక్కడ ఇసుక రేణువులు అంటి వుండడం చూశాడు. పడక మీద చంపబడి వుంటే ఇసుక అంటడానికి అవకాశం లేదు. గనక హత్య ఇసుక ఉన్న ప్రదేశంలో జరిగి వుండాలి.

హత్య ఇసుక ఉన్న ప్రదేశంలో జరిగి వుంటే – శవమూ అక్కడే వుండి వుండాలి. ఇక్కడి కెలా వచ్చింది? తీసుకుని వచ్చి ఉండాలి. శవాన్ని చంపిన చోట వదలకుండా ఇక్కడకు ఎందుకు తెచ్చారు? భద్రంగా పడక మీద ఎందుకు పడుకోబెట్టారు!

"మిస్టర్ ధనార్జనరావ్! ఈ హత్యను తిరుణేశ్వర్ చేయలేదని గట్టిగా చెప్పగలను, వాదించగలను, నిరూపించగలను," అన్నాడు యువరాజ్.

"అయితే హత్య చేసిందెవరు? హత్య చేయని తరుణేశ్వర్ తనే హత్య చేసినట్టు ఎందుకు ఒప్పుకుని, శిక్షను అనుభవించడానికి తయారయ్యాడు?" అడిగాడు ధనార్జనరావు.

"ప్రసాద్‌ని హత్య చేసిం దెవరో పరిశోధన మీదట బయట పడుతుంది. తరుణేశ్వర్ ఎందుకు హత్యా నేరాన్ని మీద వేసుకుంటున్నాడో, గౌరి ఫాల్గుణమూర్తులను కల్సుకుంటే చెప్పగలను," చెప్పాడు యువరాజ్.

"తరుణేశ్వర్ రైల్వే స్టేషన్నుండి రాగానే తలుపుల వద్దనే అటకాయించాను. సంకెళ్ళకు చేతులు చాస్తూ, 'నేను దోషిని. నన్ను వురితీయండి! నన్ను తప్పక వురితీయండి!!' అంటూ పిచ్చిగా వాగాడు" చెప్పాడు ధనార్జనరావు.

"ఉఁ...ఊఁ...అలాగా...!" తల పంకించి, "అంటే తరుణేశ్వర్ని ఇంటి లోనికి రాకముందే అరెస్ట్ చేసారన్న మాట! అయితే ఈ శవం ఈ ఇంట్లో ఉన్నది అతనికి తెల్సి వుండదే?!"

"ముందు తెలియదు. తెల్సిన తరువాత సుగంధ వద్ద ప్రసాద్ వుండడం చూచి చంపాననన్నాడు తరుణేశ్వర్."

"సుగంధి అతనితో స్టేషనుకు వెళ్ళితే ప్రసాద్ వద్ద ఎలా వుంటుందట, ఫూల్!" అన్నాడు సూరి.

"ప్రసాద్‌ని తరుణేశ్వర్ హత్య చేయలేదని రూఢిగా తెల్సిపోయింది. అయితే ప్రసాద్‌ని హత్య చేసిం దెవరు? మన పరిశోధన ముందుకు సాగడానికి ప్రసాద్ వ్యక్తిగత విషయాలు, రాత్రి ఎక్కడికి వెళ్ళాడు? ఎక్కడున్నాడు? ఆరా తీయాలి. పైగా అతని తండ్రి పూర్ణానందం అమ్మాయిల్ని అబ్బాయిల్ని కలిపి భార్యా భర్తలుగా చెప్పి లాడ్జింగుల్లో వదులుతున్నారంటున్నారు. వివరాలు తెల్సుకోవాలి రండి" బయలుదేరారు పక్కింటి పూర్ణానందం వద్దకు!

# 5

పూర్ణానందం యాభయ్యోపడిలో పడ్డ వ్యక్తి!
అతని భార్య అనంతనాయకికి నలభై వయస్సుంటుంది.

ఇద్దరి ముఖాల్లోను కత్తిగాటుకు నెత్తురుచుక్క లేదు. అనంతనాయకి ఏడ్వడం మూలంగా ముఖమంతా జేవురించి పోయివుంది.

అన్నిటిని త్యజించుకుని వరదల్లోపడి కొట్టుకెళ్ళు వ్యక్తుల్లా గోచరించారు. అసలే వృద్ధాప్యం! ఒక్కగా నొక్క కొడుకు హత్య చేయబడ్డా డనగానే రోగ పీడితుల్లా ఇంకా కుంచించుకు పోయారు భరింపరాని వేదనతో.

డిటెక్టివ్ యువరాజ్, అసిస్టెంట్ సూరి, ఇన్స్పెక్టర్ ధనార్జనరావు ఒక్కసారిగా ఇంట్లోకి అడుగు పెట్టారు. ముగ్గురూ ఆశ్చర్యపోయారు ఆ ఇంటిని చూచి.

చాలా చాలా చిన్న ఇల్లు! రెండే రెండు గదు లున్నాయి! ఒకటి వంట గది. మరొకటి పడక గది. ఆ గదిలో మంచాలు రెండు, పరుపులు, దిండ్లు, దండానికి వ్రేళ్ళాడే గుడ్డలు, ట్రంకు పెట్టెలు - ఇంకా ఇతర సామాన్లు సీసాలో ఉండే మందు బిళ్ళల్లా వున్నై!

కూర్చోడానికి చోటులేక అలాగే నిలబడి పోయారు ముగ్గురూ.

"రాత్రి మీ ప్రసాద్ ఎక్కడి కెళ్ళాడు?" అడిగాడు ధనార్జనరావు.

"సినిమాకు, రెండో ఆటకి!" చెప్పాడు పూర్ణానందం.

"సినిమాకు వెళ్ళిన వాడు తిరిగి రాలేదా?" అడిగాడు యువరాజ్.

"రాలేదట!"

"అంటే, మీరు ఇంట్లో లేరా, రాత్రి?"

"లేను. నేనూ సినిమా కెళ్ళాను, పెద్దమ్మాయి, అల్లుడితో."

"ఓహో. మీ ఆవిడ వుందన్న మాట! రాత్రి మీరంతా ఎన్ని గంటలకు వచ్చారు?"

"మేమంతా రాలేదు. నేనొక్కడ్నే వచ్చాను ఇంటికి పెద్దమ్మాయిని, అల్లుడ్ని లాడ్జింగ్ లో విడిచిపెట్టి!!"

"లాడ్జింగ్‌లో విడిచి పెట్టారా, ఎందుకు?" ఆత్రుతను అణుచుకోలేక అడిగాడు ధనార్జనరావు.

"మా ఇల్లు చాలా చిన్నది. ఈ చిన్న ఇంట్లో నేను మా ఆవిడ, అబ్బాయి పడుకోడానికే ఇబ్బంది, అటువంటి ఈ ఇంట్లో అల్లుణ్ణి, అమ్మాయిని ఎలా పడుకో పెట్టుకో గలం??"

"అందుకని?"

"లాడ్జ్‌లో గదిని అద్దెకు తీసుకుని వసతిని ఏర్పాటుస్తాను, పెద్దమ్మాయి, రెండో అమ్మాయి భర్తలతో వచ్చినప్పుడల్లా! మా కుటుంబ పరిస్థితి మూలంగా అల్లుళ్ళకు లోటు, ఇబ్బంది కల్గకుండా ఎప్పుడో వాళ్ళు వచ్చినపుడు తగిన సౌకర్యాలను అందివ్వడం, నా బాధ్యత. నా యీ చర్యను చాలా మంది తప్పుగా లెక్కించడం వాళ్ళ పొరబాటు" చెప్పాడు పూర్ణానందం.

ధనార్జనరావు బిక్కముఖం పెట్టినంత పన్జేశాడు.

"రాత్రి మీరు లాడ్జ్ దగ్గనుండి ఎన్ని గంటలకు ఇల్లు చేరుకున్నారు?" అడిగాడు యువరాజ్.

"సినిమా వదలగానే లాడ్జ్ కెళ్ళి, ఇంటి కొచ్చేశాను, కాసేపు కుటుంబ విషయాలు మాట్లాడుకుని! టైం రెండు దాటి వుంటుంది."

"ఆ సమయంలో ఇక్కడ మీ కెవరైనా కన్పించారా?"

"ఎవరూ నా కగు పడలేదు. కానీ ప్రక్కింటి నుండి అలుపులు, కేకలు వినబడ్డాయి. నేను విన్పించుకోలేదు, మా ఆవిడతో పెద్దమ్మాయి కాపురాన్ని గూర్చి ముచ్చటించు కుంటూ! అబ్బాయి రాలేదేం ఇంకా_ అని నేను, మా ఆవిడ చాలా సేపు ఎదురు చూసి _ చూస్తూ నిద్రపోయాం! తెల్లవార

గానే, ఈ దారుణం!" నోటికి పైగుడ్డను అడ్డం పెట్టు కున్నాడు దుఃఖంతో పూర్ణానందం.

"తరుణేశ్వర్ తన భార్య సుగంధితో ప్రసాద్‌కు అక్రమ సంబంధం వుందని చెప్తున్నాడు. మీరేమంటారు?" అడిగాడు యువరాజ్.

"అదంతా ఒట్టి కల్పితం. సత్యహరిశ్చంద్రుడి మీదైనా అపనిందను మోపవచ్చు, కానీ ప్రసాద్ మీదా, సుగంధి మీదా అపనింద మోపడం అక్రమం! ఎందుకంటే కొడుకుగా ప్రసాద్‌ని గురించి, పక్కింటి ఇల్లాలుగా సుగంధిని గురించి నాకు బాగా తెల్సు" అంటూ పూర్ణానందం, ఇంకా వాళ్ళ లోని నైర్మల్యాన్ని గురించి బల్ల గుద్ది చెప్పినట్టుగా చెప్పాడు వివరంగా.

"ప్రసాద్ స్నేహితులలో విరోధులో, పగవారో వున్నట్టు మీ కెవరి మీదైనా అనుమానం ఉంటే చెప్పండి!" అన్నాడు యువరాజ్.

"నాకు తెల్సినంత వరకు ఎవరూ లేరు. మా అబ్బాయి భోగి కాదు, త్యాగి! గనక, ఒకర్ని నొప్పించడు. తా నొవ్వినా! నష్టపడ్డా విరోధం తెచ్చుకోడు ఏ విషయంలోను, ఎవరితోను" చెప్పాడు పూర్ణానందం.

"రాత్రి సినిమాకు అందరూ కల్సే వెళ్ళారా?"

"లేదండి, మేము వెళ్ళింది చిత్రా టాకీస్‌కి!"

"అయితే, ప్రసాద్?"

"అజంతాకు, వెళ్ళుతా నన్నాడు."

"మీతో సినిమాకు రాక, అజంతాకు ఎందుకు వెళ్ళాడు? ఎవరైనా స్నేహితుడితో కల్సి వెళ్ళాడా?"

"జనమేజయంతో కల్సి వెళ్ళి వుండొచ్చు. ఎందుకంటే వారిద్దరు క్లోజ్ ఫ్రెండ్స్!"

"జనమేజయం ఇల్లెక్కడ?"

"బీచ్ లెన్ దగ్గర!"

యువరాజ్ మనస్సు గతుక్కుమంది,బీచ్ లైన్ అనగానే!

శవానికి అంటి వున్న ఇసుక, జనమేజయాన్ని గూర్చి రకరకాల ఆలోచనలతో, ఊహాలతో పూరింప జేసింది.

"జనమేజయం మీ యింటికి వస్తూ ఉంటాడా?"

"ఇద్దరూ ఒకే చోట పని జేస్తున్నారు. అప్పుడప్పుడూ వస్తుంటాడు. మా వాడూ వాళ్ళింటికి వెళ్తుంటాడు."

అనంతనాయకిని కొన్ని ప్రశ్న లడిగాడు యువరాజ్. ఆమె తన కేమీ తెలియదని చెప్పింది, దుఃఖంతో. కానీ పక్కింటి నుండి భార్యా భర్తల కీచులాటను విన్నట్టు చెప్పింది.

తరుణేశ్వర్ ఇంట్లో నుండి పెద్దపెద్దగా ఏడ్పులు విన్పించాయి.

అప్పుడే ఒక కానిస్టేబుల్ వచ్చాడు, సెల్యూట్ చేస్తూ.

"సార్! గౌరి, ఫాల్గుణమూర్తులట - వచ్చారు సార్!!" చెప్పాడు కానిస్టేబుల్.

"వెరీగుడ్. వస్తున్నాం-పద!" అన్నాడు యువరాజ్.

## 6

ఏదో ప్రమాదానికి గురై అపస్మారక స్థితిలో వున్న వ్యక్తుల్లా గోచరించారు గౌరి ఫాల్గుణమూర్తులు.

చూడీ చూడగానే చక్కని జంటనిపించింది యువరాజ్ కు.

యూనిఫాంలో ఉన్న ధనార్జనరావుని చూడగానే గౌరికి భయం పుట్టుకొచ్చింది. "మా అన్నయ్య ఈ హత్య చేసి వుండడు" చెప్పింది చేతులు జోడిస్తూ, గౌరి.

"ఇంకెవరు చేసి వుంటారు?" అడిగాడు ధనార్జనరావు.

"ఏమో నండి" బిత్తర పోయింది గౌరి.

"శవం మీ ఇంట్లో వుంది. చంపింది తనేనని ఒప్పు కున్నాడు తరుణేశ్వర్!" చెప్పాడు ధనార్జనరావు.

"అబద్ధం!"

"అయితే, నిజం చెప్పండి, రాత్రి జరిగిం దేమిటో?" అన్నాడు యువరాజ్.

గౌరి చెప్పడం ప్రారంభించింది:

* * *

గౌరి అంటే లేశమైనా గిట్టదు, సుగంధికి!

అందుకు కారణ మేమిటో గౌరికి ఇంత మటుకు తెలియ రావడం లేదు.

ఇంటి చాకిరి అంతా గౌరి ఒక్కతే చేస్తుంది, ప్రొద్దున్న నిద్ర లేచిన దగ్గర్నుంచి - పడుకో బోయేంత వరకు.

పాచి పని, అంట్లు తోమడం, కాఫీ పెట్టడం, టిఫిన్ తయారుచేయడం, వంటా వార్పు, బట్టలకు సబ్బు పెట్టడం, పెరట్లో ఉన్న పూలమొక్కలకు నీరు పోయడం లాటి పనులన్నీ గౌరి యాంత్రికంగా చేసుకుపోతుంది రోజూ.

సుగంధి ఒక్క పనీ ముట్టుకోదు. ఇంటి కొచ్చిన కొత్త చుట్టంలా కుర్చీలో కూర్చునో, మంచం మీద పడుకునో, చదువుకుంటూనో ఉంటుంది.

సుగంధి మాటను గౌరి ధిక్కరించినది లేదు, ఎప్పుడూ. వినయవిధేయతలు ప్రకటించని క్షణం లేదు. కానీ సుగంధికి గౌరి అంటే అసూయ, ద్వేషం!

అసూయాద్వేషాలు ఉండబట్టే కాబోలు - గౌరికి మంచి సంబంధం కోసం వెదికే తరుణేశ్వరుతో సుగంధి తగాదాకు దిగింది!

తరుణేశ్వర్‌కు తన చెల్లెలు గౌరి అంటే పంచప్రాణాలు. చిన్నప్పటి నుండి అల్లరి చిల్లరి వయసులో అనురాగాల స్రవంతిలో పెరిగిన వారు. ఒకరి మీద మరొకరికి మమకారం!

అమ్మ నాన్నలు గతించిన పిదప గౌరి అన్నయ్య వద్దనే వుండిపోయింది.

గౌరి కలవారి ఇంటికి కోడలుగా వెళ్ళాలని తరుణేశ్వర్ కలలు గన్నాడు. కలలన్నీ కల్లలై పోయాయి, మార్కెట్టులో పలికే కట్నాల ధరలు గమనించగా.

కనీసం నుంచి సంబంధాన్నైనా చూచి గౌరిని ఇల్లాలిని చేసి పంపాలనుకున్నాడు.

"మంచీ లేదు, గించీ లేదు. ఎవడికో ఒకడి కిచ్చి ముడి పెట్టించి బయటికి పంపండి. కట్నాలు కానుకలు ఇవ్వడానికి మనవద్ద భూషణాలు నిండిన భోషాణాలు లేవు. ఉద్యోగస్థుడో, శ్రీమంతుడో కావాలని కాచుకూర్చోడానికిదేమీ ధర్మసత్రం కాదు. వయసైన పిల్లను ఇంట్లో పెట్టుకోవడం సిగ్గుచేటు!" అని మండిపడింది సుగంధి.

"మా చెల్లెలు అద్దంలాటిది. అద్దాన్ని గుడ్డివాడి కిచ్చేంత అవివేకిని కాను, నువ్వు నీ బోడిసలహా ఇచ్చినంతమాత్రాన!"

రానురాను గౌరిని ఎలాఎలా బాధించాలో, కష్టపెట్టాలో ఆ విధంగా శ్రమకు గురి చేసింది సుగంధి నిర్దాక్షిణ్యంగా.

గౌరి తలితండ్రులను తలచుకుని ఏడ్చేడ్చి కుమిలిపోవడం మాత్రం చేయగలిగింది, వదిన పెట్టే బాధలకు.

గుట్టుగా ఇంట్లో వంటింటి పొయ్యిలా కదలక మెదలక గౌరి ఉండడమూ సుగంధికి గిట్టలేదు. అందుకే, సలహా యిచ్చింది, ఎవడినైనా ప్రేమించమని!!

గౌరి ఎవర్ని ప్రేమించగలదు? ఎలా ప్రేమించగలదు? ప్రేమించి పెళ్ళాడమంటుంది సుగంధి, ఖర్చులుండవన్న దురుద్దేశంతో.

అంతే కాదు, సుగంధి తన కోపాన్ని, ఆవేశాన్ని అణచుకోలేక ఎవడ్నో ఒకడ్ని లేపుకెళ్ళమని పురమాయిస్తుంది గౌరిని!

గౌరి లోలోపల కుమిలిపోయింది, తన దురదృష్టానికి వగచి. వదిన పెట్టే బాధలను, సూటి పోటి మాటలను భరించలేకపోయింది.

చివరకు, అన్నయ్య ఫ్రెండ్ అయిన ఫాల్గుణమూర్తిని ప్రేమించాలని నిశ్చయించుకుంది.

ప్రేమించాలని అనుకోగానే గౌరి గుండెలు వేగంగా కొట్టుకోసాగాయి. ఫాల్గుణమూర్తిని చూడ్డానికి సిగ్గుపడి పోయేది.

ఫాల్గుణమూర్తి రోజూ ఆఫీసుకు వెళ్ళేటప్పుడు, ఆఫీసు నుండి వచ్చేటప్పుడు గౌరి ఇంటిముందుగానే వెళ్తాడు.

గౌరి అతని రాకకోసం ఎదురుచూచేది అదిరే హృదయంతో.

ఫాల్గుణమూర్తిని తను ప్రేమించాలి. ఎలా ప్రేమించాలి? ప్రేమించాలంటే ఏంచేయాలి? గౌరికి అర్థం కాలేదు. ఆలోచించుకుంది.

చూపుల్లో కనబరచాలా?అయితే, అతగాడ్ని ఎలా చూస్తే తనని ప్రేమిస్తాడు?చాటుగా అద్దంముందు నిలబడి రిహార్సల్ చేసుకుంది. రిహార్సల్ మాదిరి ఫాల్గుణమూర్తిని చూడగానే చూడ్లేకపోయింది. అందుకు కారణం సిగ్గా? బిడియమా? లజ్జా? గౌరికి తెల్సిరాలేదు.

ఫాల్గుణమూర్తి రాకకోసం తపించిపోయేది. తీరా రాగానే జంకిపోయేది, చూడ్డానికి.

ఎలాగో ఫాల్గుణమూర్తిని చూడడం నేర్చుకుంది. ఫాల్గుణమూర్తి గౌరిని కన్నెత్తి చూడడం వరకే చేసేవాడు. అతని చూపుల్లో ఎటువంటి భావాలూ వుండేవి కావు.

ఒక రోజు అప్రయత్నంగా, "తరుణేశ్వర్ వున్నాడా?" అని అడుగుతూ ఇంట్లోకి వచ్చేశాడు ఫాల్గుణమూర్తి.

గౌరి గుండెలు ఝల్లుమన్నాయి. అవ్యక్తభయంతో అలమటించి పోయింది. ఫాల్గుణమూర్తితో మాట్లాడాలని, తను ప్రేమించడం చెప్పాలని అనుకుంది, హడావిడి పడ్తూ.

ఫాల్గుణమూర్తిని కూర్చోమంది, తడబడుతూ.

ఫాల్గుణమూర్తి కూర్చోగానే, ప్రక్కగా వెళ్ళి నిలబడి, "ఏమండి మిమ్మల్ని నేను మనసారా ప్రేమిస్తున్నాను" అని చెప్పేసింది. ఆ మాటలు అనడానికి ఆమె ఎన్ని అవస్థలు పడ్డదో ఆ పరమాత్మునికే ఎరుక!

ఆ మాటతో ఫాల్గుణమూర్తి అదిరిపోయాడు. అంతలోనే కోపగ్రస్తుడైనాడు.

"ఛీ...ఛీ! మీ ఇంట్లోకి వచ్చినంత మాత్రాన ప్రేమిస్తావా? నన్నేనా? నాలాటి యువకుల్ని కూడా ప్రేమించి ఉన్నావా? నిన్ను నాకిచ్చి కట్టబెట్టాలని మీ అన్నయ్య ప్రయత్నిస్తుంటే...ఏమో ననుకున్నాను. ఇపుడర్థమైంది," అని తలపంకిస్తూ చురచురలాడుతూ నిలబడ్డాడు, గౌరి స్వభావం మంచిదికాదని.

గౌరి స్థాణువై నిలబడిపోయింది. గౌరికి ప్రేమంటే ఏమిటో తెలియదు. తరుణేశ్వర్ తనకోసం వివాహానికి ఒప్పించు యువకునివద్ద అవమానం పొందగానే గౌరి ఆత్మాభిమానం దెబ్బతింది. తనకిక వివాహం కాదని తేలైపోయింది.

గౌరి ఫాల్గుణమూర్తికి ఏదేదో చెప్పి గొంతెత్తి అరవాలనుకుంది, ఆవేశంగా. కానీ అప్పటికే ఫాల్గుణమూర్తి వెళ్ళిపోయాడు అసహ్యంతో.

గౌరికి దుఃఖం, విరక్తి కలిగింది. అన్నయ్యకు తెలిస్తే ఏమంటాడన్న భయం పెనుభూతమై బాధించసాగింది. మనసులోనే కుమిలిపోయింది, తన దురదృష్టానికి!

ఆ రాత్రి అన్న వదినెలు పడుకోగానే - మెల్లగా లేచి బయలుదేరింది, బావిలో దూకి చావడానికి!

మనసులో గౌరిని భార్యగా తలచి కనిన కలలన్నీ కరిగిపోగానే ఫాల్గుణమూర్తి, వేదనకు గురైయ్యాడు.

భోంచేయలేకపోయాడు,ఆకలిలేక!నిద్రపోలేకపోయాడు. సినిమా కెళ్ళాడు, మనశ్శాంతికి.

సినిమా వదలగానే ఎక్కడో టీ తాగి, వస్తూవుండగా గౌరి చీకటిలో వెళ్ళడం కనబడింది అతడికి. విభ్రాంతుడై అనుసరించాడు.

గౌరి నూతి గోడమీదకు ఎక్కగానే, పరుగునవెళ్ళి పట్టుకుని కిందకు లాగేశాడు, ఫాల్గుణమూర్తి!

ఫాల్గుణమూర్తిని చూడగానే గౌరి అతని కాళ్ళమీద పడి భోరునఏడ్చేసింది, పసిపిల్లలా! ఫాల్గుణమూర్తి ఉక్కిరిబిక్కిరైపోయాడు, అయోమయంతో.

"ఏమండీ! నాకు నిజంగా ప్రేమించడం చేతకాదండి! మా వదిన చెప్పిందండి, ప్రేమించమని..." అంటూ గౌరి అమాయకంగా అంతా చెప్పి కుళ్ళికుళ్ళి ఏడ్చేసింది.

ఆమె అమాయకత్వానికి ఫాల్గుణమూర్తి ముగ్ధుడైపోయాడు.

ఇంటివద్ద విడిచిపెడ్తే మళ్ళీ అఘాయిత్యానికి పాల్పడుతుం

దేమోనని, ఫాల్గుణమూర్తి గౌరితోపాటు ఆమె ఇంటి కొచ్చాడు.

తరుణేశ్వర్ కి, సుగంధికి నిజంచెప్పేస్తూ _ తను వివాహం చేసుకుంటానని చెప్పాడు ఫాల్గుణమూర్తి, రాత్రి.

అందుకు సుగంధి అగ్గిగుగ్గైపోయింది. గౌరిని నానా మాటలతో ఆడిపోస్తూ, ఇంట్లోకి రావద్దని శాసించింది.

తరుణేశ్వర్ ఎంత చెప్పిచూచినా, సుగంధి వినలేదు. అరవడం ఎక్కువైంది. తిట్టడం ఎక్కువైంది.

సుగంధి రాకాసితనం ముందు తరుణేశ్వర్, ఫాల్గుణమూర్తులు తలొగ్గక తప్పలేదు.

“బాధపడకండి మీరు. ఇదోరకం వివాహం! నేను, గౌరి రిజిస్టర్ మారేజ్ చేసుకుంటాం” అంటూ ఫాల్గుణమూర్తి, గౌరిని వెంటతీసుకెళ్ళాడు తన రూముకి.

అన్నయ్య రానిదే తను వివాహం చేసుకోనని పట్టుపట్టడం మూలంగా _ గౌరితో ఫాల్గుణమూర్తి, తరుణేశ్వర్ ఇంటి కొచ్చాడు, తెల్లవారగానే_!

* * *

“మీరు చెప్పిన కథలో ప్రసాద్ పాత్ర లేదేమిటి” అడిగాడు యువరాజ్.

“లేదు గనక చెప్పలేదు. మా వదిన ఎంత గయ్యాళి దైనా అటువంటిదికాదు” చెప్పింది గౌరి, ఖచ్చితంగా— నమ్మకంతో.

“అయితే తరుణేశ్వర్ ఎందుకలా అంటున్నాడు?”

“ఏమో, నాకూ అర్థంకావడం లేదండి!”

“వింతగా ఉందమ్మాయ్! మీలో ఎవరైనా ప్రసాద్ ని చూశారా రాత్రి?”

"లేదండి" చెప్పారు ఫాల్గుణమూర్తి, గౌరి.

"ఆఁ...ధనార్జనరావుగారూ! మీరేం చేయబోతారు?" అడిగాడు యువరాజ్.

"ఏం చేయాలో మీరే చెప్పాలి. ఈ శవం ఇక్కడ చంపబడింది కాదు. ఎక్కడో చంపి శవాన్ని ఇక్కడపెట్టినట్టు ప్రత్యక్షంగా కనబడుతూంది. తరుణేశ్వర్ చంపలేదని సాక్ష్యాలు,ఎలిబీలు వున్నై. కానీ తనే హత్యచేసినట్టు తరుణేశ్వర్ ఒప్పుకుంటున్నాడు. విచిత్రంగావుంది. అయోమయంగా వుంది" అన్నాడు ధనార్జనరావు.

"తరుణేశ్వర్ హంతకుడు కాదని తెలుస్తూంది గనక— అసలైన హంతకుడ్ని బంధిస్తే ఈ కేసు పూర్తవుతుంది" చెప్పాడు యువరాజ్.

## 7

ప్రయివేటు డిటెక్టివ్ లని తెలుసుకోగానే జనమేజయం బిత్తరపోయి, "నావద్దకెందుకొచ్చారు?" అని అడిగాడు.

"రాత్రి ప్రసాద్ హత్యచేయబడ్డాడు" చెప్పాడు సూరి.

జనమేజయం స్థాణువై నిలబడిపోయాడు. "ప్రసాద్ హత్యచేయబడ్డాడా!ఇంపాజిబుల్...!!"అన్నాడు పెద్దగా.

"ఎందుకని ఇంపాజిబుల్ అంటున్నారు?" అడిగాడు యువరాజ్.

"ప్రసాద్ అంతటి సాధువు, అంతటి అణకువతనం, గల వ్యక్తికి మరొకరు వుండరని నా వుద్దేశం."

"కొన్నికొన్ని సందర్భాలలో సాధుతనం, అణకువతనం, పిటికితనం ప్రాణాల్ని తీసేస్తాయి, అందులో అతిశయోక్తి లేదు. మీరు రాత్రి అజంతాకు సినిమా కెళ్లారు గదా! మీరిద్దరేనా? మీతో మరెవరైనా వచ్చారా?" అడిగాడు యువరాజ్.

"మేం ఇద్దరమే వెళ్ళాం. మాతో ఎవరూ రాలేదు"

"పిక్చర్ వదిలిపెట్టగానే మీ రిద్దరూ ఎక్కడ విడివడి పోయారు, ఇళ్ళకు వెళ్ళడానికి!"

"బీచ్ లెన్వద్!"

"మిస్టర్ జనమేజయం! ప్రసాద్ శవానికి ఇసుక రేణువులు అంటి వున్నాయి. అంటే బీచ్ లైన్ వద్దనే హత్య సంభవించి వుండాలి. కనక మీరు నిజం చెప్పడం చాలా చాలా మంచిది" హెచ్చరించాడు సూరి, అర్థోక్తిగా!

"ప్రస్తుత పరిస్థితుల్లో నిజాన్ని చెప్పడం చాలా చాలా అవసరమనీ నాకు తెల్సండి. ప్రసాద్ నాకు ప్రాణస్నేహితుడు. అటువంటి మిత్రుడ్ని హత్యచేసిన హంతకుడ్ని బంధించి తగిన శిక్షను విధించేంతవరకు, నాకూ నిద్రపట్టదు" చెప్పాడు జనమేజయం.

"అయితే, ప్రసాద్‌ని గూర్చి మీకు తెల్సిన వ్యక్తిగత విషయాలు చెప్పండి. స్నేహితులలో గిట్టనివా రెవరైనా వుంటే చెప్పండి. మీ కెవరిమీదైనా అనుమానం ఉంటే చెప్పండి" అడిగాడు యువరాజ్.

చెప్పాడు జనమేజయం ప్రసాద్‌ని గురించి, అతడి స్నేహితుల గురించి, వివరంగానూ, విపులంగానూ.

అనుమానించడానికి ఒక్క వ్యక్తీ లభించలేదు. యువరాజుకు ఆశ్చర్యమేసింది. స్నేహితుల జాబితాను ఎన్ని తడవలు వడపోత పోసినా అనుమానితులు ఒక్కరూ లభ్యంకాలేదు.

"మిస్టర్ జనమేజయం! మీరు సినిమానుండి వచ్చిన తరువాత ఎక్కడ విడివడ్డారో, ఆ స్పాట్ని చూపగలరా?" అడిగాడు యువరాజ్.

"భేషుగ్గా!"

బయలుదేరారు అందరూ.

# 8

"నేను ప్రసాద్ సినిమా విడిచిపెట్టగానే ఇంతవరకు మాట్లాడుకుంటూ వచ్చాం! ఇక్కడనుండి మా ఇల్లు దగ్గరే! ప్రసాద్ ఇక్కడనుండి తూర్పుగా ఆ రోడ్డు మీదకు వెళ్ళాడు, దగ్గర్లో వున్న టాక్సీ స్టాండుకు! ఆటోనైనా, రిక్షానైనా మాట్లాడుకుని ఇంటికెళ్ళుతానని చెప్పాడు" అన్నాడు జనమేజయం.

జనమేజయం చూపిన ప్రదేశంలో నిలబడి యువరాజ్ చుట్టుప్రక్కలగల పరిసరాలను పరిశీలించాడు.

అంతా ఇసుక ప్రదేశం, బీచ్ కావడం మూలంగా! ఇసుక ప్రదేశంలో దూరదూరంగా పరువానికి వచ్చిన పడతుల్లా అందమైన బిల్డింగులు అవుపిస్తున్నాయి.

బాగా బలిసిన శ్రీమంతులు సముద్రపుటొడ్డున, ఇసుకలో వ్యయప్రయాసలకోర్చి కట్టుకొన్న విశ్రాంతి భవనాలవి!! చూడచక్కగా వున్నాయి, ప్రతి ఇల్లూ.

సముద్రపుగాలికి ప్రతి ఇల్లు వికసించిన పుష్పంలా సౌరభాన్ని వెదజల్లుతూంది. ఇసుకలో సరైన రోడ్డుండదు. విసరివేయబడ్డ రకరకాల పువ్వుల్లాగున్నై—ఆ ఇళ్ళన్నీ.

"ఇక్కడనుండి ఇటువైపుగా ప్రసాద్ వెళ్ళాడా?" అని జనమేజయాన్ని అడిగాడు యువరాజ్.

"అవునండి" అంటూ దారితీశాడు జనమేజయం.

యువరాజ్ లో రకరకాల ఆలోచనలు మెదులుతున్నాయి. ప్రసాద్ ని హత్యచేయగల వ్యక్తిగతద్వేషం ఎవరికీ వున్నట్టనిపించలేదు. తను విచారించిన విషయాలలో ప్రసాద్ శవం తరుణేశ్వర్ ఇంట్లో పెట్టడానికి గల కారణం ఏమిటో ఊహకందడంలేదు.

ప్రసాద్‌ని బయట చంపి ఇంట్లో పెట్టి ఉన్నారు గనక, హత్యాప్రదేశాన్ని కనుగొంటే ఏవైనా ఆధారాలు లభిస్తా యేమోనని యువరాజ్ వూహ.

ఇసుకను చూస్తూ వెళ్లారు. ఒకచోట మరకలు కనబడ్లేదు గానీ, ఇసుకను చెరిపినట్లు కనబడింది. చెరిపిన ఇసుక రేణువులకు నెత్తురు అంటివున్న విషయం తెల్సుకోడానికి ఎంతో సేపు పట్టలేదు యువరాజ్‌కి.

రోడ్డు చేరడానికి ఇంకా పది గజాలున్నాయి. చేరక ముందే అక్కడ ప్రసాద్ హత్య గావించబడ్డాడని అనుకున్నాడు యువరాజ్.

జనమేజయం, సూరి ఆశ్చర్యపోయి ఆ ఇసుకను చూశారు. స్పష్టంగా కనబడుతోంది, రక్తపు మరకల్ని చెరిపినట్లు.

"ఇక్కడే హత్య జరిగింది సార్!" అన్నాడు సూరి.

"అవును" అంటూ యువరాజ్ ఆ ప్రదేశాన్ని పరిశీలించాడు.

యువరాజ్ కాసేపు ఆలోచించుకున్నాడు. ఒక నిర్ణయానికి వచ్చాడు. హత్యాప్రదేశంలో నిలబడి నాల్గువైపులకు దృష్టిని సారించాడు. తన దృష్టికి వచ్చిన కొన్ని బంగళాలను సెలెక్ట్ చేశాడు.

ఆ ప్రదేశాన్ని ఏఏ బంగళాలనుండి చూడ్డానికి అవకాశం వుందో ఆ బంగళాలన్నిటి గుర్తులూ చెప్పాడు సూరికి.

కుడివైపు ఇళ్ళకు సూరిని పంపాడు, వాకబు చేయమని. ఎడమవైపుకు యువరాజ్ బయలుదేరాడు. బయలుదేరుతూ నెత్తురు అయివున్న ఇసుకను కొంత అందుకుని, జనమేజయానికి అందిస్తూ, "ఈ ఇసుకను క్రైంబ్రాంచ్ ఇన్స్పెక్టర్ ధనార్జనరావుకు అందించు. ఈ రక్తం ప్రసాద్ రక్తానికి సరిపోతుందేమో చూడమను" అని చెప్పి పంపాడు.

# 9

రాత్రి ఎనిమిది అయింది, ప్రొద్దున్న పదకొండు గంటలు ప్రాంతంలో ప్రారంభించిన భోగట్టా సేకరణ ముగియడానికి.

యువరాజ్ సూరీలు కల్సుకుని ఒకరు సేకరించిన విషయాలను మరొకరికి చెప్పుకున్నారు.

విశ్రాంతి గైకొను వ్యక్తుల్లో రకరకాలవారు తారసపడ్డారు. కానీ ప్రసాద్ హత్యకు సంబంధించినవారు ఒక్కరూ తారసపడ్డేదు. హత్య జరిగింది చీకటిలో. ఎవరూ చూడ్లేదు. ఎవరూ ఆవైపుకు రాలేదు. ప్రసాద్ అనే వ్యక్తిని గురించి ఎవరికీ తెలియదు, లేశమైనా!

"సార్! మీరు నాకు చూపిన ఇళ్ళన్నిటినీ చూశాను, ఒక్క ఇల్లు తప్ప!" అన్నాడు సూరి.

"ఏం?"

"ఆ ఇల్లు తాళం పెట్టివుంది."

"ఇల్లెవరిది?"

"ఎవరిదైనది ఎవరికీ తెలియదు" చెప్పాడు సూరి.

"ఈ ప్రాంతపు ఇళ్ళల్లో అన్నిటిలో స్వంతదారులే వుండడంలేదు. అద్దెకు వుంటున్నవారూ వున్నారు,కొందరు" చెప్పాడు యువరాజ్.

"నేను చూచిన ఇంటిని ఎవరికీ అద్దెకు ఇవ్వడంలేదు. ఎవరూ వుండటం లేదట, చాలాకాలంనుంచి."

"ఎందుకు?"

"ఏమో?"

"కాపురం లేని ఇంటికి, మన యీ కేసుకి సంబంధం వుంటుందా?"

"ఇక్కడ వుండే ఇళ్ళల్లో అందరూ ఆగర్భశ్రీమంతులూ

సముద్రపుగాలికీ, సముద్ర దృశ్యాల్ని చూడడానికి మోజు పడి ఇళ్ళు కట్టించుకున్నారు. వాళ్ళు లేని సమయాలలో కొందరికి అద్దెకిస్తున్నారు, ప్రతి ఇంటినీ!! కానీ నేను చూచిన ఆ ఒక్క ఇంటిని ఇవ్వడంలేదు అద్దెకు."

"ఏ ఇల్లు?"

చూపుడు వేలితో చూపాడు సూరి, ఎత్తైన ప్రదేశంలో వున్న ఇంటిని.

సముద్రపుటలలు ఘోషించడం ఎక్కువైంది. గాలి దురుసుగా వస్తూంది. బంగళా లన్నిటినుండి రంగురంగు దీపాలు తమ రమ్యతను చాటుతున్నాయి. నక్షత్రాలు మెరిసే ఆకాశం, చీకటిని పులుముకున్న సముద్రం, అంధకారం ఆక్రమించుకున్న ప్రకృతి, చీకటిలోనూ తమకున్న గుడ్డికాంతితో తాము ఉన్నట్టు చాటుకునే ఇసుక తిన్నెలు ఏవో అనుభూతిని, మనసుకి ఆహ్లాదతను కల్గిస్తున్నాయి.

సూరి చూపిన ఇల్లు చీకటిలోనూ, దీపాల కాంతులమధ్య కొట్టవచ్చినట్టు కనబడింది, ఆ ఇంటికి దీపం లేనప్పటికీ.

డిటెక్టివ్ లిద్దరూ ఆ ఇంటిని అలా చూచే సమయంలో ఒక ఆకారం నడిచివెళ్ళడం కనబడింది. ఇద్దరూ ఆశ్చర్యపోయారు, అంతవరకు జనసంచారం లేనిచోట ఒక వ్యక్తి నడిచివెళ్ళడం చూడగానే!

చీకటిలో నడుస్తున్నప్పటికి ఇళ్ళల్లో వెలిగే దీపాలు ప్రసరించు మసకకాంతిలో__ ఆ నడిచేది ఒక యువతని ఇట్టే తెల్సిపోయింది. ఆమె వెళ్ళడం దీపంలేని ఇంటివైపుకి అని తెలియగానే డిటెక్టివ్ లిద్దరూ గబగబ నడిచారు ఆతృతగా.

తాము కనబడకుండా చీకటి ప్రదేశంలో నక్కారు యువరాజ్ సూరీలు!

వెళ్ళిన యువతి సరాసరి ఆ ఇంటిముందు కెళ్ళింది. తలుపుల వద్ద ఆగింది, తాళం తీయడానికి కాబోలు! మరుక్షణం ఇంట్లో దీపం వెల్గడం కిటికీలగుండా కనబడింది. మళ్ళీ వెంటనే వెల్గిన దీపం ఆరిపోయింది!!

ఆ ఇల్లు యథాప్రకారం తిరిగి చీకటిలో పడింది.

ఇంట్లోపల కెళ్ళిన యువతి ఎటు వెళ్ళింది? మేడమీదికి వచ్చివుంటే, మీద లైట్ వెలగాలికదా? లైటు వెలగలేదు. ఆ యువతి చీకటి యింట్లో ఏం చేస్తూవుంది?

యువరాజ్ సూరీలు దిగ్భ్రమచెంది తిలకిస్తున్నారు.

కాసేపటికి లైట్ వెల్గింది, యింట్లో! వెలిగిన లైట్ ఆరి పోయింది మళ్ళీ!

ఇపుడు ఆ యువతి తలుపులముందు నిలబడివుంది. అంటే తాళం వేస్తూ వుందా? వస్తూంది, వెళ్ళిన దారినే.

"సూరీ, బి కేర్‌ఫుల్..." అంటూ యువరాజ్ సూరికి కొన్ని సూచనలు ఇచ్చాడు.

"ఎస్సార్!" అంటూ బయలుదేరాడు, ఆ యువతి వెనకాలే నీడలా—సూరి!!

# 10

యువరాజ్ తచ్చాడుతూ, మెల్లగా వెళ్ళి ఆ ఇంటి ముందు నిలబడ్డాడు. ఏదో క్రూరమృగం నోటిముందు నిలబ డట్టు ఫీల్ అయ్యాడు.

సముద్రపు ఘోష, చీకటి, ఒంటరితనం, నిశీధిలో విరబోసుకున్న దెయ్యంలా వున్న ఆ ఇంటిముందు నిలబడగా యువరాజ్‌కు రోమాలు నిక్కపొడుచుకుంటున్నాయి.

తలుపులకు వ్రేళ్లాడు తాళం గ్రుడ్లగూబలా కనబడింది!

ఆ ఇంట్లోకి ఒక యువతి నిర్భయంగా వెళ్ళిరాగా, తను

భయపడడం అసహజం అనుకుంటూ, తాళం తెరవడానికి ప్రారంభించాడు.

సులభంగానే తాళం తెలుచుకు నేసింది. మెల్లగా నెట్టాడు, తలుపుల్ని. అవి కిచకిచ మన్నాయి. వాటి ధ్వని సముద్రపు ఘోషలో కల్సిపోయాయి.

లోపల చీకటిగా వుంది. స్విచ్ ఎక్కడుంది? ఆలోచిస్తూ గోడలకు సారించాడు తన దృష్టిని యువరాజ్.

తెల్లటి గోడలో స్విచ్ బోర్డ్ కనబడింది స్పష్టంగా.

తెఱచిన తలుపుల్ని మూసుకుని, మెల్లగా స్విచ్ బోర్డ్ వైపుకు నడిచాడు.

స్విచ్ బోర్డుకు రెండే రెండు స్విచ్ లున్నాయి. ఒక స్విచ్ని నొక్కాడు. కళ్ళు ఝిగేలు మన్నాయి, లైటు కాంతిలో. విశాలంగా ఉన్న హాలు. హాలుమధ్య ఒకే ఒక్క టేబులు. టేబులు చుట్టూ కుర్చీలు. ఆ హాలంతా శుభ్రంగా ఉంది. ఓ మూలగా మేడమీదికి మెట్లున్నాయి.

ఆ యింట్లోకి వచ్చిన యువతి మేడపైకి వెళ్ళలేదు. వెళ్ళి వుంటే మేడలో దీపం వెలిగి వుండాలి. అయితే ఎటు వెళ్ళి ఉంటుంది? దీపాన్ని ఆర్పుకుని ఏం చేసి వుంటుంది!? ఆలోచనలలో పడ్డాడు యువరాజ్.

స్విచ్ బోర్డులో ఉన్న మరో స్విచ్ని నొక్కాడు. ఎక్కడో కరకరమని ధ్వని వినరాసాగింది, నిముషంపాటు! యువరాజ్ బిత్తరపోయి ధ్వని వచ్చిన వైపు చూశాడు.

గుండెలు దడదడలాడిపోయాయి.

గోడలో ద్వారం లాటిది ఏర్పడింది. ద్వారం లోపల లైట్లు వెలుతున్నాయి ప్రకాశవంతంగా. లైట్ల కాంతిలో క్రిందికెళ్లే మెట్లు కనబడ్డాయి. అప్పా డర్థమైంది, వచ్చిన యువతి లైటు ఆర్పి క్రిందికి వెళ్ళి ఉంటుందని!

లైటు వెల్గని ఇంట్లో లైటు వెల్గితే ఎవరికైనా అనుమానం కల్గవచ్చు. తటాలున లైటు తీసేశాడు, హాలులోని!

హాలుని చీకటి అలుముకున్నా - గోడలో ఏర్పడ్డ సొరంగంలో దీపాలు వెల్గుతున్నాయి. ఆ దీపాలు వెలగడానికి, ద్వారం ఏర్పడడానికి ఒకే స్విచ్ పని చేస్తుందనుకున్నాడు యువరాజ్.

గోడలో ఏర్పడ్డ సొరంగం ముందు నిలబడ్డాడు.

మెట్లు చాలా లోతువరకు దిగి ఉన్నాయి. అంటే భూగర్భంలో ఏమిటో వుంది. తప్పక తెలుసుకు తీరాలన్న కాంక్షతో ద్వారంగుండా అడుగుముందుకు వేశాడు, యువరాజ్ భయపడే మనసుని అదుపుకు తెచ్చుకుంటూ!

సుమారు ఏడడుగుల ఎత్తుంది, ఆ సొరంగం. మెట్లు అన్నీ సిమెంటుతో వున్నాయి. శ్రమ లేకుండా దిగవచ్చు.

జేబులోని పిస్తోలును తడుముకుంటూ యువరాజ్ దిగడం ప్రారంభించాడు, మెట్లగుండా, దీపాల కాంతిలో.

చివరి మెట్టునుండి అడుగు క్రింద పెట్టూ, అక్కడున్న పెద్ద గొడౌన్ని చూచి సంభ్రమాశ్చర్యాలకు లోనయ్యాడు. అంత పెద్ద గొడౌన్ని భూగర్భంలో నిర్మించాలంటే మాటలు కాదు. సినిమా హాలు కంటె పెద్దదిగా వుంది ఆ హాలు!!

సంభ్రీభూతుడై ఆ హాలుని తిలకించాడు. గుండెలు ధమధమలాడిపోతున్నాయి. ఎవరూ లేరక్కడ. డైనింగ్ టేబుల్ లా ఒక పెద్ద టేబుల్ వుంది. ఆ టేబుల్ చుట్టూ సుమారు పాతిక కుర్చీలున్నై. అక్కడక్కడ అలమారులున్నాయి. మరెటువంటి వస్తువులూ లేవక్కడ, చెప్పుకోతగ్గవి.

అంత పెద్ద హాలుని భూగర్భంలో ఎందుకు నిర్మించారు? ఎవరు నిర్మించారు? ఆ గొడౌన్ మూలంగా ఉపయోగం ఏమిటి? ఆలోచిస్తూ యువరాజ్ చుట్టూ కలయజూచు సమ

యంలో ప్రక్కనే స్విచ్ బోర్డ్ కనబడింది. ఒక స్విచ్‌ని నొక్కాడు.

వెంటనే సొరంగంలో వెలిగే దీపాలన్నీ ఆరిపోయాయి.

హాలులోని దీపాలూ ఆరిపోయాయి. భయంకరమైన చీకటి తాండవమాడింది. ఆ చీకటిని చీల్చుతున్నానన్నట్టు కరకర చప్పుడు వినబడింది. చప్పుడ్ని బట్టి - గోడలో ద్వారం మూసుకుంటోందని తలపోశాడు యువరాజ్.

మరో స్విచ్‌ని నొక్కాడు. హాలులో లైట్లు వెల్గాయి.

యువరాజు చెవులకు సముద్రపు ఘోష వింతగా వినబడు తోంది, ఎక్కడో నీళ్ళ చప్పుడుకూడా!

ఇంకా ముందుకెళ్ళి హాలుని చూశాడు. హాలుకు ఒకవైపు మెట్లున్నాయి పొడుగ్గా. ఆ మెట్లు క్రిందకు దిగుతున్నాయి. క్రిందకుదిగే మెట్లవద్దకు రాగానే, మెట్లను తన్నుకుని ఉండే నీరు కనబడింది!

యువరాజ్ ఆశ్చర్యానికి అంతులేకుండా పోయింది.

మెట్లను అనుకుని ఉన్న నీరు ఏదో సొరంగంలో వున్న ట్లనిపించింది. అవును, సొరంగమే అది!

నీళ్ళల్లోకి మెట్లు ఎందుకున్నాయి? నీటిగుండా మార్గం ఎమైనా ఉందా? నీటిలో పడి సొరంగంగూడా వెళ్ళితే దారి ఎక్కడికెళ్తుంది? తీవ్రంగా ఆలోచిస్తున్నాడు యువరాజ్.

ఈ భూగర్భంలోకి వచ్చిన యువతి ఏం చేసింది? ఎందు కొచ్చింది? ఆలోచిస్తూ యువరాజ్ వెదకడం ప్రారంభిం చాడు.

అక్కడున్న టేబుల్ పైన ఒక కాగితం ఉండడం చూశాడు. గబగబ అటు వెళ్ళబోయాడు. అంతే!—

గుండెల్ని అదరగొట్టే ధ్వని. పిరికివాళ్ళను చంపేసే

ధ్వని హోరెత్తిపోవడం ప్రారంభించింది. ఆ ధ్వనితో హాలంతా దద్దరిల్లిపోతోంది. బ్యాయ్ మంటూ భూగర్భాన్ని కదిల్చివేస్తోంది.

అంతటి యువరాజ్ ముందుకు అడుగు వేయలేకపోయాడు. స్థిరంగా నిలబడ్లేక, గుండెల్ని నిబ్బరించుకోలేకపోయాడు.

విచిత్రంగా నిర్మితమైన భూగర్భం! భూగర్భం గుండా సొరంగం! సొరంగం నిండా నీరు.

వినబడే ధ్వనికి ప్రతిధ్వని కలవగా యువరాజ్ తారెత్తిపోయాడు. వినబడే ధ్వని ఏదో మీద పడేటట్టుగానే వుంది. ఏం చేయాలో పాలుపోలేదు. ఎటు వెళ్ళాలో తెలియడం లేదు.

టేబుల్ పైన ఉన్న కాగితం అందుకోవడానికి ముందుకు అడుగు వేయలేకపోయాడు. బ్యాయ్‌మనే ధ్వని మిక్కుటం కాగా!

గబగబ స్విచ్ బోర్డు వైపు పరుగెత్తాడు యువరాజ్.

స్విచ్‌ని తీసేశాడు. గాంధాంధకారం అలుముకుంది. నీటి వైపు పరుగెత్తాడు. నీటిలోకి ఉన్న మెట్లగుండా దిగేశాడు- నీటిలో సొరంగంలోకి.

ధ్వని దగ్గరవుతోంది, హోరెత్తుతూ.

యువరాజ్ గుప్పెటలో ప్రాణం పెట్టుకుని, గొంతుకు ఆనే నీటిలో కూర్చుని చూస్తున్నాడు, ఆ శబ్దం వచ్చే వైపు.

## 11

సూరి ఆ యువతిని అనుసరించ సాగాడు. ఆమె ముఖాన్ని చూడ్డానికి అవకాశం లభించడం లేదు. కానీ, ఆమె వెళ్తూన్నప్పుడు కొన్ని చోట్ల ఇళ్ళనుండి పడే వెల్తురులో ఆ యువతి వెనుక భాగాన్ని చూడగలిగాడు.

మాడరేట్ హేర్ డ్రస్! ముప్పాతిక వంతు వీపు భాగాన్ని కనపింపజేసే జాకెట్. నవనాగరికతను చాటే పిరుదుల మీదకు జారిపోయిన చీర కట్టు! నడకలో వయ్యారం. హై హీల్స్ షూస్. ఎడమ చేతికి వాచ్. గుండ్రటి చేతులు. మొత్తానికి అందగత్తెలాగానే ఉండొచ్చనుకున్నాడు సూరి.

చాలా జాగ్రత్తగా ఫాలో అవుతున్నాడు, సూరి ఆలోచిస్తూ.

బీచ్ కు దూరంగా ఆగి వున్న కారు వైపుకు ఆమె నడవడం చూడగానే సూరికి అయోమయం అయిపోయింది. తన కారు జనమేజయం ఇంటివద్ద వుంది. తన కారువద్ద కెళ్ళి, వచ్చేలోపు ఆమె వెళ్ళిపోవచ్చు. ఏం చేయాలి? సూరి మనసు పరిపరివిధాల పోతూంది.

ఆమె కారు వద్దకు చేరుకుంది.

దరిదాపుల్లో టాక్సీ కనబడ్లేదు. అక్కడ ఆ సమయంలో టాక్సీలుండవు, జనసంచారంలేని కారణంగా.

సూరి చేసేదిలేక పరుగెత్తాడు తన కారు వద్దకు.
ఆమె కారుని పదేపదే మననం చేసుకున్నాడు.

రొప్పుతూ తన కారుని చేరుకుని, బయలుదేరాడు సూరి వేగంగా.

ఆమె కారు ఏవైపుకు మళ్ళిఉంటుందో ఊహించుకుంటూ ఆ వీధి ఎగుదలకు తన కారుని పోనిచ్చాడు సూరి. కారుని స్లో చేశాడు. రియర్ వ్యూ అద్దంలో చూశాడు. చుక్కల్లా రెండు దీపాలు కనబడ్డాయి. గిరుక్కున తల తిప్పిచూశాడు.
ఆ యువతి కారు వస్తోంది. సూరి కారు దాటుకుని వెళ్ళి పోతోంది, స్పీడుగా_అప్పటికే!
సూరి ఏక్సిలేటర్ని అదిమాడు. ఆ యువతి కారుని తన

దృష్టినుండి తప్పనివ్వలేదు. ఆమె కారు కొన్నిచోట్ల ఆగింది. ఆగినపుడల్లా ఆ యువతి కారు నుండి దిగి ఆయా ఇళ్లల్లో కెళ్ళి మూడు నిముషాల తరవాత వచ్చి బయలుదేరుతూంది!

చివరకు ఆమె కారు లేడీస్ క్లబ్ ఆవరణలోకి వెళ్ళి ఆగింది. ఆవరణలో రకరకాల కారులు ఆగివున్నాయి.

సూరి తటపటాయించాడు, తన కారుని ఆ ఆవరణలోకి తీసుకెళ్ళడానికి. ఎందుకంటే అది ఆడవాళ్ళ క్లబ్! మగవాళ్ళకు ప్రవేశం వుందో, లేదో?

ఆలోచించుకుంటూ కారునుండి దిగాడు సూరి.

మెల్లగా క్లబ్ ముఖద్వారం వద్ద కెళ్ళి లోనికి చూశాడు. ఆశ్చర్యానికి అంతులేకుండా పోయింది.

ఒక్కొక్క టేబుల్ చుట్టూ నల్గురైదుగురుగా యువతీ మణులు కుర్చీలలో కూర్చుని వున్నారు.

ప్రతి ఒక్కరి చేతుల్లో పేకముక్కలు అలంకరించుకుని వున్నై. కొందరి స్త్రీల వ్రేళ్ళ మధ్య సిగరెట్లు కాలుతున్నాయి, పొగను వదుల్తూ. కొన్ని బల్లల మీద ఖాళీ సీసాలు, ఖాళీ గ్లాసులు వుండగా మరికొన్ని బల్లల మీద నింపిన గ్లాసులు, నిండుగా వున్న బ్రాందీ బాటిల్స్ దర్శనమిస్తున్నాయి.

అక్కడున్న స్త్రీలను పరీక్షగా చూశాడు సూరి. ప్రతి ఒక్కరూ తమ అంతస్థుని, హోదాని, స్టేటస్‌ని, చూపడానికి ఎంతో శ్రమపడి అలంకరించుకుని వున్నారు, ఆభరణాలతో-సౌందర్యపోషకపదార్థాలతో. సువాసనలు, బ్రాందీ వాసనలు, సిగరెట్ పొగ వాసనలు అన్నీ మిళితం కాగా క్లబ్ లోపలినుండి వింతవాసన ముక్కుపుటాలను తాకుతూంది.

అక్కడున్న స్త్రీలను తిలకిస్తూంటే వారివారి భర్తలు ఎంతటి హోదాపరులోయిట్టే ద్యోతకమవుతోంది. ప్రతి స్త్రీ

తమతమ హంగులను, ఆర్భాటాలను, ఆడంబరాలను చూప డానికి ఎక్కువ శ్రద్ధ తీసుకని ఉంది. రథులు, అతి రథులు, మహారథులు కనబడుతున్నారు ప్రత్యక్షంగా, తమని తాము అతిగొప్పగా చూపుకోడానికి!

ఎవరు వాళ్ళంతా? ఈ కాలంలో చాలామంది కలిగిన కాంతలు తాగుడు, జూదం, సిగరెట్ లకు అలవాటు పడి వున్నారని సూరికి తెల్సు. తను అనుసరించిన యువతి ఎక్కడ? ఏ వైపు కూర్చుని ఉంటుంది? ఆమెతో మాట్లాడ్డం ఎలా? ఆలోచిస్తూ నిలబడ్డ సూరిని క్లబ్ లోని కొందరు స్త్రీలు ఎగాదిగా చూశారు, రకరకాల ఫోజులతో, ముఖకవళికలతో.

ఇంతలో, "ఎవరు కావాలి?" అంటూ ఇద్దరు యువతులు వచ్చి సూరికి చెరొక వైపూ నిలబడ్డారు.

"నాకు ఆవిడ కావాలి!" అంటూ సూరి తన కుడిచేతిని ముందుకు చాపి చూపుడు వేలితో చూపాడు.

తనని తదేకంగా చూడడం గమనించిన ఆ యువతి చివాలున లేచి వచ్చింది, సూరి వద్దకు.

"మీరు, మీరూ..." అన్నాడు సూరి తడబడుతూ, పెదాలను తడి చేసుకుంటూ.

"నా పేరు వింజామర! మీ రెవరు?"

"మీతో కొద్దిగా పనుంది. కాస్త బయటికి వస్తారా?"

వింజామర సూరి వెనుకాలే క్లబ్ బయటికి వచ్చింది, క్వశ్చన్ మార్కు ముఖంలో.

వింజామరను చూస్తూ, సూరి ఏదో చెప్పబోయాడు.

అదే సమయానికి అదిరిపోయాడు, భుజాల మీద పడ్డ ఇనుపగుండ్ల లాటి తాకిడికి. సూరి తలను అటు ఇటు తిప్పి చూశాడు ఎవరా అని!

ఇద్దరు వస్తాదుల్లాటి వ్యక్తులు కండలు తిరిగిన శరీరాలతో దర్శనమిచ్చారు. అడవి మృగాల్లాగున్నారు. "ఎవరు మీరు?" ఆశ్చర్యపోతూ అడిగాడు నూరి, తనకు ఇరువైపులా నిలబడ్డ వ్యక్తుల్ని చూచి.

"నువ్వు, వింజామరను అనుసరిస్తూ వచ్చిన వాడివని తెల్సు. కున్న వింజామర బాడీగార్డ్సమ్!" చెప్పాడొకడు.

"బాడీగార్డ్సా?!!" విచిత్రపోయాడు నూరి.

"అవును. నీ వెందుకు బీచ్ వద్దనుండి వింజామరను వెంటాడుతూ వచ్చావు? ఎవరు నువ్వు?" అడిగాడు ఇంకొకడు.

నూరి ఆలోచనలో పడ్డాడు. నిజం చెప్పడమా? అబద్ధం చెప్పడమా? వీరి మూలంగా తనకేమైనా హంతకుడ్ని గురించిన వివరాలు తెలుస్తాయా?

# 12

భూగర్భంలో గల సొరంగంలో ఉండే నీటిలో యువరాజ్, చిట్టచీకటిలో తలవరకు మునిగి దాగివున్నాడు.

చలిగా ఉంది. చలికంటె భీకరంగా సైరన్ మోతలాటి మోత హోరెత్తిపోతోంది. గుండెల వేగం క్షణక్షణానికి పెరిగిపోతోంది భయంతో.

హఠాత్తుగా మోత ఆగిపోయింది. ఆ మోత ఆగుతున్నప్పుడు, చెవులు రిక్కించాడు యువరాజ్, ఏ వైపునుండి వస్తూందో, మోతకుగల కారణం ఏమిటో తెల్సుకోడానికి!

ఆ మోత సొరంగంలో గల నీటి పైభాగాన్నుండి వస్తూందని గ్రహించాడు. ఎందుకు ఆగిపోయింది? గుడ్లప్పగించి చీకటిలోకి సొరంగంవైపు చూస్తున్నాడు యువరాజ్.

సొరంగంలో గల నీటి పైభాగాన్నుండి గలగల చప్పుడు వినరాసాగింది. యువరాజ్ గుండెలు ధమధమలాడిపోతు

న్నాయి. సారంగంలో గల నీటినుండి వచ్చే శబ్దం ఏమిటి? ఎందుకు?

గలగల చప్పుడు దగ్గరవుతోంది. వెంటనే నీటిలో కాంతులు లేస్తున్నాయి.

చిట్ట చీకటిలో, లేచే కాంతులలో సారంగం స్పష్టంగా కనబడసాగింది. యువరాజ్ కు గగుర్పాటు కల్గుతోంది. ఒళ్ళంతా జలదరించిపోతోంది.

మనసుని అదుపుకు తెచ్చుకుని ఆలోచించుకోగా, మోత మోటర్ బోట్ చేసేదని బోధపడింది.

అంటే, మోటార్ బోటు సారంగంలోగల నీటి పైభాగాన్నుండి వస్తుందన్నమాట, గొడౌన్ కి! ఎక్కడనుండి? సముద్రంలో నుండా? అచ్చెరువు చెందిపోయాడు యువరాజ్.

సారంగం మానవులచే నిర్మితమైనదిగా కనిపించలేదు. సహజసిద్ధంగా ఏర్పడి వుండాలి.

కొంత సేపటికి ఇంజన్ ఆగిన బోటు చుక్కాని సాయంతో రావడం కంటబడింది. చుక్కాని ఎందుకు ఉపయోగిస్తున్నారు?

సారంగంలో మలుపులు వుండొచ్చు. మలుపుల్లో బోటుని మళ్ళించ అలవిగాక చుక్కాని సాయంతో నడుపుతున్నారు కాబోలు.

యువరాజ్ మెట్లమీద ఉన్నాడు మునిగి! బోటువస్తే తను తప్పక కనబడతాడు, లైట్ల కాంతిలో! యువరాజ్ గబగబ మెట్లనుండి జారుకుని ఈదుకుంటూ వెళ్ళి సారంగం గోడకు ఓ మూల ఆనుకుని చాటుగా నిలబడ్డాడు నీటిలో.

ఒక మోటారుబోటు సారంగంగుండా వచ్చి చేరింది, మెట్లకు దగ్గరగా. అందులో ఎందరున్నారో తెలియలేదు.

బోటులో వున్న వ్యక్తులు వుపయోగించే టార్చిలైట్ కాంతి తనమీద పడే పక్షంలో మునిగిపోడానికి యువరాజ్ తయారుగా వున్నాడు.

యువరాజ్ భయంతో వణికిపోతున్నాడు. ఆ బోటులో వుండే వ్యక్తులు అతిదుర్మార్గులై వుంటారు. తనని పసిగట్టిన మరుక్షణం నిర్దాక్షిణ్యంగా చంపేస్తారు, తమ రహస్య స్థావరం తెల్సిపోకూడదని.

ప్రసాద్ హంతకుని అన్వేషణలో అటువంటి పరిస్థితులు, సంఘటనలు ఎదురౌతాయని యువరాజ్ వూహించనైనా లేదు. కానీ కల్గిన క్లిష్టపరిస్థితుల నుండి బయటపడడానికి నేర్పు వహించాలి. వాళ్ళ గూడుపుఠాణీని మట్టుపెట్టాలి!

బోటునుండి బిలబిలమంటూ కొందరు వ్యక్తులు దిగడం, టార్చ్ వెలుగులో స్విచ్ బోర్డు వర కెళ్ళడం, గోడౌన్‌లో లైట్లు వెల్గడం జరిగింది!

బోటునుండి దిగిన వ్యక్తుల్ని పరికించి చూశాడు యువరాజ్.

దేశీయులు, విదేశీయులు ఉన్నారు వారిలో. అందరూ బలిష్ఠులు, యువకులు. ప్రతి ఒక్కరిలోనూ ఒక విధమైన కరడుతనం కనబడుతోంది. చెంపలకు చేర దేసి జులపాలు. కొందరికి భుజాలను తాకుతూండే తలనీలాలు! బెల్ బాటమ్ పాంట్లు గోతాం సంచుల్లాగున్నై. రంగురంగుల చొక్కాలు కాళ్ళకు బూడ్సులు, చేతులకు వాచీలు.

బోటులో నుండి ఏవేవో పార్సళ్ళు దింపుతున్నారు కొందరు.

కాసేపటికి మరో బోటు చేరుకుంది ఆ చోటుకి. అందులోనూ వ్యక్తులున్నారు. ఏవో పార్శళ్ళున్నాయి. పార్శ

శ్శను దింపి గొడౌన్‌లో ఓ మూలగా పేర్చారు, అందరూ కల్సి.

టేబుల్ మీదుండిన కాగితాన్ని ఎవరో అందుకుని చూశారు.

అంతే, అతను అరిచాడు పెద్దగా! ప్రతిధ్వని మూలంగా అతను అరిచిం దేమిటో అర్థంకాలేదు యువరాజ్‌కి.

అతి శ్రమపడి లెక్కించాడు యువరాజ్, వారెందరున్నారో తెల్సుకోడానికి. ఇరవైముగ్గు రున్నారు.

అంతమందిలో ముగ్గురు మగువలు పరువంలో ఉండి ఆకర్షితముగా ఉండడం ఓ ప్రత్యేకత!

ఒక్కొక్కరుగా ఆసీనులవుతున్నారు కుర్చీలలో. ఇద్దరు యువతులు అలమారులను తెరిచి, అందులో ఉన్న సరికొత్త విదేశీమధుపానీయా లున్న బాటిల్స్‌ను తీసి టేబుల్ మీద పెట్టున్నారు.

మరో యువతి రికార్డు ప్లేయర్ని అరేంజ్ చేసింది.

ఒక రికార్డును పెట్టి ఆన్ చేసింది. ఆ మ్యూజిక్‌ని ఎవరు కండక్ట్ చేశారో గానీ బ్రహ్మాండగా వుంది. గొడౌన్ ప్రతిధ్వనించడం మూలంగా రికార్డు ప్లేయర్నుంచి వచ్చే సంగీతం ఉత్తేజాన్ని, ఉత్సాహాన్ని రేపుతూంది.

మ్యూజిక్‌తో గొడౌన్ అంతా మారుమ్రోగిపోతోంది.

ఆ మ్యూజిక్ వింటూంటే నీటిలో వున్న యువరాజు మైమరచి పోయాడు, ఆహ్లాదంతో. ఆ సంగీతానికి తోడు ఆ యువతులు ముగ్గురు డాన్స్ చేయడం ప్రారంభించారు.

ఏదో సినిమా షూటింగ్ జరుగు ప్రదేశంలాగుంది.

ముగ్గురు యువతులు పోటీలుపడి, మ్యూజిక్‌కి అనువుగా ఆడుతున్నారు.

ఆడుతూ అందరికీ కైపు ఎక్కిస్తున్నారు. ఉత్తేజపరుస్తున్నారు రెచ్చగొట్టుతున్నారు.

అందరూ తప్ప తాగేశారు యువతుల ప్రోత్సాహంతో.

తాగిన మైకంలో ఒక్కొక్కరూ ఏదో ఆవేశంగా ఒకో యువతిని వాటేసుకుని చప్పగా జారిపోయారు, నేల మీదకు, శవాల్లా!

అందరూ హద్దు మీరి తాగడానికి కారణం మ్యూజిక్, మ్యూజిక్ కి తగిన నాట్యం, నాట్యంలో గల సెక్స్ అప్పీల్. తాగినతరువాత అంతా పడిపోవడానికి కారణంవాళ్ళపుచ్చుకున్న మధువు పసందైనది, ఘాటైనది, ఒరిజినల్ సరుకు. అది ఇచ్చిన నిషా ముందు, నిలదొక్కుకోలేకపోయారు ఎవరూ.

అంత మంది నిషాకు బానిసలై పడిపోగానే ఆ యువతులూ ఆడిన అలసటకు వేసుకున్నారు 'మందు.'

యువరాజ్ నవ్వుకున్నాడు, నీటిలో!

మెల్లగా మెట్ల దగ్గరకు ఈదాడు. లేచి నిలబడ్డాడు. తడిసిన బటల్ని విప్పుకున్నాడు. బనీయన్ని తీసేశాడు. అన్ డర్ వేర్ తోనే బోటులోకి వెళ్ళాడు. బోటులో వెదగ్గా ఎవరివో పాడిబట్టలు కనబడినయ్.

తొడుక్కుని, తను విప్పిన గుడ్డల్లోగల అవసరమైన వస్తువుల్ని తడి లేకుండా తుడుచుకుని జేబులో పెట్టుకున్నాడు. స్విచ్ బోర్డ్ వైపు నడిచాడు.

లైట్లు ఆర్పేశాడు, జీరో ఓల్ట్ బల్బుని తప్ప.

ఆ ప్రదేశానికి ఇతరులెవరూ రారన్న నమ్మకం అందరికీ వుంటుంది. గనక తను అటు ఇటు తిరగడం గమనించినా పట్టించుకోరని యువరాజ్ నమ్మకం.

గబగబ పార్శిళ్ళ పేర్చిన వైపుకు అడుగులు వేశాడు,

పార్శిళ్ళల్లో ఏముందో చూడ్డానికి.

పార్శిళ్ళ వైపు పోయేటపుడు, మధ్యలో తెరిచిన అల మారు అటకాయించింది.

అప్రయత్నంగా అలమారులోకి దృష్టిని పోనిచ్చాడు. గుండెలు గుభేలు మన్నంత పనైంది, అందులో ఉన్న కత్తిని, కత్తిపన్న నెత్తురు మరకల్ని చూడగానే!

అంటే వీళ్ళల్లోనే ఎవరో ప్రసాద్‌ని హత్యచేసివున్నారా? ఆలోచనలో పడిపోయాడు.

ఈ ముఠాలోని వ్యక్తే ప్రసాద్‌ని హత్యచేసి వుంటే ప్రసాద్‌కీ యీ ముఠాతో సంబంధం వుందా? ఇంత మందిలో హంతకుడెవరు?

అక్కడున్న వారంతా నేరస్తులే, అవుతారు చట్టానికి! నేరస్తుల్లో గల హంతకుడ్ని తెల్సుకోవాలి. ఎలా? హంతకుడు ప్రసాద్‌ని చంపి తరుణేశ్వర్ ఇంట్లో ఎందుకు పెట్టాడు? తరుణేశ్వర్ మీద ద్వేషమా? తరుణేశ్వర్ మీద ద్వేషమైతే... తరుణేశ్వర్‌కీ ఈ ముఠాతో సంబంధం ఉన్నదన్నమాట! విచిత్రమైన కేస్. విడ్డూరమైన విషయ మనుకున్నాడు యువ రాజ్.

అంతమందిలో హంతకు డెవరైంది తెల్సుకునే దెలా?

వెంటనే బయలుదేరి పోలీసు బలగాన్ని పిలుచుకు రావడం మంచిదా? సూరి వెళ్ళినవాడు పోలీసులతో వస్తాడేమో?! తను వెళ్ళి పోలీసులతో వచ్చేలోపు ఈ గొడౌన్‌లో విపరీతం సంభవిస్తే?

గనక ఇక్కడ నుండి వెళ్ళకనే హంతకుడ్ని బంధించి-ముఠా వ్యక్తుల్ని పట్టివ్వాలి. ఎలా?

మెరుపులా ఒక ఆలోచన తట్టింది. జేబులోకి చెయ్యి

పోనిచ్చాడు. తడిసిన డైరీ చేతికి అందింది. ప్లాస్టిక్ కవర్ వుండడం మూలంగా కాగితాల అంచులు మాత్రం తడిసి పోయి వున్నాయి. కాగితాలు తడవలేదు.

కలం అందుకుని ప్రతి పేపరు మీద "ప్రసాద్ - తరుణేశ్వర్" అని వ్రాశాడు.

అక్కడున్నవారు ఇరవై ముగ్గురు. ఇరవై మూడు కాగితాల మీద ప్రసాద్, తరుణేశ్వర్ అని వ్రాసి ప్రతి ఒక్కరి జేబులోను పెట్టేశాడు, యువరాజ్.

స్త్రీల దగ్గర వాళ్ళ జాకెట్లకు తురిమాడు.

తరుణేశ్వర్, ప్రసాద్ ల, పేర్లు వ్రాసి యువరాజ్ అందరి వద్ద ఎందుకు ఉంచాడంటే... మేల్కొగానే జేబులో వుండే కాగితంలో గల పేర్లు చూస్తే హంతకుని ముఖంలో రియాకన్ కనబడుతుందని! లేక హంతకుడు ఏదైన చర్యకైకొన వచ్చు!

ఇక, పోలీసుల్ని రప్పించి, కాపలా వుంచి - అక్కడున్న వారు మేల్కొని జేబులో కాగితాన్ని చూచేటప్పుడు హంతకుడిని సులభంగా పట్టుకోవాలని నిర్ణయించుకున్నాడు యువరాజ్.

పైకి వెళ్ళడానికి సారంగం వద్దగల స్విచ్ బోర్డు వద్ద కెళ్ళాడు, ఆన్ చేయడానికి. ద్వారం తెరుచుకోడానికి, లైటు వెల్గడానికి స్విచ్ ని నొక్కు తరుణంలో......?

కళ్ళు ఝిగేలుమంటూ లైట్లు వెలగడం, ద్వారం తెరచుకునే చప్పుడు వినబడడం జరిగింది. యువరాజ్ స్థాణువై నిలబడిపోయాడు, ఎవరో వస్తున్నారని గ్రహించగానే, శరీరమంతా గడగడలాడిపోయింది.

ఎవరో దిగిరావడం అడుగుల చప్పుడు స్పష్టంగా వినిపించింది.

ఒక్క ఊయలలో పడివున్న ఒక యువతిని చేయకుని, ఆ యువతిని కావలించుకుని పడుకునివున్న వానిలా పడుకునే వాడు యువరాజ్. అడుగుల చప్పుడు దగ్గరై పోతున్నాయి.

* * *

"నేను వెంటబడి రావడం అంతా చూశారా?" అడిగాడు సూరి.

"చూశాం!"

"ఇదో మిస్టర్, నేను అందగత్తెను. నా కెప్పుడూ ప్రమాదం అంటిపెట్టుకుని ఉంటుంది" చెప్పింది వింజామర.

"ప్రమాద మంటే!"

"నా అందాన్ని చూసి ఆవేశపూరితులైన కొందరు, బలాత్కారం చేయడానికి పూనుకున్న సంఘటనలు యిదివరలో జరిగివున్నాయి.అందుకే జీతమిచ్చి బాడీగార్డ్సుని నియమించుకున్నాను.నీ వెందుకు యిలా నా వెంటబడ్డావు నా అందానికి దాసోహం కాకపోతే!!"

"నిజమే. ప్రతి మగాడూ మిమ్మల్ని చూస్తే మీ అందానికి గులాము కాక మానడు. నేనూ మీ వెంటబడ్డాను, మీ అందానికి బానిసనై! మరో విషయం బీచ్ లైన్‌లో ఒక హత్య జరిగింది. ఆ హత్యకు సంబంధించిన హంతకుని అన్వేషణలో మీరు తారసపడ్డారు. నేను ప్రయివేటు డిటెక్టివ్‌ని!" చెప్పాడు సూరి.

"హత్య జరిగిందా? ఎక్కడ?" బిత్తరపోయింది వింజామర.

"మీరు దీపంలేని ఇంట్లోకి వెళ్ళి వచ్చారు, చూశారా, ఆ ఇంటికి సమీపంలో!"

"నేను దీపం లేని ఇంట్లోకి వెళ్ళిరావడం చూశావా?" తత్తరపడిపోయింది. ఆమె తడబడడంలో ఆమె లిప్‌స్టిక్

పెదాలు కాబరే డాన్స్ చేశాయి.

"చూశాను" అన్నాడు సూరి ఆమెనే పరిశీలనగా చూస్తూ.

"ఎందుకు చూశావు?"

"చెప్పానుగా, హంతకుడి కోసం అక్కడున్న ఇళ్ళు అన్నిటిలోనూ విచారిస్తూ రాగా, మీరు కనబడ్డారు."

"నువ్వు ఒక్కడివేనా? నీతో ఇంకెవారైనా వచ్చారా?"

"యువరాజూ వచ్చారు."

"ఎవరూ యువరాజా...ప్రయివేట్ డిటెక్టివ్ కదూ?!"

"అవును."

వింజామర భయంకంపితురాలైంది.

వెంటనే తన బాడీగార్డ్సుని ఉద్దేశించి సైగ చేసింది. వాళ్ళిద్దరూ క్షణంలో సూరిని ఇరికించి పట్టేశారు, కదలనీయకుండా!

"ఏమిటిది?" అడిగాడు సూరి కోపంగా, విదిలించుకోటానికి ప్రయత్నిస్తూ.

"మా జీవితాలు సముద్రంలో పయనించు పడవలాటిది! ఆ పడవకు మీబోటివారి మూలంగా చిల్లులుపడే ప్రమాదముంది. చిల్లులు పడకముందే జాగ్రత్తపడుతున్నాను," అంటూ వింజామర కారువద్దకు నడిచింది, హడావిడిగా.

"కమాన్, క్విక్! సూరి చేతుల్ని వెనకకు విరిచి కట్టేయండి. డిటెక్టివ్ యువరాజ్ మన గొడౌన్ని పరిశోధించడానికి పూనుకుని వుండొచ్చు. యువరాజ్ ని గురించి నాకు బాగా తెలుసు, ఆవలిస్తే పేగులు లెక్క కట్టుతాడు" అంటూ కార్లో కూర్చుని సెల్ఫ్ లాగింది.

సూరి అచేతనంగా ఉండిపోయాడు తన చేతుల్ని బంధించి కార్లోకి నెట్టుతూంటే.

# 14

"ఏమిటి అందరూ పడిపోయివున్నారు?" అన్నాడొకడు.

"చిత్తుగా తాగి వుంటారు, వెధవలు" అన్నాడింకో బాడీగార్డ్.

"యువరాజ్ ఇక్కడెక్కడైనా ఉన్నాడేమో వెదకండి!" వింజామర అక్కడున్న వారందర్నీ చూడసాగింది.

సూరి గుండెలు ఢమఢమలాడుతున్నాయి. యువరాజ్ వున్నాడా, లేడా? సూరికి చేతులు వెనుకకు విరిచి కట్టబడి వున్నాయి. ఆదుర్దాలో అటు ఇటు తిరుగుతున్నాడు, భూగర్భంలోని గొడౌన్‌లో.

మెట్లమీదున్న తడిసిన బట్టల్ని వింజామర పసిగట్టేసింది.

"యువరాజ్ తప్పక వీళ్ళలోనే వున్నాడు. ఈ గొడౌన్ రహస్యం ఇంకా బయటికి పొక్కలేదు. గనక యువరాజ్‌ని ప్రాణాలతో వదలకూడదు" అన్నది వింజామర.

సూరికి ముచ్చెమటలు పట్టేస్తున్నాయి. బూటుకాలిని టకటకలాడించాడు.

"ఏమిటి బూటుతో టకటకలాడిస్తున్నావ్?!" అన్నాడొక బాడీగార్డ్.

ఆ టకటకలో హెచ్చరికను మిళిత పరిచాడు సూరి. యువరాజ్ అక్కడున్న వ్యక్తులలో వుంటే తన హెచ్చరికను పాటిస్తాడని తెల్సు.

'సార్! జాగ్రత్త! అదనుచూచి విజృంభించండి. నా చేతులు బంధించబడివున్నా, నా రెండు కాళ్ళున్నాయి. తప్పక నా కాళ్ళను ఆయుధాలుగా మార్చుకోగలను' అని.

యువతి ప్రక్కనున్న యువరాజ్ వింజామరతో వచ్చిన వ్యక్తుల్ని ఓరకంటతో చూశాడు. దున్నల్లాగున్నారు.

వాళ్ళను దెబ్బతీయడం సామాన్య విషయం కాదనిపించింది.

నిషాలోపడి మత్తుగావున్న వ్యక్తుల్లో ఎవరైనా లేస్తారా? ఇప్పట్లో లేవరని నమ్మకం కుదిరింది.

బాడీగార్డ్సులో ఒకడు వెనుక్కుంటూ వస్తున్నాడు.

వింజామర చూస్తూ వస్తోంది.

సూరి ఆందోళిత మనస్సుతో నిలబడి వున్నాడు. అదే సమయంలో యువరాజ్ వుండి, తలబడితే కలియబడడానికి సంసిద్ధంగా వున్నాడు.

ఒకడు దగ్గరయే కొలది యువరాజ్ తన యావశ్శక్తినీ కూడగట్టుకున్నాడు.

అతను పొజిషన్‌కు రాగానే యువరాజ్ మెరుపులా లేచి ఖడ్గమృగంలా ఢీకొన్నాడు.

యువరాజ్ తాకిడికి తట్టుకోలేక భళ్ళున పడిపోయాడు ఒక బాడీగార్డు! అతను పడగానే ఆ గోడౌన్ యావత్తూ దద్దరిల్లపోయింది.

ఆ హఠాత్సంఘటనను చూడగానే ఇంకో బాడీగార్డ్ శరవేగంతో దూసుకొచ్చాడు, యువరాజ్ మీదకి.

వింజామర విభ్రాంతురాలై హాండ్‌బాగ్‌లో చెయ్యి పెట్టింది.

ఆమె చెయ్యి బయటికి వస్తే – ఏముంటుందో సూరి వూహించుకుని ఒక్క ఉరుకున ఆమెను చేరుకుని, తన కుడి కాలితో ఈడ్చి ఆమె డొక్కలో తన్నాడు, నిర్దాక్షిణ్యంగా.

మంచి దెబ్బ! అందులో బూడ్సుకాలి దెబ్బ!

కిక్‌మంటూ నేలకొరిగిపోయింది, వింజామర కుప్పగా! ఆమె చేతిలోని పిస్తోలు వెక్కిరిస్తూంది!

చేతుల బంధాలు తెగవు. కానీ కాళ్ళతోటి యువరాజ్ కు

సాయపడాలని బాడీగార్డ్సువైపు అంగలు వేశాడు సూరి.

సూరి సమయం చిక్కినపుడు తన కాళ్ళతో తన్నగలుగుతున్నాడు బాడీగార్డ్సుని. యువరాజ్ వారితో ఎంత పోరాడినా లొంగే సూచనలు కానరాలేదు.

సూరి బంధాలను విప్పడానికి యువరాజ్ కు ప్రాణాలు పోయినంతపనైంది.

ఇద్దరికిద్దరు, సమఉజ్జీలు. తమ బలాబలాలను ప్రదర్శించుకోడానికి మంచి అదను. ముష్టియుద్ధం భీకరంగా సాగింది.

డిటెక్టివ్ లిద్దరూ కల్సి చివరకు బాడీగార్డ్సుని లొంగదీసుకోగలిగారు, అతిప్రయాసమీదట.

"సూరీ. హరియప్! పోలీసుల్ని పిలువ్" అరిచాడు యువరాజ్, బాడీగార్డ్సుని బంధిస్తూ.

* * *

ఒకొక్కరుగా నిషానుండి మేల్కొంటున్నారు. మేల్కొన్నవారు ప్రక్కనున్న వారిని లేపుతున్నారు.

లేచి నిలబడ్డ వారిని జేబులోవున్న కాగితం వెక్కిరిస్తోంది వింతగా. కొంతమంది ఆ కాగితాన్ని అందుకుని నలిపి కిందపారేశారు నిద్రమత్తులో, అర్థంగాక.

ఒకడుమాత్రం ఆ కాగితాన్ని చూడగానే తన నిద్రమత్తు నంతటినీ పారదోలి, బిత్తర చూపులతో అక్కడున్న వారందర్నీ చూడసాగాడు. అందరి జేబుల్లోనూ, ఆ కాగితాలు కనబడగానే అతను ఆవేశపూరితుడై ఆగ్రహాన్ని తెచ్చుకుని, "ఈ కాగితాలను వ్రాసిందెవరు?" అని గొంతెత్తి అరిచాడు.

"నేను వ్రాశాను" అంటూ, అంతవరకు పార్కిళ్ళ

వెనుక దాగి గమనిస్తూన్న యువరాజ్ ఎదురుగావచ్చి నిల బడ్డాడు.

"ఎవరు నువ్వు?" క్రోధంతో గర్జించాడు. అతని గర్జన గొడౌన్‌లో మారుమోగిపోయింది.

"నీ పాలిట యముడు" అంటూ, పార్కిళ్ళ వెనకపోలీసు బలగం బిలబిలమంటూ వచ్చి చుట్టేసింది అందరినీ.

# 15

"ఎవరు మీరంతా, నిజం చెప్పేయండి! భూగర్భంలో గొడౌన్‌ని కట్టిం దెవరు?" అడిగాడు యువరాజ్ వింజామరని.

"మేమంతా స్మగ్లింగ్ గాంగ్‌కు చెందినవారం! కొన్ని సంవత్సరాల క్రితం స్మగ్లింగ్ ముఠాకు చెందిన వ్యక్తులు కొందరు విలువైన వస్తువులతో బోటు వస్తూందని కొందరు అధికారులు పసిగట్టి వెంబడించారు, పట్టుకోడానికి! కానీ గాంగ్ వ్యక్తులు తప్పించుకునే సందర్భంలో అప్రయత్నంగా తమ బోటుని సారంగంలా కనబడు ప్రదేశంలోకి మళ్ళించారు కనబడకుండా వుండడానికి. నిజానికి ఆ సొరంగాన్ని ఎవరూ కనుగొనలేకపోయారు. అనుమానించనూ లేకపోయారు ఇంతకాలం వరకూ! అప్పటి గాంగ్ వ్యక్తుల్లోని కొందరు ప్లాను వేసుకుని అక్కడ గొడౌన్‌ని నిర్మించారు వ్యయ ప్రయాసలకోర్చి. అక్కడి ఆస్థావరం కొన్ని సంవత్సరాలుగా స్మగ్లింగ్ ముఠావ్యక్తులకు ఉపయోగపడుతోంది!" చెప్పింది వింజామర వివరంగా.

"మిస్టర్...నీవెందుకు ప్రసాద్‌ని హత్యచేశావు? హత్య చేసిన ప్రసాద్‌ని తరుణేశ్వర్ ఇంట్లో ఎందుకు పెట్టావు?

హాత్యా జరిగినట్టు పోలీసులకు ఎందుకు చెప్పావు, ఫోన్ చేసి?" అడిగాడు యువరాజ్ నిజం చెప్పమన్నట్టు.

"భయపడి ప్రసాద్‌ని చంపాను" చెప్పాడు స్మగ్లింగ్‌కు సంబంధించిన వ్యక్తి.

"భయపడా?...భయమంటే ఏమిటో మీకు తెల్సా. ఏమిటా భయం?" ఆశ్చర్యపోయి అడిగాడు యువరాజ్.

"నేను గొడౌన్ నుండి కొన్ని ఆజ్ఞల అనుసరించి నా చేతికి ఇవ్వబడ్డ సూట్‌కేసుని అందుకుని బయలుదేరాను, అందివ్వవలసిన చోటుకి! ఇసుకలో నడుస్తూ సిగరెట్ కాల్చుకోబోవు సమయంలో సూట్‌కేసు తెరుచుకుంది, వాటి క్లిప్పులను సరిగా నొక్కని కారణంగా.సూట్‌కేసు తెరుచుకోగానే అందులో వుండిన గోల్డ్ బిస్కెట్స్, వాచెస్, టేప్ రికార్డర్లు, ఇంకా విలువగల వస్తువులన్నీ కిందపడిపోయినాయి ఇసుకలో.

నేను గబగబా వాటిని ఏరి సూట్‌కేసులో పెట్టే సమయంలో నా ప్రక్కగా ప్రసాద్ వచ్చి నిలబడ్డాడు గమనిస్తూ నిముషంపాటు. నన్ను, సూట్‌కేసులోని వస్తువుల్ని పదేపదే చూశాడతను.చూచిన ప్రసాద్ గబగబా నడవడం ప్రారంభించాడు.

"అతను పోలీసులకు చెప్పేస్తాడని భయపడ్డాను. నాలో ఏదో ఆవేశం కలిగింది. ఉద్రేకం ఉబికింది. నా జేబులో వుండిన కత్తిని అందుకుని వెళ్ళిపోయే ప్రసాద్ వెనకగా వెళ్ళి పొడిచేశాను, అరుస్తాడేమో ననుకుని గొంతును పట్టుకుని నులిపేశాను.

"ప్రసాద్ చచ్చిపోయాడని తెలియగానే నాలో వివేకం మేల్కొంది. శవం అక్కడే వుంటే పోలీసులు వస్తారు ఆ

చోటుకి. చుట్టుప్రక్కల విచారణ సమయంలో మా స్థావర వునికి తెల్సిపోతుందని జంకాను. అందుకని ప్రసాద్ జేబులు వెదికాను. అతని జేబులోగల పర్సులో అతని అడ్రసుని చూశాను. అడ్రసు చూడగానే ఒక ఆలోచన తట్టింది. శవాన్ని వాళ్ళ ఇంట్లోకి చేర్చితే—ప్రసాద్‌కు విరోధు లుంటే నేరం అటుమళ్ళుతుందని భ్రమపడ్డాను.

"శవాన్ని ఎత్తుకుని ప్రసాద్ ఇల్లుచేరాను, కార్లో. ప్రసాద్ ఇంటి బయట తలుపుల్ని చూడగా లోపలగడియ పెట్టుకున్నారని తెల్సింది. శవాన్ని ఎక్కడ పెట్టాలన్న సంశయంతో వుండగా, ప్రక్కింటినుండి ఇద్దరు—దంప తులు అనుకుంటాను, చిరుబురులాడుకుంటూ బయటికివచ్చారు చేతిలో సంచితో—అర్థరాత్రిలో వాళ్లు వెళ్ళే సందడిలో తలుపుకు తాళం పెట్టలేదు. గొళ్ళెంమాత్రం పెట్టారు. నేను ప్రసాద్ శవాన్ని ఆ ఇంట్లోకి తీసుకెళ్ళి పడగ్గదిలోచక్కగా పడుకోబెట్టి—పోలీసులకు ఫోన్ చేసి చెప్పి వెళ్ళిపోయాను" చెప్పాడతను నిజాన్ని దాచకుండా.

"మిస్టర్ తరుణేశ్వర్, నువ్వు చేసిన నేరం ఏమిటి?నువ్వ సలు ఏ నేరమూ చేయని వాడివి! మరి ఎందుకు హత్యచేశా నని ఒప్పుకున్నావు?" అడిగాడు యువరాజ్.

"మా చెల్లెలికు తీరని అపకారం చేశాను. గౌరి అంటే నాకెంతో మమకారం, అనురాగం వుంది. గౌరిని నాభార్య రాచి రంపాన పెట్టడం సహించలేకపోయానండి. చివరకు గౌరి తలకు రాసుకోను కొబ్బరినూనె సైతం అందనిచ్చేది కాదు, నా భార్య! గౌరిని ఎన్నెన్నో బాధలకు గురిచేసింది హీనాతిహీనంగా. గౌరి అనుభవించు అవస్థల్ని చూస్తూ ఉండలేకపోయాను. సుగంధని మందలించాను! తిట్టాను!

కొట్టాను.

"గౌరి ఇంకా కష్టపడడం ఎక్కువైంది, సుగంధిచేత. గౌరిచేత చేయరాని పనులు చేయిస్తూ అధికారం చలా యిస్తూంటే చూస్తూ భరించలేకపోయాను.

"చివరకు ఫాల్గుణమూర్తి నా చెల్లెలును వివాహం చేసుకుంటానంటే సంతోషపడ్డాను. చెల్లెలుకు ఎంతో ఆడంబరం లేకపోయినా—నిండు మనసుతో దీవించి, అక్షింతలు వేస్తూ వివాహం చేయాలన్న నా ఆశనుకూడా మంటకలిపేసిందండి సుగంధి!!!"

ఏడుస్తున్నాడు తరుణేశ్వర్. అతని శరీరం చెమటతో తడిసి ముద్దయిపోయింది.

"గౌరిని హింసించిన సుగంధిని హింసించాలనుకున్నాను. అందుకే నిందమోపాను. అక్రమసంబంధం అంటగట్టాను—విచక్షణారహితంగా! మా చెల్లెలికి ఆడపడుచన్న అభిమానం కించెత్తైనా చూపలేని, చూపించలేని అసమర్థున్నైపోయాను. మా చెల్లెలికి నేను ఘోర అపరాధం చేసిన వాడ్ని. ఇక్కట్లు అనుభవిస్తూందని తెల్సీ వారించలేని వాజమ్మనైపోయాను. నేను నేరస్థుణ్ణి! శిక్ష అనుభవించాలి. నేను ఉరికంబానికి ఎక్కాలనే ఆ నేరం నామీద వేసుకున్నాను" దీనంగా ఏడ్వసాగాడు తరుణేశ్వర్.

అందరూ స్తంభించిపోయి నిలబడిపోయారు.

గౌరి అన్నయ్యను వాటేసుకుని ఏడుస్తోంది.

"నన్ను క్షమించండి" అంటూ సుగంధి వెళ్ళి తరుణేశ్వర్ కాళ్ళపై బడిపోయింది.

—: ఐపోయింది :—

# విషవలయం

## ఉప్పలూరి ఉషారాణి

"నా పేరు విశాల!" అందామె కూర్చుంటూ. ఆమె మాట్లాడు తూంటె వీణ మీటినట్లుగా వుంది.

"చూడండి విశాలగారూ! మాకు మీలాంటి పసుచుపిల్లలు కాదు కావాల్సింది. కనీసం 30 సంవత్సరాలన్నా వుండాలి. అసలు మా అడ్వర్‌టైజ్‌మెంట్ సరిగ్గా చూశారా?" అడిగాడు రవిధర్ అనుమానంగా ఆవిడను చూస్తూ.

రవిధర్, సుశీలాదేవిగారి సెక్రటరీ.

తలూపిందామె "మీకు ఓ నర్స్ కావాలి!"

"అవును. సుశీలాదేవిగార్ని అనుక్షణం కనిపెట్టి వుండటానికి ఓ నర్స్ కావాలి. ఆమెకి కళ్ళులేవు. అంటె పూర్తిగా కాదు. ఏదైనా మసగ్గా కన్పిస్తుంది. ఆమెకి ఎలాంటి ఇబ్బందీ

కలగకూడదు. ఆమెకి ప్రస్తుతం ఆరోగ్యంకూడా సరిగ్గా లేదు. వేళకి మందులు ఇవ్వాలి. ఆమెని అనుక్షణం కనిపెట్టి వుండాలంటె, మీలాంటి యువతుల తరంకాదు. అంటె మిమ్మల్ని ఈజీగా తీసిపారేస్తున్నాననిమాత్రం అనుకోవద్దు. అలాంటి పనులు చేయాలంటె బాగా ఓర్పుకావాలి" ఆగాడు రవిధర్.

విశాల మరోసారి అందంగా నవ్వింది.

"మిస్టర్ రవిధర్, నేను బాగా ట్రెయిన్డ్ నర్స్‌నని మర్చిపోతున్నారు. గుంటూరు మిషన్ హాస్పిటల్‌లో నాలుగు సంవత్సరాలు పనిచేశాను. నాదగ్గిర సర్టిఫికెట్ కూడావుంది" విశాల తన బాగ్ లోంచి సర్టిఫికెట్ తీసి రవిధర్‌కి అందించింది.

రవిధర్ దాన్ని అందుకుని ఓమారు పరీక్షగా చూసాడు.

"దట్‌జ్ ఆల్ రైట్. కాని ఈ పని ఇక్కడమాత్రం మీరు చేయలేరని నాకు అన్పిస్తోంది. ఓపికా, సహనం అవసరం" నెమ్మదిగా అన్నాడతను.

విశాల ప్రాథేయపూర్వకంగా అంది: "మిస్టర్ రవిధర్. దయచేసి ఈ చిన్న అవకాశాన్ని ఇప్పించండి. కొద్దికాలం లోనే నేను ఎలాంటిదాన్నో మీకు తెలుస్తుంది" అందామె దీనంగా.

ఆమె మొహం చూడగానే రవిధర్ హృదయం జాలితో నిండిపోయింది. "ఆల్ రైట్. మీరు అంతగా కోరుతున్నారని ఈ పోస్ట్ మీకిస్తున్నాను. ఆ తర్వాత మీ నడవడిక మీద ఆధారపడివుంటుంది" అని కుర్చీలోంచి లేచాడు. "రేపు ఉదయం ఓసారివచ్చి చూడండి నన్ను" అన్నాడతను.

విశాల తలవూపి వెళ్ళటానికి తయారయింది. రవిధర్ ఆశ్చర్యంగా ఆమెవంక చూసాడు.

"విశాలా మీరు ఎంతజీతం ఎక్స్‌పెక్ట్ చేస్తున్నారు. ఆ విషయం మీరు అడగలేదు."

విశాల నవ్వింది. "అది మీరు నిర్ణయించాల్సిన విషయం" అని తలుపు తెరుచుకుని వడివడిగా వెళ్ళిపోయింది.

ఆమె వెళ్ళినవైపే చూస్తూ నిలబడ్డాడు రవిధర్.

## 2

హోటల్ 'నాగార్జున' ఎప్పుడూ వచ్చేపోయే వాళ్ళతో సందడిగా వుంటుంది. సాధారణంగా అందులో విదేశీ ప్రయాణీకులు బసచేస్తుంటారు.

హోటల్ నాగార్జునముందు టాక్సీ దిగింది విశాల. వడివడిగా నడిచింది రెస్టారెంట్‌లోనికి.

తలుపుదగ్గర నిలబడి ఓసారి అంతా కలయచూసింది.

ఆమె దృష్టి మూలగా కూర్చునివున్న ఇరవైఎనిమిదేళ్ళ యువకుడిమీద పడింది. ఆ వైపుగా ఆమె నడవసాగింది.

విశాల రాకను గమనించి ఆ వ్యక్తి చిన్నగా నవ్వాడు. విశాల అతని దగ్గిరికి చేరుకుంది. అతని ప్రక్కనున్న కుర్చీలో చతికిలబడింది.

"సక్సెసేనా?" అడిగా డతను.

విశాల తలూపింది.

"థాంక్ గాడ్! మొత్తానికి సాధించావు. ఏమవుతుందోనని హడలిచచ్చిపోతున్నాను. ఎప్పుడు జేయిన్ అవుతున్నావు?" అడిగాడు ఆమెవంక చూస్తూ.

ఆమె నెమ్మదిగా అంది. "రవిధర్ రేపు ఓసారి రమ్మన్నాడు" అని ఓ క్షణం ఆగింది. "అసలు మనప్లాన్ సక్సెస్ అవుతుందంటావా? నాకు ఏదో అనుమానంగావుంది రాజా!" అంది విశాల.

"ఆ పిరికితనమే వద్దన్నాను. ధైర్యంగా వుండాలి. మిగతా పని నేను చూస్తూవుంటాను. నీ విషయంలో జాగ్రత్త! ఎక్కడైనా పొఱబాటు జరిగిందా మనం ఓడిపోతాం. ఈవిషయం గుర్తుంచుకో విశాలా," అన్నాడు రాజు.

రాజు చూడటానికి అందంగా వుంటాడు. ఆరడుగుల ఎత్తైన విగ్రహం. విశాలమైన ఛాతి. కండలు తిరిగిన శరీరం. ఎవరైనా అతన్ని చూడగానే అతనిమీద సదభిప్రాయం కలుగుతుంది.

కాని —

అతను ఎనిమిది సంవత్సరాలు జైల్లోవుండి వచ్చాడంటె ఎవ్వరూ నమ్మరు!

అతను ఫోర్జరీలో దిట్ట. ఎవ్వరి సంతకాన్ని అయినా ఓ సారి చూసాడంటె నిమిషాలమీద దాన్ని అమలుపర్చగలడు.

ఇదివరకు జమీందారు ధర్మారావు దగ్గర మేనేజర్‌గా పని చేస్తూ ఓసారి ధర్మారావు సంతకాన్ని ఫోర్జరీచేసి చెక్కు మారుస్తుండగా పోలీసులు రెడ్ హేండెడ్‌గా పట్టుకున్నారు.

ఫలితం ఎనిమిదేళ్ళు కారాగారశిక్ష!

అతను విడుదలై దాదాపు వారంరోజులైంది.

అతని విషయం తెల్సి, విశాల అతని దగ్గరికి వెళ్ళింది. తనకు అతని సహాయం కావాలని అర్థించింది. అతను ఆమెకు సహాయం చెయ్యడానికి ఒప్పుకున్నాడు. దానికి తగ్గ వాటా కూడా కోరాడు. విశాల అందుకు అంగీకరించింది.

విశాల ఓసారి రాజువంక చూసింది. "రాజూ! ఇక రూంకి వెళతాను. శ్రీధర్ ఎదురు చూస్తూంటాడు నాకోసం. గుడ్ నైట్!" అని చెప్పి లేచిందామె.

# 3

రవిధర్ తన ఆఫీసు రూమ్‌లో కూర్చుని ఏవో కాగితాలు చూసుకుంటూ వుండగా టేబుల్ మీదున్న ఫోన్ మ్రోగింది. రిసీవర్ అందుకుని "హలో" అన్నాడు.

"రవి! నేను సుశీలాదేవిని మాట్లాడుతున్నాను. నీవు కొత్తగా నియమించిన నర్స్ చాలామంచిది. ఆమె అలాగే సహాయం చేస్తూవుంటే నాకు ఈ జీవితంలో ఇక ఏమీ అవసరం వుండదనిపిస్తోంది."

నవ్వాడు రవిధర్. "అలాగా! మీరు సంతోషంగా వుండటమే నాకు కావాల్సింది. ఏమైన అవసరమైన విషయాలున్నాయా?" అడిగాడు.

"నీతో కొన్ని ముఖ్యమైన విషయాలు మాట్లాడాలి. వెంటనే రాగలవా?"

రవిధర్ ఓ క్షణం వూపిరి పీల్చుకున్నాడు. "అలాగే! పది నిముషాల్లో మీముందు వుంటాను" అని రిసీవరు పెట్టి ఆఫీసు బయటికి నడిచాడు.

కాంపౌండులో ఎర్రని ఇంపాలా కారువుంది. దానివద్దకు నడిచాడతను. దానివంక ఓసారి చూసి నవ్వుకున్నాడు. అది తన స్వంతం కాకపోయినా, తన స్వంత కారులాగే వుపయోగించుకుంటున్నాడు. అది సుశీలాదేవి రవిధర్‌కి కొనిచ్చిన కారు.

రవిధర్ సుశీలాదేవికి దూరపు బంధువు. ఆమెకి బోలెడంత ఆస్తివుంది. అదీగాక, ఆమె భర్త వుండేరోజుల్లో, అతను పెట్టిన హోటల్, మరి రెండుమూడు చిన్నచిన్న కంపెనీలు, ఆయన చనిపోవటంతో మూలపడే పరిస్థితికి వచ్చాయి. ఆ సమయంలోనే సుశీలాదేవికి రవిధర్ కన్పించాడు. నమ్మక

మైన వాడు. వాటి బాధ్యత అంతా అతనికి అప్పగించింది.

దానికి తగ్గట్లుగా రవిధర్ కూడా త్వరలోనే ఆమె మెప్పు గడించాడు.

పది నిమిషాల్లో ఇంపాలా నాల్గు అంతస్తుల మేడముందు ఆగింది. క్రింది మూడు అంతస్తులు అద్దెకు ఇవ్వబడ్డాయి. పై అంతస్తులో మటుకు సుశీలాదేవి వుంటుంది.

రవిధర్ లిఫ్ట్ ఎక్కి రెండు క్షణాల్లో పై అంతస్తులో ఆగాడు. నెమ్మదిగా తలుపు తట్టాడు. తలుపు తట్టిన మరు క్షణంలో తెరుచుకుంది. ఎదురుగా విశాల నిలబడి వుంది.

రవిధర్‌ని చూడగానే "మీ కోసం సుశీలాదేవిగారు ఎదురు చూస్తున్నారు" అంది విశాల.

రవిధర్ తలూపి, చకచకా లోనికి నడిచాడు. అతనికి సుశీలాదేవి ఎక్కడా కన్పించలేదు. మేడ మీద బాల్కనీ లోంచి సన్నగా ఏదో మ్యూజిక్ వస్తూంది. ఆ వైపుగా నడిచాడు.

సుశీలాదేవి కుర్చీలో కూర్చుని వుంది. ప్రక్కన టేప్ రికార్డర్ తిరుగుతూ వుంది. అందులో నుండే వినబడుతూంది సంగీతం.

రవిధర్‌ని ఓసారి చూసి సన్నగా నవ్వింది ఆమె.

"కూర్చో రవి. ఇది చూడు ఎలావుంది. విశాల నా వినోదం కోసం తెచ్చిన బహుమతి."

"బావుంది" అని తలూపాడు తను.

"రవీ! నీతో కొన్ని విషయాలు మాట్లాడా లనుకున్నాను. కాని, అర్జంట్‌గా బజారుకి వెళ్ళదామను కుంటున్నాను. విశాల వచ్చాక బజారుకి వెళ్ళాలన్న కోరిక కలిగింది. ఏమీ అనుకోకు. నేను వచ్చేదాకా కూర్చొని వుంటావా?"

"అసలు విషయం చూచాయగా నైనా చెప్పండి?" అడిగాడు రవిధర్.

"ఏమీ లేదు. లాయర్ కి ఫోను చేసాను, రమ్మని. వీలు నామా రాయాలనుకుంటున్నాను."

రవిధర్ మవునంగా ఆమె చెప్పింది వినసాగాడు.

"కాని, మనస్సు మార్చుకున్నాను. లాయర్ రేపు వస్తాడు. అంతకు ముందు నీతో కొన్ని విషయాలు మాట్లాడాలి!"

"మేడమ్! విషయం ముఖ్యమైనది అంటున్నారు. బజారుకి తర్వాత వెళ్ళవచ్చు."

ఆమె ప్రేమగా రవిధర్ వంక చూసింది. "అందుకే నీ వంటే ఇష్టం రవి. దూరపు బంధువైనా, అంతా నీ స్వంత పనిలా చూసుకుంటున్నావు" అని ఓ క్షణం ఆగింది.

"ఈ రోజు బొంబాయి నుండి నా మేనల్లుడు వచ్చాడు. మొన్నటిదాకా అతను ఇక్కడే వున్నాడన్నది నీకు తెల్సు. ఆస్తి పంచమని అడిగాడు. నాకు వాడు తప్ప ఎవ్వరూ లేరు. అయినా వాడు పూర్తిగా చెడిపోయాడు.అందుకే అసహ్యం. ఆలోచించి పైసా కూడా ఇవ్వనని గట్టిగా చెప్పాను. నీ అంతు చూస్తానని నన్ను బెదిరించి వెళ్ళాడు" ఆమె గొంతు బొంగురుగా మారింది.

పకపక నవ్వాడు రవిధర్. "మీరు ఏమీ బాధ పడకండి మేడమ్! అతని విషయం నేను చూస్తాను."

రవిధర్ వంక ఆమె వాత్సల్యంగా చూసింది.

ఆమె దగ్గర నుండి సెలవు తీసుకొని రవిధర్ క్రిందికి వచ్చాడు.

## 4

రవిధర్ ఆఫీసులో వుండగా ఫోను మ్రోగింది. రిసీవరు అందు కున్నాడతను.

"నేను విశాలని" విన్పించింది అవతలి వైపునుండి.

"ఏమిటి విషయం?" అడిగాడతను.

"మీతో ముఖ్యమైన విషయం మాట్లాడాలి."

"ఎక్కడ కన్పించమంటావు. అంత ముఖ్యమా?"

"మీరే చెప్పండి ఎక్కడ కలవాలో?"

"షార్ప్, ఫస్ట్ క్రాస్ స్ట్రీట్ లో నా ఇంటికి రా! నేను వెంటనే బయలు దేరుతున్నా" అని రిసీవరు పెట్టేసి, బయటికి వచ్చి కారులో కూర్చున్నాడు.

అరగంటలో తన ఇంట్లోకి నడిచాడు అతను. ముందు గదిలో విశాల కూర్చుని వుంది. రవిధర్ ని చూడగానే, చిన్నగా నవ్వింది.

రవిధర్ వచ్చి ఆమె ఎదురుగా కూర్చున్నాడు.

"చెప్పు!" ఆమెని చూస్తూ అడిగాడతను.

"సుశీలాదేవిగారు వీలునామా రాసారు తెల్సా?

నిటారుగా కూర్చున్నాడతను. "ఎప్పుడు? నాకు తెలీకుండానే రాసారా? నేను నమ్మను" అన్నాడు.

విశాల నవ్వలేదు. "సీరియస్ గా చెబుతున్నాను. విల్లు రాసారు. దాన్ని 'సుసీల్ బాంక్' లాకర్లో వుంచిందామె."

రవిధర్ మొహంలో రంగులు మారాయి. "అయితే ఏమిటి? నాకు నీవు చెప్పటం దేనికి?"

విశాల సీరియస్ గా అంది. "అవసరం వచ్చింది. ఆమె నీకు తన ఆస్తిలో దెబ్బయి అయిదు వేలు రాసింది."

అతని ఒంట్లోని నెత్తురు విద్యుత్ కంటె వేగంగా ప్రవహించింది. చటుక్కున లేచి నిలుచున్నాడు.

"జోక్ చేస్తున్నావా?" అడిగాడు ఆమెవంక చూస్తూ.

"లేదు. నిజం చెబుతున్నాను."

"మిగిలింది ఎవరికి రాసింది?"

"నాకు అయిదువేలు రాసింది. మిగిలింది,అనాధులకి రాసేసింది."

"నీకు రాసిందీ?" అనుమానంగా అడిగాడు.

"అవును."

అతను లేచి నిలుచున్నాడు.

"నాకు నమ్మకం కల్గటంలేదు నీ మాటలమీద. సుశీలాదేవి నాకు అంత డబ్బు ఎందుకు ఇస్తుంది?ఆమె పిసినారి అని నాకు బాగా తెల్సు. నిజానికి ఆమె అంటె నాకు అసహ్యం. ఏదో సంపాదనకోసం పనిచేస్తున్నాను ఆమె దగ్గిర."

"నీకు అంతగా నమ్మకం లేకపోతే ఎలాగ నామీద" క్షణం ఆగింది. "నేను నిరూపించగలను."

"ఎలాగ?"

"దటీజ్ ఆల్ రైట్! నిన్ను నమ్మించినందువల్ల నాకు లాభం ఏమిటి? నిజం చెప్పాను. వస్తాను" అని వెనక్కి తిరక్కుండా వెళ్ళిపోయిందామె.

రవిధర్ మంచంమీద పడుకుని దీర్ఘంగా ఆలోచించసాగాడు. విశాల చెప్పిన విషయం అతనికి నమ్మశక్యం కాకుండా వుంది. పోనీ, సుశీలాదేవిని అడుగుతే? ఏమని అడుగుతాడు?

తల విదిలించాడతను. ఎలాగైనా విల్లు చూడాలి. నిజంగా తను అదృష్టవంతుడా? కాని ఎలాగ? అది బాంక్‌లో వుంది. దాన్ని తను చూడలేదు. ఆమె పర్మిషన్ లేనిదే దాన్ని తనకు ఇవ్వరు.

'ఏదో పథకం వెయ్యాలి. విల్లు చూడాలి!' అనుకున్నాడతను. ఫోనందుకున్నాడతను.

"మేడమ్. నేను రవిధర్‌ని."

"చెప్పు రవీ! ఏమికావాలి!"

"కొన్ని కాగితాలమీద అర్జంటుగా మీ సంతకాలు కావాలి. నేను వెంటనే వస్తున్నాను."

"ఇప్పుడా! నేను బయటికి వెళుతున్నాను."

"చాలా అర్జంటు. లేకపోతే చాలా నష్టం వస్తుంది."

"సరే! పదినిముషాల్లో వచ్చెయ్యాలి సుమా!"

రవిధర్ రిసీవర్ పెట్టాడు.

'తన ఎత్తు పారుతుందా?' అని ఆలోచించ సాగాడు ఆతను. ఎలాగైనా కానిమ్మని నిశ్చయానికివచ్చి టైపురైటర్ ముందు కూర్చున్నాడు. చకచకా ఓ పర్మిషన్ లెటర్ తయారుచేసాడు. సుశీలాదేవి, తన విల్లుని రవిధర్‌కి ఇచ్చి పంపమని దాని సారాంశం.

కొన్ని కాగితాల్తోపాటు దాన్ని బ్రీఫ్ కేసులో వుంచి, తన కారులో కూర్చున్నాడు.

రవిధర్‌ని చూడగానే "గుడ్! త్వరగా వచ్చావు. ఏమిటి విషయం?" అంది సుశీలాదేవి.

రవిధర్ కొన్ని కాగితాలు తీసి టేబుల్‌మీద వుంచాడు. "సంతకాలు పెట్టండి" అన్నాడు.

"నాకళ్ళజోడు తీసుకురా రవీ! అల్మారాలో వుంది."

రవిధర్ ఓ క్షణం ఆలోచించాడు. అల్మారాలో చూసి "లేదు మేడమ్" అన్నాడు.

ఆమె విసుక్కుంటూ "ఎక్కడ పెట్టానో!" అని పెన్ అందుకుని కాగితాలమీద సంతకాలు పెట్టసాగింది.

రవిధర్ ఒక్కొక్కదాన్నే తీయసాగాడు.

రెండు మూడు కాగితాలపైన సంతకాలు పెట్టాక అతను

వైపు చేసిన లెటర్ వచ్చింది. అతనిగుండె వేగంగా కొట్టుకో సాగింది.

"రవీ! ఇదేమిటి?" అందామె.

అతని గుండె క్షణంపాటు ఆగింది. "మన పాతమేడ వేస్ట్‌గావుందికదూ? దాన్ని అద్దెకిచ్చాను. దానిఅగ్రిమెంట్" అన్నాడతను.

ఆమె అతనివంక చూసి, "అందుకే నీవంటే నాకు ఇష్టం" అని దానిమీద సంతకం పెట్టింది.

రవిధర్ తృప్తిగా శ్వాస పీల్చుకున్నాడు.

## 5

అతను ఆమెవంక చూసాడు.

"మొత్తానికి విల్లు చూసావన్నమాట. ఇప్పుడైనా నా మీద నమ్మకం కలిగిందా?" అంది విశాల.

రవిధర్ మాట్లాడలేదు.

"నీకు ఆ డబ్బు కావాలంటె కొంతకాలం ఆగాల్సి వస్తుంది. అంతవరకూ వెయిట్ చెయ్యగలవా?"

రవిధర్ నెమ్మదిగా అన్నాడు: "అదే ఆలోచిస్తున్నాను. నాలో ఓపిక నశించిపోతూంది."

విశాల విలాసంగా నవ్వింది. "నీవు నాతో చేతులు కలిపావంటె అది త్వరగా నీ పరం అవుతుంది."

అతను ఆమెవంక సూటిగా చూసాడు.

"అసలు సంగతి చెప్పు. అయినా నీకు వచ్చేది అయిదు వేలేగా? దానికోసం నీవు ఇంత ఆత్రుత పడటం ఏమిటి?" అడిగాడు.

ఆమె చిన్నగా నిట్టూర్చింది.

"డియర్ రవిధర్. అసలు విషయం చెబుతాను. పూర్తిగా

విను" అంటూ చెప్పసాగింది.

* * *

ఆశ్చర్యంగా ఆమె వంక చూసాడతను.

"అయితే నీవు సుశీలాదేవి మేనల్లుడైన శ్రీధర్ భార్యవా?" ఆశ్చర్యంలోంచి తేరుకుంటూ అడిగాడు.

"అవును" భారంగా అంది విశాల. "నిజానికి శ్రీధర్ కి ఆస్తి మీద మమకారంలేదు. మేమిద్దరం ప్రేమించి పెళ్ళి చేసుకున్నాము. నాకు సంపాదనలేదు. అతనా వూరికనే వున్నాడు. మేము బ్రతకాలంటే డబ్బుకావాలి. ఈ ప్రపంచంలో అదిలేంది ఎవ్వరూ క్షణం వూపిరి తీసుకోలేరు. ఎలాగూ అతనికి ఆస్తి వస్తుంది సుశీలాదేవిగారి తదనంతరం. అంత వరకూ మేము ఎలా జీవించగలం? అందుకే ఆయన్ని పంపాను ఆమె దగ్గిరికి మాట్లాడమని. తన ఆస్తిలో చిల్లికాని ఇవ్వననీ, అనాధులకి రాస్తానని భయపెట్టింది. శ్రీధర్ తనకు ఆస్తి అవసరం లేదని నాతో అన్నాడు.

"కాని_? వూరికే వస్తున్న ఆస్తిని ఎలా వదులుకో గలము. అందుకే పధకం ఆలోచించాను. శ్రీధర్ ని ఒప్పించి బొంబాయినుండి ఇక్కడికి తీసుకువచ్చాను. ఎలా మా పధకం అమలు చేద్దామా, అని ఆలోచిస్తున్నంతలో నీవు చేసిన అడ్వర్ టైజ్ మెంట్ చూసాను. ఉద్యోగం దొరికింది. ఇక మా పని నెరవేరే సమయం దాదాపు దగ్గర పడింది. కొద్దిగా నీ సహకారం కావాలి మాకు. మీకు జన్మాంతరం కృతజ్ఞులాలమై వుంటాను" ఆగింది విశాల.

రవిధర్ నోరు తెరిచి ఆమె చెప్పింది వింటున్నాడు.

"శ్రీధర్ ఇప్పుడు ఇక్కడ వున్నాడా?"

"అవును. ప్రస్తుతం అతన్ని రంగంలోకి తీసుకు రాదల్చుకోలేదు. ఇప్పుడతను తన స్నేహితుడితో వుంటున్నాడు."

పకపక నవ్వాడు రవిధర్! "విశాలా, నీవు ఉత్త ఇడియట్ వి అనుకోలేదు. ఇప్పుడు ఎలా వస్తుంది ఆ ఆస్తి. ఆమె కొంత నీకూ, నాకూ, మిగిలింది అనాధులకి రాసింది. విల్లుకూడా రిజిస్టర్ అయింది. అలాంటి సమయంలో నీవు ఎలా సాధించగలవు?"

ఈసారి విశాల నవ్వింది. "మై డియర్, రవిధర్! నీవు నిజంగా ఉత్త ఫూల్ వి. అసలు పథకం లేకుండా, నేను ఏ పనీ చెయ్యను."

"సరే! చెప్పు" సీరియస్ గా అన్నాడు రవిధర్.

విశాల ఓ క్షణం దీర్ఘంగా వూపిరి తీసుకుని, "ఇక్కడ ఫోనుందా?" అడిగింది అతన్ని చూస్తూ.

తలూపి "హాల్లో వుంది" అన్నాడు ఆలోచిస్తూ.

విశాల ఎవరికో ఫోను చేసి వచ్చింది. రవిధర్ ఎదురుకుండా కుర్చీలో కూర్చుని రవిధర్ ని తదేకంగా చూడసాగింది.

"ఎవరికి ఫోను చేసావు?" అడిగాడతను.

విశాల మాట్లాడలేదు. దాదాపు పది నిమిషాల తర్వాత రవిధర్ ఇంటి ముందు బ్యాక్ కారువచ్చి ఆగింది. అందు లోంచి ఓ యువకుడు హుందాగా నడిచి లోనికి వచ్చాడు.

రవిధర్ అతన్ని చూసి నుదురు చిట్లించాడు.

అతన్ని చూడగానే విశాల లేచింది. "ఇతను రాజు!" అంటూ రవిధర్ కి పరిచయం చేసింది.

రవిధర్ తలూపాడు, చెప్పమన్నట్లుగా.

విశాల గొంతు సవరించుకుంది. "ఇక నా పథకం చెబుతాను. ప్రస్తుతం సుశీలాదేవి రాసిన విల్లు నీ దగ్గర వుంది, దాన్ని మాకు ఇవ్వాలి. ఈ క్షణంలో మరో విల్లు సృష్టించి ఇస్తాము. దాని ప్రకారం ఆ ఆస్తి నీకు సుశీలాదేవి రాసిన దాని కంటే మరో ఇరవై అయిదు వేలు ఎక్కువుంటుంది. అంటే

నీకు లక్ష. మిగితాది శ్రీధర్ పేర రాయబడుతుంది."

నవ్వాడు రవిధర్. "నీవు నిజంగా ఫూల్ వి. సంతకం ఎలా చేయిస్తావు?"

విశాల చురుకుగా అతని కళ్ళల్లోకి చూసింది. రాజుని వేలితో చూపి అంది:

"నీకు అంత శ్రమ అవసరంలేదు. ఇతను ఫోర్జరీలో దిట్ట. ఇతన్ని మించినవాడు లేడు ఈ లోకంలో" అని రాజువైపు తిరిగి సంజ్ఞ చేసింది.

నవ్వాడు రాజు. "మిస్టర్ రవిధర్, మీరు దీనిమీద సంతకం చెయ్యండి" అని ఓ చిన్న కాగితం ఇచ్చాడు.

రవిధర్ దాని మీద తన సంతకం చేసాడు. రాజు మరో చిన్న కాగితం మీద రవిధర్ సంతకాన్ని పరీక్షగా చూసి చేసాడు. రెంటినీ షఫిల్ చేసి రవిధర్ ముందు వుంచి, "మిస్టర్ మీరు సంతకం చేసినది ఏది?" అని అడిగాడు.

రవిధర్ ఆశ్చర్యంతో చూసాడు. నిజంగా అతనికి నమ్మ శక్యం కాకుండా వుంది. రాజు నైపుణ్యానికి మెచ్చుకో లేకుండా వుండలేక పొయ్యాడు.

అది గమనించి రాజు నవ్వాడు. "గ్రహించారుగా, ఇక సందేహాలు అనవసరం. విల్లు ఇటివ్వండి."

రవిధర్ మొహం ఎర్రబడింది. "ఇడియట్స్. మీకు ఎలా ఇస్తాననుకున్నారు. ఆమె నన్ను నమ్మింది. ఆమెకు ద్రోహం చెయ్యలేను. ప్లీజ్ గెటవుట్" అరిచాడు.

విశాల తాపీగా అంది. "రవిధర్ ఇది విను" అంటూ టేప్ రికార్డర్ తీసి బల్లమీదుంచి ఆన్ చేసింది.

"నాకు నమ్మకం కల్గటంలేదు నీ మాటలమీద. సుశీలా దేవి నాకు అంతడబ్బు ఎందుకు ఇస్తుంది? ఆమె పిసినారి అని

నాకు బాగా తెలుసు. నిజానికి ఆమె అంటె నాకు అసహ్యం. ఏదో సంపాదనకోసం పనిచేస్తున్నాను ఆమె దగ్గర.''

టేప్ రికార్డర్ బటన్ నొక్కింది. రికార్డు తిరగటం ఆగిపోయింది. రవిధర్ నోటమాట రాలేదు.

''ఎప్పుడు రికార్డు చేశావు?'' అసహనంగా అడిగాడు.

విశాల నవ్వలేదు. ''నీవు ఎదురు తిరుగుతావని నాకు తెలుసు. అందుకే నీ డైలాగ్స్ రికార్డు చేసాను. ఇది సుశీలాదేవికి వినిపించమంటావా? నీ ఉద్యోగం వెంటనే వూడిపోతుంది.''

నిస్సహాయంగా చూసాడు రవిధర్ ఆమెవంక.

''అయితే చెప్పు నన్ను ఏం చెయ్యమంటావ్?''

విలాసంగా నవ్వింది విశాల. ''దట్స్ గుడ్! విల్లు ఏది?'' అడిగింది.

రవిధర్ డ్రాయర్ సొరుగులాగి విల్లుతీసి ఆమెకి అందించాడు. దాన్ని రాజుకి ఇచ్చింది.

ప్రక్కనేవున్న టైప్ రైటర్ మీద క్రొత్తవిల్లు సృష్టించి దానిమీద సుశీలాదేవి సంతకాన్ని ఫోర్జరీ చేశాడు రాజు. ఇప్పుడతనికళ్ళు గర్వంగా మెరిసిపోతున్నాయి.

నకిలీ విల్లుని రవిధర్ కి ఇచ్చాడు రాజు.

''మిస్టర్ రవిధర్! దీన్ని యథాప్రకారంగా తీసుకువెళ్ళి బాంక్ వాళ్ళకి అప్పగించెయ్. అసలు వీలునామా మావద్దనే వుంటుంది. నీకు సుశీలాదేవి రాసిందానికంటె ఇరవైఐదువేలు ఎక్కువే రాశాము. థాంక్స్ నీవు చేసిన సహాయానికి'' విలాసంగా నవ్వుతూ లేచి నిలబడింది విశాల.

''మిగతా పథకం ఆలోచించాలి. వస్తా'' అంటూ బయటికి నడిచింది విశాల. ఆమెని అనుసరించాడు రాజు.

''యూ! డర్టీ క్రీచర్!'' గొణిగాడు రవిధర్.

తన చేతిలోని వీలునామావంక ఓసారి చూసాడు. తను నిజంగా నమ్మకద్రోహి. సుశీలాదేవికి అన్యాయం చేస్తున్నాడు తను. పోలీసుల సహాయం కోరుదామా అని, ఆలోచించాడు అతను.

లాభంలేదు. అసలు విల్లు బయటికి ఎలా వచ్చిందని అడుగుతారు. అంతా బయటికివస్తుంది. తన ఉద్యోగం పోతుంది. నేరానికి శిక్ష తప్పదు.

అశాంతితో జుట్టు పీక్కున్నాడు.

తను పూర్తిగా ప్రమాదంలో కూరుకుపోయాడు. పోలీసుల సహాయం కోరినా లాభంలేదు. విశాల దగ్గిర టేప్ రికార్డు గుర్తుకు వచ్చి అతను గిజగిజ లాడిపోయాడు. తను పూర్తిగా ఏదో విషవలయంలో చిక్కుకున్నట్లు గ్రహించాడు.

# 6

రవిధర్ టేబుల్ మీదున్న కాగితాల్ని దీక్షగా చూస్తుండగా బల్ల మీదున్న ఫోను మోగింది.

రిసీవరు అందుకున్నాడు.

"నేను విశాలని. వీలు బాంక్ కి అప్ప చెప్పావా?"

పళ్ళు కొరికాడు రవిధర్. "నీవు రాక్షసివి. నా గొంతు పట్టుకున్నావు" అరిచాడు అతను.

"హ! నేను రాక్షసినే. జ్ఞాపకం వుంచుకో. పని జరిగిందా? లేకపోతే ఈ రాక్షసి ఎంతకైనా తెగిస్తుంది."

నీరసంగా అన్నాడు రవిధర్ "వీలు బాంక్ లో వుంది."

"దట్స్ గుడ్! యూ ఆర్ ఎ వెరీగుడ్ బాయ్" నవ్వి రిసీవరు పెట్టింది విశాల.

రవిధర్ ఆలోచిస్తూ రిసీవరు వుంచాడు.

అతని కళ్ళు ఎర్రగా వున్నాయి. యజమానురాలికి ద్రోహం

చేశానని అతను అమిత బాధపడుతున్నాడు. వారం రోజు లున్నుంచి ఇంటికి వెళ్ళటం మానేసాడు. క్లబ్‌లో గడిపి స్నేహితుడి ఇంటికి వెళ్తున్నాడు రోజూ.

మధ్యాహ్నం రెండుగంటల ప్రాంతంలో రవిధర్‌కి సుశీలాదేవినుండి ఫోను వచ్చింది.

"యస్. మేడమ్! మీ ఆరోగ్యం ఎలా వుంది?" వినయంగా అడిగాడు.

."రవీ! నా ఆరోగ్యానికి ఏమిటిగాని, నీతో ఓ చిన్న పని వుంది."

"చెప్పండి మాడమ్."

"రవీ! నీకు తెలియకుండా ఈ పని చేసినందుకు నీ చందమామలాంటి మొహం చిన్నబుచ్చుకోకు. వారం క్రితం నేను వీలునామా రాశాను. ఈ విషయం నీకు తెలియదు."

అతను వూపిరి బిగపట్టి వింటున్నాడు.

"అందులో నీకు కొంత చెందేట్లు రాశాను. మన లాయరు చాలా మంచివాడు. ఎంత కాలంగానో మన మంచి చెడ్డలు చూస్తున్నాడు. అతనికి ఏమీ ఇవ్వకపోతే ఏం బావుంటుంది చెప్పు."

"అవును. బాగుండదు" నసిగాడు.

"అందుకే అతనికి ఓ అయిదు వేలు రాయాలనుకుంటున్నాను. వీలునామా సుశీల్ బాంక్ లాకర్లో వుంది."

రవిధర్ ఒంట్లో నెత్తురు వేగంగా ప్రవహించసాగింది.

"దయచేసి సాయంత్రం నీవు వచ్చేటప్పుడు పర్మిషన్ లెటర్ తయారుచేసి తీసుకురా సంతకం పెడతాను. బాంక్ నుండి వీలు తెద్దువుగాని."

"అలాగే" రిసీవరు పెట్టాడు అతను.

ఆలోచిస్తూ వుండిపోయాడు అతను.

# 7

"ఇదేమిటి గదినిండా ఇంత దుమ్ము" అడిగింది విశాల టేబుల్ మీదనుంచి తన చేతిని తీసి అంటిన దుమ్ముని రుమాలుతో తుడుచుకుంటూ.

"వారం రోజులనుండి ఇంటికి రావటం లేదు. వ్రూద్దే వాళ్ళు ఎవరున్నారు?" బెడ్ రూంలోకి దారి తీశా డతను.

"ఏమిటి? ఇంత అర్జంటుగా ఫోను చేశావు" అడిగింది.

రవిధర్ నెమ్మదిగా అన్నాడు. "సుశీలాదేవి తన వీలునామా బాంక్ నుండి తెమ్మని చెప్పింది. లాయర్ కి కొంత డబ్బు చెందేట్లు రాయాలిట. ఇప్పుడు గుట్టంతా బయటికి వస్తుంది. మీ మాటలు నమ్మాను" అతని కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

"ఛస్! ఆడదానిలా ఏడవక" అర్చిందామె.

"ఇంతకీ ఈ పరిష్కారం ఎలా చేస్తావు?"

"ఆలోచిస్తున్నాను" అని ఫోను దగ్గరికి నడిచి ఫోను చేసింది.

"ఎవరికి ఫోను చేసావు?"

"రాజుకి. అతని సహాయం కావాలి."

ఇరవై నిముషాల్లో రాజు వచ్చాడు. రవిధర్ అతనికి విషయమంతా వివరించాడు.

రాజు ఆలోచించసాగాడు. ఓ క్షణం తర్వాత రవిధర్ ని చూస్తూ, "కొంచెం కాఫీ కావాలి" అన్నాడు.

రవిధర్ కోపంగా అతనివంక చూస్తూ "నౌకర్లు ఎవ్వరూ లేరు" అర్చాడు.

"ఫరవాలేదు. నువ్వు తీసుకురా."

ఏదో అనబోయి ఆగాడు అతను. అర్థమయినట్లు తలూపి, ఫ్లాస్క్ తీసుకుని వెళ్ళిపోయాడు.

"ఇప్పుడు చెప్పు. నీ అయిడియా" అంది విశాల.

రాజు నెమ్మదిగా అన్నాడు: "ప్రమాదంలోంచి బయట పడాలంటే ఒక్కటే మార్గం. సుశీలాదేవిని తొలగించాలి."

ఉలిక్కిపడింది విశాల. "రాజూ నీకు ముందే చెప్పాను. హత్యలు చెయ్యవద్దని" అర్చింది.

"ష్! అరవక! ఇంతకంటె మార్గంలేదు. లేకపోతే శ్రీధర్ పేర్న రాసిన ఆస్తి విషయం, నకలు 'వీలునామా' అంతా ఆమెకి తెలుస్తుంది. అప్పుడు మనం అంతా శాశ్వతంగా కట కటాల వెనుక వుంటాము" కరుకుగా అన్నాడు.

విశాల వణుకుతూ అతనివంక నిస్సహాయంగా చూసి అంది. "చెప్పు, నీ ప్లాను ఏమిటి?"

"ఆ విషయం నాకు వదిలెయ్. మామూలుగా నీ డ్యూటీ నువ్వు చెయ్. అన్నట్లు అసలు వీలునామా నీ దగ్గరే వుంది కదూ?"

తలూపింది ఆమె. "ముందు దాన్ని నాశనం చెయ్యాలి.." అంటుండగా రవిధర్ కాఫీతో వచ్చాడు. లోనికి వెళ్ళి మూడు కప్పులు తెచ్చి, కాఫీ పోసాడు. ఇద్దరికీ. ఆఫర్ చేసి, తనూ ఓ కప్పు అందుకున్నాడు.

హఠాత్తుగా కాఫీ తాగడం ఆపి రాజు అన్నాడు: "మిస్టర్ రవిధర్! మేము ఓ పథకం ఆలోచించాము. దాంట్లో నీ సహాయం కావాలి. నీవు చేయాల్సింది ఒక్కటే పని. ఈ రాత్రికి సుశీలాదేవి దగ్గరికి వెళ్ళి ఏదో అర్జంటు పని వుందనీ బెజవాడ వెళ్ళాలనీ చెప్పు. ఒప్పించటం నీ బాధ్యత. కానీ

నీవు బెజవాడ వెళ్ళవు. బేగంపేటలో నా స్నేహితుడి ఇల్లు ఒకటి వుంది. ఎల్లుండిదాకా నీవు అక్కడ వుంటావు. ఎల్లుండి రాత్రి 10 గం ప్రాంతంలో నీవు సుశీలాదేవి ఇంట్లో వుంటావు. అర్థమయిందా?"

తలూపాడు రవిధర్.

"ఇంతకీ మీ ప్లాను ఏమిటి?"

"అది నీకు అనవసరం. నేను చెప్పిన విషయాలు మరువక. ఉరిత్రాడు నీ గొంతుకు బిగుసుకునేట్లు ప్రవర్తించకు" తాపీగా అన్నాడు రాజు.

విశాల రాజు వంక చూస్తూంది.

"విశాలా!" రాజు చెప్పటం ప్రారంభించాడు. "ఎల్లుండి సాయంత్రం నీవు సుశీలాదేవిని టెర్రస్ మీదకి తీసుకు వెళ తావు. సరిగ్గా 9-15 ప్రాంతంలో తలుపు తట్టిన చప్పుడవు తుంది. ఓ అతను లోనికి వస్తాడు. 'అంతా సవ్యంగా వుందా?' అంటాడు. 'ఆఁ!' అని అతన్ని లోనికి వెళ్ళటానికి అనుమ తించు. ఇది నీవు చేయవల్సిన పని. దీంట్లో ఏదైనా పొర బాటు జరిగిందా, మనందరికీ ఉరిత్రాడు తప్పదు."

మవునంగా తలూపింది.

"కమాన్ రవిధర్. నీవు మాతోపాటు బయలుదేరు. ఈ రాత్రి సుశీలాదేవి గార్ని అడిగి వెళ్ళతావు" అన్నాడు రాజు.

రాజు తలూపాడు.

ముగ్గురూ బయటికి వచ్చారు.

## 8

"ఏమిటి అర్ధరాత్రి గొడవ" అంటూ విసుగ్గా తలుపుతీసి అలాగే వుండి పోయాడు మధుమూర్తి.

ఎదురుగా వున్న పోస్ట్‌మెన్ అందించిన టెలిగ్రామ్ అందు

కుని సంతకం చేసాడు.

పోస్ట్‌మెన్ వెళ్ళిపోయాక తలుపులు వేసి ఆలోచనలో మునిగిపోయాడు.

దాదాపు ఆరునెల్లుగా తనకు ఉత్తరాలుగాని, మరేలాంటివి గానీ లేవు. అలాంటిది ఈ టెలిగ్రాం ఏమిటి అకస్మాత్తుగా.

నెమ్మదిగా దాన్ని చింపాడు.

“మధుమూర్తి! స్టార్ట్ ఇమ్మీడియట్లీ. మీట్ ఎట్ హైద్రాబాద్ రైల్వేస్టేషన్—రాజు.”

నిదానంగా దాన్ని పరిశీలించాడు. ఈ రాజు ఎవ్వరో క్షణంపాటు జ్ఞాపకం రాలేదు. తనతో జైలులో గడిపిన మిత్రుడు అయివుంటాడు. జ్ఞాపకం చేసుకోగానే చటుక్కున 'రాజు' జ్ఞాపకం వచ్చాడు.

అవును. అతనే సందేహంలేదు. కాని అకస్మాత్తుగా ఏమిటి ఈ టెలిగ్రాం.

బహుశా, అతనికి ఏ విషయంలోనైనా తన అవసరం వచ్చిందేమో?

కాని తను దొంగతనాలు గాని, హత్యలు గాని చెయ్యటం మానేశాడు. నిజాయితీగా బ్రతుకుతున్నాడు. మరి ఏ విషయంలో అతనికి సహాయ పడగలడు తను.

కాని తను ఎలాగైనా అతనికి సహాయపడాలి. అతను తనకు చేసిన మహోపకారానికి ప్రతిఫలంగా ఏమైనా చెయ్యాలి.

చివరికి ఓ నిశ్చయానికి వచ్చాడు. బెజవాడలో హైద్రాబాదు పోయే బండి రాత్రి 12.30కి వుంది. దాంట్లో వెళ్ళిపోవాలి అనుకున్నాడు మధుమూర్తి.

# 9

రైలు ఆగగానే ఫస్ట్‌క్లాసు కంపార్టుమెంటులోంచి ఠీవిగా దిగాడు మధుమూర్తి.

మధుమూర్తిని చూడగానే రాజు ఆ వైపుకి నడిచాడు. ఒకర్ని ఒకరు చూచుకుని తృప్తిగా నవ్వుకున్నారు.

“మధూ! నీవు వస్తావో, లేదో అని భయపడ్తున్నాను” చెప్పాడు రాజు.

“రాజూ!” బాధగా అన్నాడు మధు. “ఇది నీవు నిలబెట్టిన ప్రాణం. నీకే అంకితం.”

రాజు అతని భుజం తట్టాడు. “నాకు తెల్సు మధూ నీ మనస్సు. వూరికే అన్నాను” అని అతనివైపు ఓసారి పరీక్షగా చూసి “ఏమిటి పూర్తిగా మారిపోయావు. ఏదైనా పెద్ద మాగ్నెట్‌ని పట్టావేమిటి?”

నవ్వాడు మధుమూర్తి. “లేదు. దొంగతనాలు, హత్యలు మానేశాను. నిజాయితీగా బ్రతుకుతున్నాను. సుఖంగా వున్నాను” ఠీవిగా నవ్వాడు.

ఆశ్చర్యంగా చూసాడు రాజు, “దొంగతనాలు మానావు మరి నీ సహాయం నాకు లేదా?”

“నీవు నన్ను అర్థం చేసుకోలేదు”మధుమూర్తి అర్చాడు.

“సరే! తర్వాత మాట్లాడుకుందాం! ఏదైనా హోటల్‌కి పోదాం” అని రాజు బయటికి దారితీశాడు.

ఇద్దరూ అరగంటలో హోటల్ ‘జనతా’కి చేరారు. మధుమూర్తి పేర ఓ సింగిల్ రూం తీసుకున్నాడు రాజు.

రూంలోనికి రాగానే మధుమూర్తి కుర్చీలో చతికిలబడి “అసలు విషయం చెప్పు” అన్నాడు.

రాజు తలుపు గడియవేసి లోనికి వచ్చాడు. ఎదురుగా కూర్చుంటూ అన్నాడు—

"డియర్ మధూ! సూటిగా విషయంలోకి దిగుతున్నాను. నీవు ఓ హత్య చేయాలి."

నిటారుగా కూర్చున్నాడు మధుమూర్తి. అతని రోమాలు నిక్కబొడుచుకున్నాయి.

"హత్యా?"

నవ్వాడు రాజు. "భయపడ్తున్నావా?"

రాజువంక సీరియస్‌గా చూస్తూ అన్నాడు మధుమూర్తి. "భయమా? కాదు. ఈ హత్యవల్ల నీకు ఏమిటి లాభమో చెప్పాలి ముందు."

రాజు వివరించాడు.

మధుమూర్తి అన్నాడు. "నీకు లాభం వుంది నిజమే. కాని, నీవూ ఒకళ్ళకి సహాయం చేస్తున్నావు. ఇందులో కొద్దో గొప్పో నీకు లాభం వుంది. కనుక నీకు సహాయం చేస్తాను. ఇదే మన చివరి కలయిక."

తల వూపాడు రాజు. "నీకూ కొంత అందుతుంది. వూరికే నిన్ను శ్రమ పెట్టడం లేదు."

మధుమూర్తి తీక్షణంగా అతని వైపు చూసాడు. "థాంక్స్ రాజూ! దేవుడి దయవల్ల నేను బాగానే సంపాదించాను. అంతా కష్టార్జితం. అన్యాయంగా వచ్చిన డబ్బును నేను తీసుకోను. నీకు కేవలం సహాయం మాత్రమే చేస్తాను."

"వద్దు మధూ! నీవలా అంటె నాకు బాధ కల్గుతుంది. ఇందులో నీవూ కష్టపడుతున్నావు. నీకూ కొంత అందాలి. పోనీ నీకు డబ్బు వద్దూ, నీవు హత్య చేసాక అక్కడవున్న కొన్ని నగల్ను పట్టుకొని నేరుగా వెళ్ళిపో."

"రాజూ! నేను మాట చెప్పానంటె దాన్ని పదిసార్లు రిపీట్ చేసే అలవాటు లేదు."

"కానీ, హత్యవిషయం పోలీసులకి తెలుస్తుంది. హత్య ఎందుకు జరిగిందని విచారిస్తారు. కనీసం 'మోటివ్' కోసం అయినా నీవు దొంగతనం చేయాలి."

"దట్స్ ఆల్ రైట్! కాని ఒక షరతు. నగలు దొంగిలిస్తాను. అవి నీకు ఇస్తాను. నాకుమాత్రం వద్దు. ఒప్పుకున్నట్లేనా?"

తలూపాడు రాజు. "సరే, నీ యిష్టం!"

"దెన్ కంటుది పాయింట్."

"నీవు సరిగ్గా రేపు సాయంత్రానికి ఇక్కడి నుండి బయలుదేరుతావు. సరిగ్గా 9.15 నిమిషాలకి సుశీలాదేవి వున్న అంతస్తులో వుంటావు. తలుపు తట్టగానే ఓ యువతి తలుపు తీస్తుంది. ఇక్కడ ఓ విషయం గుర్తుంచుకో. నీవు ఒకసారి మాత్రమే తలుపు తట్టు. రెండోసారి తట్టే ప్రయత్నం చేయక. ఒకవేళ తలుపు తెరువబడినట్లయితే 'అంతా సవ్యంగా వుందా?' అని అడుగు. 'ఆఁ!' అని నిన్ను లోనికి వెళ్ళటానికి అనుమతి ఇస్తుంది.

"సుశీలాదేవి టెర్రస్‌మీద వుంటుంది. ముందు ఆమెను చంపెయ్. అంటె పిస్తోలు ఉపయోగించవాకు. చప్పుడవుతుంది. కత్తి ఉపయోగించు. ఒక్కపోటుతో ఆమె చనిపోవాలి. తర్వాత నీవు అందినన్ని నగలు దొంగిలించటం మర్చిపోవాకు. అందుకోసరమే పోలీసులు హత్య జరిగిందనుకోవాలి అర్థమయిందా?" అడిగాడు.

మధుమూర్తి అన్నాడు, "ఒకసారి తలుపుతట్టిం తర్వాత తెరువబడనట్లయితే?"

"అవును. మర్చిపోయాను. వెంటనే క్రిందికి వచ్చేయ్. మేడ వెనక తోట వుంది. మేడ మూలగా గోడను అనుకుని ఓ స్తంబం వుంది. దాని ఆధారంగా నీవు లోనికి వెళ్ళి పని పూర్తి చేయాలి. ఎవ్వరైనా చూస్తారని భయం అవసరం లేదు. క్రింది మూడు అంతస్తులు ఏవో ఆఫీసులకి అద్దెకి ఇచ్చారు. వాళ్ళు 5 గంటలకే వెళ్ళిపోతారు. స్ట్రీట్ లైట్స్ వుంటాయని భయంలేదు. లేకుండా చెయ్యడం నా బాధ్యత. అదీగాక తోటలో చెట్లు వున్నాయి చీకటిగా వుంటుంది. అర్థమయింది కదూ?"

తలూపాడు మధుమూర్తి.

# 10

హంతకుడు సరిగ్గా 9.15 నిమిషాలకు మూడో అంతస్తులో వున్న సుశీలాదేవి గది ముందు ఆగి తన రిస్ట్ వాచీ వంక చూసుకున్నాడు.

రాజు చెప్పినట్లు సరిగ్గా 9.15 నిమిషాలకు తలుపుతట్టాలి. ఓ యువతి వచ్చి తలుపు తీస్తుందని చెప్పాడు గాని, ఆమె ఎలా వుంటుందో? ఆమె పోలికలు చెప్పలేదు. ఆమెని గుర్తు పట్టటం ఎలా? ఆమె కాక మరెవరైనా తలుపుతీస్తే?

అతను ఓ క్షణం తటపటాయించి తలుపుతట్టాడు.

కాని అదే క్షణంలో___

ప్రక్క గదిలో వున్న ఫోను గణగణమని మోగింది. ఆ మోతలో హంతకుడు తట్టిన శబ్దం విన్పించలేదు విశాలకు.

విసుగ్గా పత్రిక సోఫాలో పడేసి ఫోను రిసీవ్ చేసుకోటానికి వెళ్ళింది విశాల.

రాజు చెప్పినట్లు హంతకుడు మరోసారి తలుపు తట్టలేదు. వెంటనే తోటలోకి చేరుకుని చుట్టూ కలయచూశాడు.

కన్ను పొడుచుకున్నా కనిపించని కటిక చీకటి. ప్రక్కనున్న స్తంభం పట్టుకుని, జరజరా పైకి ప్రాకాడు.

పది నిముషాల్లో టెర్రెస్‌లో ప్రవేశించాడు.

ఓ వైపున టేప్ రికార్డర్‌లో ఏదో సంగీతం వింటున్న సుశీలాదేవి అదిరిపడి హంతకుడువంక చూసింది.

హంతకుడు వికటంగా నవ్వాడు.

జేబులోంచి చాకు తీసి "మర్యాదగా నీ ఒంటిమీదవున్న నగలు తియ్" అన్నాడతను కరుకుగా.

ఆమె మారుమాట్లాడకుండా తన నగలు ఇచ్చింది.

అతి జాగ్రత్తతో వాటిని అందుకుని ఆమెవంక చూసాడు.

ఆమె ఉద్దేశ్యం గ్రహించిన వాడిలా నవ్వాడు.

"అయ్! అర్చావా? నీ ప్రాణాలు పోతాయ్" అంటూ చాకు పైకెత్తి ఆమె వైపు రాసాగాడు.

ఆమె అతనివంక దీనంగా చూస్తోంది.

అతను చాకు ఎత్తి ఆమె గుండెల్లో బలంగా పొడిచాడు.

రక్తం జివ్వున చిమ్మింది. చిన్నగా అరుస్తూ నేల కూలింది సుశీలాదేవి.

నవ్వుకున్నాడు హంతకుడు. నగలు తీసుకొని గబగబా స్తంభం పట్టుకుని క్రిందికి దిగసాగాడు.

హంతకుడయినా అతని శరీరం చమటతో నిండిపోయింది. ఓ క్షణం పాటు ఒణికిపోయాడతను. జిడ్డుగావున్న చేతులు స్తంభంపట్టు తప్పాయి.

భయంకరమైన ఆర్తనాదం చేశాడతను.

మరుక్షణం అతని శరీరం 'దభేల్' మంటూ క్రిందికి పడిపోయింది. జేబులో వున్న నగలమూట దూరంగా పడింది.

ఆ భయంకరమైన ఆర్తనాదం విని వింటూనే విశాల పరుగెత్తుకు వచ్చింది.

# 11

మరోసారి సుశీలాదేవి శవాన్ని పరిశీలనగా చూసాడు క్రైమ్ బ్రాంచ్ ఇన్‌స్పెక్టర్ విష్ణుకాంత్. వెంటనే ప్రక్కనున్న టేప్ రికార్డు మీద అతని దృష్టిపడింది. సుశీలాదేవి గుండెల్లో వున్న చాకు మిరుమిట్లు గొలిపేట్లు కనబడింది విష్ణుకాంత్‌కి.

ప్రక్కనున్న సబ్ ఇన్‌స్పెక్టర్ వైపు "యస్ రిపోర్ట్" అన్నాడు హుందాగా.

విష్ణుకాంత్ సుమారు ఆరడుగుల రెండంగుళాల పొడుగుంటాడు. విశాలమైన ఛాతీ. కండలు తిరిగిన శరీరం, బలిష్టంగా వుంటాడు. స్వల్ప వ్యవధిలోనే పై అధికారుల నుండి మెప్పు గడించాడు.

"సరిగ్గా 10 గంటల 10 నిముషాలకి స్టేషనులో వున్న ఫోను మ్రోగింది. క్షణం ఆలస్యం కాకుండా వెంటనే ఇక్కడికి చేరుకున్నాను. ఫోను చేసింది వీరు. వీరిపేరు విశాల."

తలూపాడు విష్ణుకాంత్ చెప్పమన్నట్లుగా.

"పరిస్థితులన్నీ గందరగోళంగా కన్పించాయి సార్. ఇక్కడ చూడండి రక్తపు చుక్కలు. ఇది నేరుగా టెర్రెస్ మూలగా దారి తీసాయి. క్రిందికి వెళ్ళి పరిశీలించాము. క్రింద ఓ అతని శవం వుంది. బహుశా హంతకుడై వుండవచ్చు. హత్యచేసి క్రిందికి దిగుతుండగా పట్టుతప్పి వుంటుంది. అతని శవానికి దూరంలో ఓ చిన్న మూట పడి వుంది. అందులో నగలున్నాయి. బహుశా అతను దొంగ అయి వుండొచ్చు. సుశీలాదేవి అతనిని చూడగానే అరిచే ప్రయత్నం చేసివుండొచ్చు.ఆమెకి సరిగ్గా కళ్ళు కనపడవు.మసగ్గా కన్పడు

తాయి. అతన్ని గుర్తుపట్టి వుండదు. అలాంటప్పుడు అతను పారిపోయి వుండవచ్చు. అదీగాక అతను కేవలం ఆ నగల కోసమే హత్య చేసాడంటే నమ్మశక్యంగా లేదు. నగల విలువ నాలుగైదు వేలకు మించి వుండదు'' వివరించాడు ఎస్. ఐ. మిస్టర్ స్కాట్.

''గుడ్ వర్క్ మిస్టర్ స్కాట్! అవును మీరు చెప్పింది సబబుగానే కన్పిస్తూంది'' అని అంటుండగా రవిధర్ లోనికి ప్రవేశించాడు. 'ఎవరు?' అన్నట్లుగా విశాల వంక చూశాడు.

''ఈయన రవిధర్. సుశీలాదేవిగారి దూరపు బంధువు, సెక్రటరీ. ఆవిడ వ్యవహారాలన్నీ ఈయనే చూస్తున్నారు.''

రవిధర్ అవాక్కయి నిలబడి పోయాడు. ఇలాంటి సంఘటన అత నూహించి వుండడు. ఇన్‌స్పెక్టర్ విష్ణుకాంత్ మాటలతో ఈ లోకంలోనికి వచ్చిపడ్డాడు.

''ఏమిటి?'' అడిగాడు.

అంతలో పోలీస్ డాక్టర్ శవ పరీక్ష ముగించి వచ్చాడు.

''డాక్టర్ హత్య ఎప్పుడు జరిగిందో చెప్పగలరా?''

''ఐయామ్ సో సారీ. హత్య జరిగింది ఎప్పుడో చెప్పలేను. కాని, ఈమె ప్రాణం సరిగా 9.30కి పోయింది'' అన్నాడు.

''కత్తి మీద ఎలాంటి వేలి ముద్రలు లేవు'' అన్నాడు వేలిముద్రల నిపుణుడు.

''ఆల్ రైట్ మిస్టర్ స్కాట్. నేను ప్రక్క గదిలో వుంటాను. ఒక్కొక్కరిని లోనికి పంపు'' అని వెనక్కి తిరగబోతూ, గోడకివున్న ఓ ఫోటోని చూసాడు. ''ఎవరు ఇతను?'' అడిగాడు. అతని కుడి చేతిమీద పాము బొమ్మ పచ్చబొట్టు వేసి వుంది.

''ఇతను సుశీలాదేవి అన్నగారి కుమారుడు శ్రీధర్'' అని

వివరించాడు రవిధర్.

విష్ణుకాంత్ తలవూపి ప్రక్క గదిలోనికి వెళ్ళాడు.

ముందుగా విశాల గదిలోకి ప్రవేశించింది.

"మీరూహించగలరా, ఈ హత్య ఎవరు చేశారో" అడిగాడు ఆమెను చూస్తూ.

బిత్తరబోతూ అతని వంక చూసింది విశాల. "నాకు తెలీదు" చెప్పింది.

"ఆల్ రైట్. సుశీలాదేవి మీకు బంధువా?"

విశాల తన చరిత్ర చెప్పింది, తమ ప్లాన్ తప్ప.

"అలాగా! మీరు స్టేషన్‌కి ఫోన్ చేసినప్పుడు సమయం 10.10 అని మీరు ఒప్పుకున్నట్టేనా?"

మవునంగా వుండి పోయిందామె.

"చెప్పండి" అడిగాడు.

విశాల మాట్లాడలేదు.

"చూడండి విశాలా! హత్య ఎప్పుడు జరిగిందో చెప్పలేదు డాక్టర్. కాని ప్రాణం సరిగ్గా 9.30కి పోయిందని డాక్టర్ రిపోర్ట్. మీరు సరిగ్గా 10.10కి ఫోను చేశారు. అంటే హత్య జరిగాక నలభై నిముషాల తర్వాత ఫోను చేశారు. అంతవరకూ మీరు ఏమిటి చేస్తున్నట్లు?"

"9.15కి భోజనం చేసి సోఫాలో కూర్చున్నాను. వెంటనే నిద్ర పట్టేసింది. సుశీలాదేవిగారు టెర్రెస్‌లో వున్నారు. ఆమెని లోనికి తీసుకు రావాలన్న విషయం నాకు బాగా గుర్తు. కాని నేను నిద్రపోయాను. ఎందుకో మెళుకువ వచ్చి చూసాను. అప్పటికే ఆమె చనిపోయివుంది."

"బాగా నిద్రపోయారా? అది సరే. హత్య జరిగినప్పుడు సుశీలాదేవి అర్చివుండాలి. మీకు అలాంటిది ఏదైనా విన్పించిందా?"

అడ్డంగా తలూపిందామె.

"బాగా గుర్తు చేసుకోండి! మీకు ఆ సమయంలో ఎందుకు మెలుకువ వచ్చింది?"

"గొంతులో తడారి పోయింది. మంచినీళ్ళ కోసరం లేచాను" అందామె తడుముకోకుండా.

"9.15కి భోజనం చేసిన మీకు ఆ సమయంలో గొంతులో తడారి పోవటం ఆశ్చర్యంగా వుంది. ఆల్ రైట్ రవిధర్ గురించి మీ అభిప్రాయం ఏమిటి?"

"అతనితో నాకు అంతగా పరిచయం లేదు."

"దట్స్ ఆల్ రైట్! మీరిక వెళ్ళచ్చు."

ఆమె వెళ్లబోతుండగా విష్ణుకాంత్ అన్నాడు. "చూడండి విశాలా! సుశీలాదేవిగారు వీలు లాంటిది ఏమైనా రాశారా?"

"నాకు తెలీదు" టక్కున సమాధానం చెప్పి, బయటికి వచ్చేసిందామె.

తర్వాత రవిధర్ వచ్చాడు.

"మిస్టర్ రవిధర్. ఈ హత్య మీరు చేశారంటే దీనికి సమాధానం?" సూటిగా చూస్తూ అడిగాడు ఇన్స్పెక్టర్ విష్ణుకాంత్.

రవిధర్ కళ్ళల్లో ఓ క్షణం భయం తొంగి చూసింది. కాని వెంటనే "మీకు మతి పోయిందంటాను" అన్నాడు తడుముకోకుండా.

"గుడ్! ఆధారాలతో నిరూపించేసరికి మీకు నిజంగానే మతిపోతుంది. దటీజ్ ఆల్ రైట్! మీరు ఇక్కడ ఎంత కాలంగా వుంటున్నారు?"

"సుమారు ఎనిమిది సంవత్సరాలుగా పనిచేస్తున్నాను."

"హత్య జరిగిన సమయంలో మీకు ఎలిబీ వుందా?"

"అసలు నాకు ఈ హత్య జరిగిందని తెలీదు. మొన్న సుశీలాదేవిగారిని పర్మిషన్ అడిగి విజయవాడ వెళ్ళాను. అఫ్ కోర్స్. అది నా స్వంత పని అనుకోండి. నేను అక్కడికి వెళ్ళిం తర్వాత సుశీలాదేవిగారికి ఉత్తరం కూడా రాశాను. ఈ రోజు వస్తున్నట్లు."

"విజయవాడ ఎందుకు వెళ్ళవలసిందో చెప్పగలరా?"

"చెప్పానుగా అది నా పర్సనల్ మాటర్ అని."

"దట్స్ ఇట్! మీకు ఎలిబీ లేదు. మిమ్మల్ని అనుమానించ టంలో తప్పు లేదనుకుంటాను. సుశీలాదేవిగారు వీలులాంటిది ఏమైనా రాశారా?"

తలూపాడు రవిధర్. "సునిల్ బాంక్ లాకర్లో వుంది."

"ఆస్తి ఎవరెవరికి వ్రాయబడిందో తెల్సా?"

"ఆమె నాకు చెప్పలేదు."

"దట్స్ ఓ. కె! లాయరు ఎవరు?"

రవిధర్ గుండె క్షణంపాటు కొట్టుకోవటం మానేసింది. అసలు ఆ విషయం సంగతే మర్చిపోయాడు. రాజు గమనిం చాడో, లేదో. లాయర్ని అడిగితే తమ బండారం బయట పడిపోతుంది.

"కామేశ్వర్రావు" సమాధానం చెప్పాడు.

"ఆ విషయం మేము కనుక్కుంటాము. ఆమెని హత్య చేసేంతటి కసి ఎవ్వరికుందో వూహించండి."

"అయామ్ సారీ!"

"నెవర్ మైండ్! అది మా డ్యూటీ. మీరు చెప్పాల్సింది ఇంకేమయినా వుందా?"

తల అడ్డంగా వూపాడతను.

"ఆల్ రైట్! చివరి ప్రశ్న. సుశీలాదేవిగారింటికి మీరు

డైరెక్టుగా వచ్చామన్నారు. బెజవాడనుండి ఆమె హత్య చేయబడినట్లు తెల్సా? లేక ఆమెకి ముందు కన్పించి ఇంటికి వెళ్ళాలనుకున్నారా?"

రవిధర్ మొహంలో రంగులు మారింది. "లేదు. ఆమెని ముందుగా కల్సుకుని ఇంటికి వెళ్ళాలనుకున్నాను."

"ఈజిట్? సరే. మీ రిక వెళ్ళండి."

రవిధర్ బయటికి వెళ్ళబోతుండగా "వన్ మినిట్! దయచేసి మీ అడ్రస్ చెప్తారా?"

చెప్పాడతను.

అతను వెళ్ళాక ఎస్. ఐ. స్కాట్ లోనికి వచ్చాడు.

"మిస్టర్ స్కాట్! ప్లీజ్ సిడౌన్. ఈ ఉత్తరం చూడండి. రవిధర్ సుశీలాదేవికి వ్రాసిన వుత్తరం. బెజవాడ నుండి వ్రాశాడు. ఈ ఉత్తరం బలపరుస్తోంది, అతను ఈ వూళ్ళో వున్నాడని. పోస్టల్ స్టాంపు చూడండి."

"యస్! మిస్టర్ విష్ణుకాంత్."

"కాబట్టి హత్య చేయించటానికి అతనికి అవకాశాలున్నాయ్. మీరు వెంటనే అతనింటికి వెళ్ళేలోగా అక్కడికి వెళ్ళి పరిశోధనచేయండి. ఏమైనా క్లూస్ దొరకవచ్చు."

"యస్ మిస్టర్ ఆఫీసర్."

"దట్స్ ఆల్ రైట్! హంతకుడు ఎలాగో చనిపోయాడు. అతన్ని ఎవరు నియమించారో తెల్సుకోవటం మీ వంతు."

తలూపాడు స్కాట్.

"గుడ్! క్యారీ ఆన్."

స్కాట్ వెళ్ళిపోయాడు.

ఇన్స్పెక్టర్ విష్ణుకాంత్ గదిలోంచి బయటికి వచ్చేసరికి రవిధర్ దీనవదనంతో యజమానురాలి శవాన్ని చూస్తున్నాడు.

"అయామ్ వెరీసారీ! మిస్టర్ రవిధర్. మీకు ఈ విషయం బాధ కల్గించవచ్చు. హంతకుల్ని పట్టుకోడానికి నా శాయ శక్తులా ప్రయత్నిస్తాను."

పేలవంగా నవ్వాడు అతను. "కాని హంతకుడు కూడా హతుడయ్యాడు."

"యస్ మిస్టర్! అతన్ని నియమించిన వాళ్ళు బ్రతికే వున్నారు కదూ?"

రవిధర్ వులిక్కిపడటం గమనించాడు డిటెక్టివ్ ఇన్‌స్పెక్టర్.

పదిహేను నిముషాల తర్వాత అక్కడున్న ఫోను మ్రోగింది. అందరూ వులిక్కిపడ్డారు ఆ మోతకి. విష్ణుకాంత్ నవ్వుకుంటూ రిసీవరు అందుకున్నాడు.

అవతలనుండి వచ్చిన జవాబు విన్నాడు. అతని మొహంలో ఆశ్చర్యకరమైన సూచనలు రవిధర్, విశాలలు గమనించక పోలేదు.

"గుడ్! మిస్టర్ స్కాట్ క్యారీ ఆన్"అని రిసీవరు పెట్టి రవిధర్ వైపు చూసాడు.

"మిస్టర్ నేను లాయర్‌ని కల్సుకోవాలని పోతున్నాను. మీరూ వస్తారా?"

రవిధర్ మొహం నల్లబడింది. "నేనా? ఎందుకూ?" అని అడిగాడు తడబడుతూ.

"మీ ఇష్టం! నేను వెళుతున్నాను. ఇంకో విషయం. శవాన్ని పోస్ట్‌మార్టం కోసరం తీసుకువెళుతారు పోలీసులు. మీరు ఇక్కడ్నించి నా అనుమతిలేందే ఎక్కడికీ వెళ్ళటా నికి వీలులేదు" కఠినంగా అన్నాడు విష్ణుకాంత్.

# 12

కాలింగ్ బెల్ రెండు సార్లు మ్రోగించినా ఎవరూ తలుపు తీయకపోవటం విసుగనిపించింది ఇన్స్పెక్టర్ విష్ణుకాంత్ కి.

తలుపు దగ్గరికి వేసివున్నా, తోసుకుని లోనికి వెళ్ళటం సభ్యత కాదని ఓ క్షణం సంకోచించాడు. చివరిసారి మరో మారు బెల్ నొక్కాడు. ఫలితం శూన్యం.

ఇక సందేహించలేదతను. వెంటనే తలుపు తోసుకుని లోనికి అడుగుపెట్టాడు.

గది మధ్యలో గాడ్రెజ్ టేబులుంది. దానిమీద ఏవో కొన్ని ఫైల్స్ వున్నాయి. ఆ గదిలో ఎవ్వరూ లేరు. ఆ గదికి అనుకుని మరోగది వుంది. బహుశా, అది బెడ్ రూం కావచ్చు అనుకున్నాడు.

"మిస్టర్ కామేశ్వర్రావు" పిలిచాడు అతను. సమాధానం లేదు.

ఒక్క అంగలో బెడ్ రూంలోకి చేరుకున్నాడు. ఎదురుగా కన్పించిన దృశ్యాన్ని చూస్తూనే కొయ్యబారిపోయాడు.

కామేశ్వర్రావు బెడ్ మీద వెల్లికిలాపడివున్నాడు. గుండెల్లోని బాకు కొట్టవచ్చినట్లు కన్పిస్తూంది.

'డామిట్! వూహించలేకపోయాను' అనుకున్నాడు.

అంతలో వెనక సన్నగా ఎవరో నవ్వినట్లయింది. వెను తిరగబోయాడు.

అంతలో —

గదిలో వెలుగుతున్న లైటు చటుక్కున ఆరిపోయింది.

"మిస్టర్ ఆఫీసర్! వెనక్కి తిరిగినా నేను కన్పించను, దయచేసి ఆ ప్రయత్నం మాత్రం చెయ్యవద్దు. బహుశా, నా

చేతిలో వున్న పిస్టల్ ఈ చీకట్లో మీకు కన్పించటం అసంభవం. అనవసర ప్రయత్నాలు మానండి. ప్రాణాలమీద ఆశ వదులుకుంటె ఇక మీ ఇష్టం."

డిటెక్టివ్ ఇన్‌స్పెక్టర్ నెమ్మదిగా అన్నాడు.

"నన్ను బెదిరించాలనా నీవు ఇక్కడ వున్నది?"

"ఆ అవసరం నాకు లేదు. హత్యచేసి వెళ్దాం అనుకునేంతలో మీరు వచ్చారు. కాబట్టి తప్పలేదు. ఆఁ! కదులుతున్నారు. దయచేసి కదలకండి! మీరేం చేసినా నాకు కన్పిస్తున్నది."

"నీవేనా హంతకుడివి!"

సమాధానం లేదు. వెనక అడుగులు వేస్తున్న శబ్దం నెమ్మదిగా విన్పిస్తూంది. విష్ణుకాంత్ మనసు ఉరకలు వేసింది. పాము చెవులు విష్ణుకాంత్‌వి. హంతకుడు శ్వాస, నిశ్వాసలు లీలగా విన్పించాయి. హంతకుడు చేరువ అవుతున్నాడు.

హఠాత్తుగా వెనక శ్వాస పీలుస్తున్న శబ్దం ఆగిపోయింది

హంతకుడు వూపిరి బిగపట్టాడు అనుకున్నాడు. బహుశా తనని తలమీద కొట్టబోతున్నాడేమో? లేక చంపబోతున్నాడా?

తెగించాడు. హంతకుడు ఎన్ని హత్యలైనా చెయ్యడానికి వెనుదీయడు.

విష్ణుకాంత్ మొహం కఠినంగా మారిపోయింది. ఇక తను తెగించాలనుకున్నాడు. చటుక్కున వెనుదిరిగా డతను.

అతనూహించినట్లు తలమీద దెబ్బ పడలేదు. పిస్తోలూ పేలలేదు.

జరిగింది గ్రహించా డతను.

నవ్వుకున్నాడు విష్ణుకాంత్ తన అంచనాలు తప్పయినం

ముకు. హంతకుడు పారిపోయాడు.

మొదటిసారి పొటబాటుపడ్డాడు అతను. అంతలో కర్తవ్యం గుర్తుకు వచ్చింది. గోడనున్న 'స్విచ్'కోసరం తడిమాడు.

బల్బ వెలగగానే ఒక్కసారి మిరమిట్లుగొలిపే కాంతి వచ్చింది గదిలోనికి.

విష్ణుకాంత్ ఒక్కసారి కామేశ్వర్రావు శవాన్ని పరిశీలనగా చూసాడు.

రక్తంకారి అంతా బెడ్‌లోనికి ఇంకిపోయింది. హత్య జరిగి ఎక్కువసేపు కాలేదు. గాయంనుండి ఇంకా రక్తం కారుతూనే వుంది.

ఇక ఆలస్యం చెయ్యదల్చుకోలే దతను. తనకి పనికివచ్చే ఆధారాలు ఏమైనా దొరుకుతాయా, అని గది నలుమూలలా చూసాడు. అంతలోనే అతనికి స్ఫురించింది. సుశీలాదేవి వీలునామాకు డూప్లికేట్ కామేశ్వర్రావు దగ్గరుండేమోనని.

అయినా వీలు ఆమె బాంక్‌లో ఎందుకు పెట్టింది? లాయర్ మీద నమ్మకం లేకనా? లేక ఇలాంటి అఘాయిత్యాలు జరుగచ్చు అని, ముందు జాగ్రత్తకోసరం అలా చేసిందా? ఇలా బాంకుల్లో దాచుకోవటం అరుదు అనుకున్నాడు.

ఇక తను అక్కడ చేయవలసింది ఏమీ లేదని గ్రహించాడు. ముందు గదిలోనికి వచ్చి గోడవారగానున్న అల్మారా దగ్గరికి నడిచాడు.

ఎంత వెదికినా 'డూప్లికేట్' వీలు కన్పించలేదు. ఏమైంది? అసలు రాయలేదా? లేక హంతకుడు చేజిక్కించుకు పోయాడా?

ఆలోచనలతో అతని మనస్సు కొయ్యబారింది. టేబుల్

సొరుగులో వెదికి చూసాడు. లాభం లేకపోయింది. కాని అందులో వున్న ఓ వస్తువు అతన్ని ఆకర్షించింది.

దాన్ని ఆప్యాయంగా అందుకున్నాడతను.

## 13

"ఏమిటి ఇక్కడ కల్సుకోమన్నావ్" విసుగ్గా అడిగింది విశాల, రాజువంక చూస్తూ.

"తప్పలేదు విశాలా! నేను ఇంటికి వచ్చానంటే ఎవరికైనా అనుమానం వస్తుంది. అదీగాక పోలీసులకి సుశీలాదేవి హత్యపై అనుమానంగా వుంది. అందుకే ఇక్కడికి రమ్మన్నాను" అన్నాడు రాజు విశాలవంక అదోలా చూస్తూ.

"సరేలే! చెప్పు విషయం ఏమిటో."

రాజు మొహంలో రంగులు మారాయి. "విశాలా! మనం ఎంతో కష్టపడ్డాము ఈ ఆస్తిని సంపాదించాలని. హత్య చెయ్యటానికికూడా వెనుకాడలేదు. కాని మన ఈ ప్రయత్నమంతా బూడిదలో పోసిన పన్నీరయింది." విషాదంగా అన్నాడు.

విశాల ఆత్రంగా అతని మొహంలోనికి చూసింది.

"చెప్పు జరిగింది ఏమిటో?"

"తట్టుకోగలవా?"

అనుమానంగా చూసిందామె "కొంపదీసి శ్రీధర్‌కి ఏమీ కాలేదు కదూ?"

బాధగా అన్నాడతను. "కాకపోతే బాధలేదు విశాలా! కాని శ్రీధర్‌కి ఆక్సిడెంట్ అయింది. ఇక అతను మనకు లేడు."

"అబద్ధం!" పిచ్చిగా అరిచిందామె!

విశాల ఏడుస్తూంది. హృదయవిదారకంగా రోదిస్తూం

దామె. విశాల శ్రీధర్‌ని ప్రేమించి పెళ్ళిచేసుకుంది. తన ప్రాణపదంగా ప్రేమించిందామె.

కొంతసేపటికి వెక్కిళ్ళతో అందామె: "నమ్మలేను రాజూ! శ్రీధర్‌కి ఆక్సిడెంట్ ఎందుకయింది? అతను చిన్న పిల్లవాడు కాడు. కాని వట్టి అమాయకుడు" నిప్పులుకురిసే కళ్ళతో చూస్తూంది ఆమె. "అర్థమయింది రాజూ! నీపన్నాగం. ఎలాగూ ఆస్తి శ్రీధర్‌ది. నేను అతనికి భార్యను. అతని తర్వాత ఆస్తి ఎలాగూ నాకు వస్తుంది. నీకు నేను కావాలి" ఛీత్కారం చేసిందామె.

"విశాలా!" బాధగా అన్నాడతను. "నన్ను నమ్ము."

హేళనగా నవ్విందామె. "నిన్నా! నమ్మమంటావా?"

"విశాలా!" రాజు ఏదో చెప్పబోయాడు.

"షటప్" గర్జించిందామె. "నీ అంతు ఏమిటో చూస్తాను" అని చరచరా వెళ్ళిపోయింది.

# 14

మంచంమీద పడుకుని వున్న రవిధర్, విశాలని చూసి చిన్నగా నవ్వాడు. ఆమెను ఏదోవిధంగా లొంగదీసుకోవాలని రవిధర్ ప్లాను.

విశాల చనువుగా వచ్చి రవిధర్ ప్రక్కన కూర్చుంది. ఆశ్చర్యంగా చూసాడు ఆమెవంక.

కొంతసేపు ఎవరూ మాట్లాడలేదు. చివరికి విశాల అంది: "రవిధర్! నీ ప్రాణం నా దగ్గిర వున్న సంగతి నీవు మర్చిపోలేదనుకుంటాను."

తాపీగా అన్నాడు రవిధర్. "ప్రస్తుతం ఆ విషయమే ఆలోచిస్తున్నాను. ఏమిటి విషయం?"

"నీ ప్రాణాన్ని నీకు ఇవ్వటానికి నేను సిద్ధమే. దాంతో

పాటు నా ప్రాణాన్ని నీకు కానుకగా అర్పిస్తాను. కాని నీవు నాకు ఓ సహాయం చేయాలి.''

నిటారుగా కూర్చున్నాడు అతను. అతని మొహంలో రంగులు మారాయి. ''ఏం మళ్ళీ దేంట్లో అయినా ఇరికించదల్చావా?''

నవ్విందామె. ''నీవు ఇంత పిరికివాడివని నాకు తెలీదు. మరి నీవు నాకు సహాయం ఏమి చేయగలవు?''

''నీకు ఎలాటి సహాయం కావాలో చెప్పు ముందు.''

''మైడియర్, రవిధర్! నేను చెప్పేది పూర్తిగా విను. నీవు సుశీలాదేవి హత్య జరిగిన రోజున ఈ వూళ్లోనే వున్నావని ఇన్స్పెక్టర్కి అనుమానం కల్గింది. నిజంగా నీవు బెజవాడలో వుంటె ఇలాంటి అనుమానం వచ్చేదికాదు.ఇదంతా రాజు కుట్ర. అతను నిన్ను ఇందులో ఇరికించటానికి నిన్ను పావుగా వాడుకున్నాడు.''

అతను వింటున్నాడు.

''ఏమిటి రాజుమీద రిపోర్ట్ చేస్తున్నానని అనుమానంగా వుందా? రవీ! నేను శ్రీధర్ని ఎంత ప్రేమించేనో నీకు తెలీదు.అలాంటివాడు ఆక్సిడెంట్ అయి చనిపోయాడని రాజు చెప్పాడు. నిజానికి అతను హత్యచేసి వుంటాడు. అతని తర్వాత ఆస్తికి నేను వారసురాలిని. అతనికి నన్ను పెళ్ళి చేసుకోవాలని ఆశ. అంటె ఆస్తీ కావాలి, నేనూ అతనికి కావాలి. నిజానికి నేను అతన్ని కేవలం సహాయంగా వుంచుకున్నాను.''

''అయితే ఏమిటి నీ బాధ?''

''అదే చెబుతున్నాను రవీ! ఎలాగూ నా భర్త పోయాడు. ఇక ఆస్తి అంతా నా పేర్న వస్తుంది. అఫ్కోర్స్! నేను

శ్రీధర్ భార్యనని నిరూపించుకోవాలి. నా దగ్గిర సాక్ష్యాలు వున్నాయి. కాబట్టి,రాజు అంటే నాకు ద్వేషం.అందుకే నిన్ను కోరుతున్నాను. అయితే నీవు నాకు సహాయం చెయ్యాలి."

"సహాయమా?"

"అవును రాజు నిన్ను కష్టపెట్టాడు, హత్యానేరంలో త్రోయటానికి ప్రయత్నించాడు. కాబట్టి, అటు నీ పగ తీరినట్లు అవుతుంది. నాకూ పగ తీరుతుంది. పైగా ఆ స్త్రీ, నేనూ నీ పరమవుతాము."

"అంటే, ఏమిటి చెయ్యాలి?"

"పిచ్చివాడా, ఆమాత్రం గ్రహించ లేవూ? రాజుని చంపెయ్!"

ఉలిక్కిపడ్డాడతను. "హత్యా?"

"బాగా ఆలోచించుకో! నేను మళ్ళీ కన్పిస్తాను"అంటూ రవిధర్ని ఓసారి గాఢంగా ముద్దుపెట్టుకుని వెనుదిరిగింది.

అతను ఉక్కిరి బిక్కిరయ్యాడు.

విశాల వెళ్ళిం తర్వాత రవిధర్ ఓ గంటసేపు ఆలోచించాడు. చివరికి ఓ నిశ్చయానికి వచ్చాడతను. వెంటనే టెలిఫోను దగ్గరికి నడిచి విశాలకి ఫోను చేసాడు.

"అంతా నీవు కోరినట్లు జరుగుతుంది. సుశీలాదేవిగారి పాతమేడ దగ్గరికి రాజు వచ్చేట్లు చేయి. అతని పని నేను పూర్తి చేస్తాను."

"గుడ్! నేను అనుకున్నాను రవీ! నాకు తెల్సు నీవు ఒప్పుకుంటావని."

"సరే! మన ఒప్పందం మర్చిపోవాక" చెప్పాడతను.

## 15

"గుడ్ మార్నింగ్ సార్!" అన్నాడు స్కాట్.

"వెరీ గుడ్ మార్నింగ్ మిస్టర్ స్కాట్! ఏమిటి విషయం, నిన్నటినుండి అసలు కన్పించ లేదు."

"బెజవాడ వెళ్ళాను" సమాధానం చెప్పాడు స్కాట్.

"బెజవాడ?"

"అవును మిస్టర్ విష్ణుకాంత్."

"క్యారీ ఆన్."

స్కాట్ తన జేబులో నుండి కొన్ని ఫొటోలు తీసి టేబుల్ మీద వుంచాడు.

"మిస్టర్ విష్ణుకాంత్" నెమ్మదిగా చెప్ప నారంభించాడు స్కాట్. "మీరు చెప్పగానే రవిధర్ ఇంటికి వెళ్ళాను. అక్కడ నన్ను ఆశ్చర్యపరచిన విషయా లున్నాయి. మీ రూహించినట్లు అతను బెజవాడనుండి సరాసరి సుశీలాదేవి ఇంటికి రాలేదు. అతను బెజవాడ వెళ్ళలేదని అతను సుశీలా దేవికి రాసిన ఉత్తరంతో తెల్సింది. అతనింట్లో నన్ను ముఖ్యంగా ఆకర్షించినది 'పాలు' వున్న గ్లాసు. దానిలో కొద్దిగా పాలున్నాయి.

"అంటే రవిధర్ టీ, కాఫీలు కలుపుకుని త్రాగాడు. మరి అతను సరాసరి బెజవాడనుండి సుశీలాదేవిఇంటికి వచ్చానని అబద్ధం ఆడాడని తెలుస్తూంది. చుట్టుప్రక్కల ఎంక్వయిరీ చేసాను. రవిధర్ మధ్యాహ్నం ఇంట్లోనే వున్నట్లు తేలింది. కాబట్టి ఈ విషయంలో అతను అబద్ధం చెప్పాడు.

"రవిధర్ ఇంట్లో అంతా దుమ్ము అలుముకుని వుంది. అక్కడ వున్న టేబుల్ మీదకూడా దుమ్ము వుంది. దాని మీద నాలుగు వ్రేళ్ళ గుర్తులున్నాయి. ఇవిగో, వాటిని ఫొటో తీయించాను. టీపాయ్‌మీద మూడు కప్పులున్నాయి. టీ త్రాగినట్లున్నారు. వాటిమీద వేలిముద్రలు తీయించాను.

"అంటే రవిధర్‌తో ఎవరో మాట్లాడారు. ఎవర్నో కలుసుకున్నాడని అర్థమయింది. ఎంక్వయిరీ చేయగా అతను బెజవాడ వెళ్లేరోజున ఒక మొగతను, ఒక స్త్రీ అతనింటికి వెళ్లారు అని తెల్సింది. రవిధర్ ఇంటి ప్రక్కవారు స్టేట్‌మెంట్ ఇచ్చారు.

"వెంటనే నేను రవిధర్, విశాలల వేలిముద్రలు సంపాదించాను. వాటిని పరిశీలించగా, టేబుల్ మీదున్న వేలిముద్రలతో విశాల వేలిముద్రలు సరిపోయాయి. కాఫీ కప్పుల మీద వున్న ముద్రలు చూడగా, ఓ దానిమీద విశాలవి, మరో దానిమీద రవిధర్‌వి వున్నాయి. ఇంకో దానిమీద మటుకు ఉన్నవి ఎవ్వరివో తెలియటం లేదు" ఆగాడు స్కాట్.

"విశాల రవిధర్‌తో ఎక్కువ పరిచయం లేదని చెప్పింది. దీన్నిబట్టిచూస్తే నాకు మరో ఆలోచన వస్తూంది" అన్నాడు విష్ణుకాంత్.

తలూపాడు స్కాట్. "మీ రన్నది నిజం. విశాల ఉద్యోగంలో చేరి కొంతకాలమే అయింది. అయినా, రవిధర్‌తో అంతటి చనువు ఎలా కల్గింది? అతని ఇంటికి వెళ్ళాల్సిన అవసరం ఏమిటి? ఇదీగాక మూడోవ్యక్తికూడా కలుసుకున్నాడు ఆ రోజున రవిధర్‌ని. దీన్ని బట్టి ఆలోచిస్తే వీళ్ళంతా దొంగలు అనిపిస్తూంది."

"మూడోవ్యక్తి ఎవరైవుంటాడు?" ఆలోచనగా అన్నాడు విష్ణుకాంత్.

"నేనూహిస్తున్నాను. బహుశా, అతను రాజా అయివుండాలి" అన్నాడు స్కాట్.

నిటారుగా కూర్చున్నాడు విష్ణుకాంత్. "యస్ మిస్టర్

స్కాట్ ప్రొసీడ్!"—

"సుశీలాదేవిని హత్యచేసిన హంతకుడు చనిపోయాడు. అతను కేవలం దొంగతనానికి వచ్చాడంటే నమ్మలేనివిషయం. కాబట్టి హత్య చెయ్యటమే అతనిఉద్దేశ్యం కావచ్చు. అతని జేబులో కాగితం వుంది. దాన్నిబట్టి అతను మధుమూర్తి అనీ, బెజవాడనుండి వచ్చాడనీ తెల్సింది. అతని జేబులో కీబంచ్ వుంది. దానిమీద హోటల్ జనతా పేరుంది. అంటె అతను జనతాలో దిగాడు. అక్కడికి వెళ్ళి ఎంక్వాయిరీ చేసాను.

"అతని రూంలో సూట్ కేస్ వుంది. దాంట్లో వెదగ్గా అతని డైరీ దొరికింది. అందులోని విషయాలు గ్రహించాను. బెజవాడలో అతని అడ్రస్ తెల్సిపోయింది వాటివల్ల. వెంటనే బెజవాడ పోలీసులకి ఇంటిమేట్ చేస్తే, వాళ్ళు దర్యాప్తు చేస్తారు. కాని విషయాలు పూర్తిగా బయటికి రాక పోవచ్చు.

"అందుకే స్వయంగా నేను బయలుదేరాను. మధుమూర్తి ఇంటిని పరిశోధించగా, ఓ టెలిగ్రాం కాగితం దొరికింది." అంటూ దాన్ని టేబుల్ మీద వుంచాడు.

అది రాజు మధుమూర్తికి ఇచ్చిన టెలిగ్రాం!

"సో! రాజు మధుమూర్తిని హైద్రాబాద్ పిలిపించాడు. అంటె హత్య చేయించటానికి అతను ఉపయోగించబడ్డాడు. అయితే ఈ రాజు ఎవరు? అన్న ప్రశ్న నన్ను వేధించింది. అసలు ఈ మధుమూర్తి ఎవరో తెలుస్తే రాజు చరిత్ర తెలుస్తుంది. విచారించగా చాలా విషయాలు తెల్సాయి.

"మధుమూర్తి హంతకుడు. ఎన్నోసార్లు జైలు జీవితం గడిపాడు. ఈ రాజుకూడా ఏదో నేరస్తుడు అయివుండాలి. వీళ్ళిద్దరికీ పరిచయం బహుశా జైలులో జరిగివుండాలి. ఇది

నా అయిడియా మాత్రమే. ఎందుకంటె సాధారణంగా నేరస్తులకి స్నేహం ఈ సమయంలోనే అవుతుంది. విచారించగా నేనూహించింది నిజమే అయింది."

"మధుమూర్తి వున్న 'సెల్'లో రాజు అనే అతనూ వుండేవాడు. అతను ఫోర్జరీలో దిట్ట. ఎన్నోసార్లు ఫోర్జరీ చేసి అక్రమంగా డబ్బు సంపాదించాడు. మొన్ననే విడుదల అయినాడని తెల్సింది. అతను ప్రస్తుతం హైద్రాబాద్‌లో వున్నాడని మన మూహించవచ్చు.

"రాజు ఫింగర్ ప్రింట్స్ సంపాదించాను. జైలు రికార్డ్‌లో వున్నాయి. వాటిని ఎక్స్‌పర్ట్‌కి ఇచ్చాను. రిపోర్ట్ స్టేషన్‌కి పంపిస్తానని చెప్పాడు. చాలా టైం అయింది. బహుశా, వస్తూ వుండొచ్చు."

అంటుండగానే ఓ కానిస్టేబుల్ ఓ కవరు తెచ్చి విష్ణుకాంత్‌కి ఇచ్చాడు.

విష్ణుకాంత్ వాటిని పరిశీలించాడు."యస్ మిస్టర్ స్కాట్ మీరూహించింది నిజం. కాఫీ కప్పుమీద వున్నవి రాజు వేలి ముద్రలే. అయితే ఈ రాజుకీ, విశాలకీ, రవిధర్‌కీ పరిచయం ఏమిటి?" ఆలోచించసాగా డతను.

# 16

లోనికి అడుగు పెడుతూనే ఎదురుగా వున్న రవిధర్‌ని చూసి రాజు వులిక్కిపడ్డాడు.

"వాట్ ఈజ్ దిస్ మిస్టర్! విశాల ఏది?"

రవిధర్ నవ్వలేదు. సీరియస్‌గా చూస్తూ అన్నాడు:

"మిస్టర్ రాజూ! లోనికిరా ముందు. తలుపువెయ్. నీతో కొన్ని విషయాలు మాట్లాడాలి."

అతను చెప్పినట్లు చేసాడతను.

రవిధర్ లేచి నిలబడ్డాడు. "మిస్టర్ రాజూ, ఇక్కడికి ఎందుకు పిలిచానో తెల్సా? నీవు నన్ను మోసం చెయ్యటానికి ప్రయత్నించావు. నీ ప్లాను ఏమిటో నాకు విశాల చెప్పింది. అదీగాక, శ్రీధర్‌ని నీవు చంపావని ఆమె అనుమానం. సో! వీటన్నిటికీ కలిపి నీకు శిక్ష విధించదల్చాను."

"శిక్షా?"

"అవును. నిన్ను చంపుతాను" అంటూ జేబులోంచి పిస్టల్ తీసి రాజుకి గురిపెట్టి నవ్వాడు.

"ఢాం!" మని పిస్తోలు పేలింది.

అదే సమయంలో—

తళుక్కుమని మెరుపు మెరిసింది. అది మెరుపు కాదు. ఫ్లాష్ కెమరా వెల్గింది.

రవిధర్ అదిరి పడ్డాడు. తననెవరో ఫోటో తీసారు. తను రాజుని హత్య చెయ్యటం ఎవరికో తెల్సిపోయింది. ఇక తను హంతకుడు అని నిరూపించటానికి ఆ ఆధారాలు చాలు.

చటుక్కున కిటికీలోంచి బయటికి చూసాడతను. ఒకతను పరిగెడుతున్నాడు పాత మేడ వెనక వున్న అడవిలో. రవిధర్ వెంటనే తలుపు తెరచుకొని ఆగంతుకుడు పరుగెత్తిన వైపే పరుగెత్తాడు.

# 17

విష్ణుకాంత్ అన్నాడు: "నాకు చిన్న అనుమానంగా వుంది. ఇక్కడ నేను తెల్సుకున్న విషయాలు చెబుతాను వినండి" అంటూ చెప్ప నారంభించాడు విష్ణుకాంత్.

"మిమ్మల్ని రవిధర్ ఇంటికి పంపాక నేను లాయర్‌ని కల్సుకున్నాను. అయితే అప్పటికే అతను చనిపోయివున్నాడు. హత్య చెయ్యబడ్డాడు. 'బాడ్ లక్' హంతకుడు నా ముందే

తప్పుకున్నాడు. నిజానికి నేను వెళ్ళింది సుశీలాదేవి రాసిన వీలు తాలూకు డూప్లికేట్ కోసరం. అయితే అది కన్పించలేదు. మాయమైంది అనుకోవచ్చు."

"అలాగని ఎందుకు అంటున్నానంటే లాయర్ డైరీ దొరికింది. దాంట్లో రాసుకున్నాడు డూప్లికేట్ తనవద్దే వున్నట్లు. సుశీలాదేవి ఆస్తిలో 75 వేలు రవిధర్‌కి రాసింది. మిగితా ఆస్తి ఎవరికి రాసిందో తెలీలేదు. మిగితా....! అని లాయర్ రాయటం ఆపాడు. మిగిల్న ఆస్తి ఎవరికి రాసింది?

"నేను వెంటనే 'సునీల్ బాంక్' వాళ్ళకి ఫోనుచేసి వీలు తెప్పించాను. దాన్లో రవిధర్‌కి 75గాను ఒక లక్ష రాయబడివుంది. మిగిలిన ఆస్తి ఆమె అల్లుడు శ్రీధర్ పేర రాయబడి వుంది. అతను ఎవరో మనకు తెల్సు. కాని ఎక్కడ వున్నాడో మనం కనుక్కోవాలి. అయితే ఇక్కడవున్న కిటుకు ఏమిటో చెప్పగలవా?" ప్రశ్నార్థకంగా స్కాట్ వంక చూశాడు.

తలూపాడు స్కాట్. "విత్ యువర్ పర్మిషన్.ఇప్పుడు ఈ కేసు మంచులా కరిగిపోతూంది. రవిధర్‌కి ఇప్పుడున్న వీలులో ఒక లక్ష వ్రాసివుంది. కాని లాయర్ డైరీ ప్రకారం 75 వేలు రావాలి.లాయర్‌కి తప్పురాయాల్సిన అవసరం లేదు డైరీలో.

"అయితే ఇక్కడవున్న కిటుకు ఇదై వుండొచ్చు. రవిధర్ ఫోర్జరీలో దిట్ట అయిన రాజు సహాయం కోరి వుంటాడు. అయినా ఇరవైఐదు వేలకి ఇంత దారుణం జరిగిందనుకోను. రవిధర్ డూప్లికేట్ వీలు సృష్టించాడని అనుకుందాం. దాని వల్ల రవిధర్‌కి లాభం వుంది. మరి రాజుకీ, విశాలకీ ఏమిటి లాభం? ఇది మనం కనుక్కోవాలి.

"అయితే ఒక్క విషయం మటుకు నిజం. రవిధర్, విశాల,

రాజు కలసి సుశీలాదేవి మీద వల విసిరారు. యీ విషవలయంలో చిక్కి సుశీలాదేవి, లాయరు కూడా మరణించారు."

"అవును. మన వూహ కరెక్ట్! కాని ఈ రాజు ఎక్కడ వుంటాడో తెలుస్తే బావుండు" అంటూండగా బల్ల మీదున్న ఫోను మోగింది.

విష్ణుకాంత్ అందుకున్నాడు. అవతలనుండి వచ్చిన సమాధానం విని అతని మొహం ఎర్రబారింది.

"మిస్టర్ స్కాట్. రాజు హత్య చేయబడ్డాడు. రవిధర్ చంపాడని రిపోర్ట్. ఫోనుచేసిన వ్యక్తి తన పేరు చెప్పలేదు. ఆధారాలున్నాయట అతని దగ్గర. రేపు స్టేషన్‌కి పంపుతాడట. హత్య జరిగింది ఎక్కడో చెప్పలేదు."

"డామిట్! ఇది మరీ చిక్కు తెచ్చిపెట్టింది" అన్నాడు స్కాట్.

తలూపాడు విష్ణుకాంత్. వెంటనే టెలిఫోన్ అందుకుని ఎక్స్చేంజ్‌కి ఫోను చేసాడు, ఇంతకుముందు వచ్చిన కాల్ ఎక్కడిన్నుంచి వచ్చిందో తెల్సుకోటానికి.

అవతలనుండి వచ్చిన సమాధానం వినగానే లేచాడు విష్ణుకాంత్. "కమాన్ మిస్టర్ స్కాట్" అని దారితీసాడు.

# 18

ఆగంతుకుడు ముందు పరిగెత్తి సందులోమాయమయ్యాడు. రవిధర్ పరుగు హెచ్చించాడు.

సందులోంచి తిరిగిన రవిధర్ ఆ ఆగంతుకుడు టెలిఫోన్ బూత్‌లోదూరి బయటకి రావటం కన్పించింది.

ఒక్క అంగలో వెళ్ళి అతన్ని తన రెండు చేతులలో

ఒడిసి పట్టుకున్నాడు, ఆ ఆగంతుకుడు సామాన్యుడు కాడు. రవిధర్ కి సమఉజ్జి.బలంగా పట్టుకున్న రవిధర్ ని విదిలించాడు. రవిధర్ తూలాడు. అంతే!—

ఆగంతుకుడు తన చేయి గాలిలోనికి విసిరాడు. ఫట్ మని రవిధర్ గడ్డం పైన తగిలింది, కళ్లు భైర్లు కమ్మాయి.

ఆగంతుకుడు చేరువ అవుతున్నాడు. రవిధర్ మెరుపులా తన బూటుకాలు ఎత్తాడు. మరుక్షణం ఆగంతుకుడు బాధలో మెలికలు తిరిగాడు.

రవిధర్ అతని మీదికి లంఘించాడు. మెరుపు మెరిసి నట్లుగా, రివాల్వర్ తీసి పేల్చాడు అతను.

టప టప మని గుళ్లు రవిధర్ డొక్కలో గుచ్చుకున్నాయి. బాధగా అరుస్తూ కూలబడ్డాడు. రక్తం పారుతోంది.

అంతలో దూరంగా పోలీస్ వాన్ సైరన్ మోగించు కుంటూ వస్తూ కన్పించింది. మరుక్షణం ఆ ఆగంతుకుడు మాయ మయ్యాడు.

టెలిఫోన్ బూత్ దగ్గర ఆగిన పోలీస్ వాన్ లోంచి స్కాట్ దిగాడు. వెనక విష్ణుకాంత్ దిగాడు.

రక్తపు మడుగులో వున్న రవిధర్ ని చూడగానే ఒక్క అంగలో అతని వద్దకు చేరుకున్నారు.

"ఇంకానయం ప్రాణంవుంది" అంటూ స్కాట్ అంటుం డగా బాధగా మూల్గాడు రవిధర్.

"మిస్టర్, రవిధర్! ఏం జరిగింది?"

రవిధర్ కనురెప్పలు బరువుగా తెరిచి "హంతకుడు... అసలు హంతకుడు..." అతని నోట్లోంచి మాట రావటం లేదు.

ఆత్రుతగా వంగాడు స్కాట్. "చెప్పండి రవిధర్!"

ఏదో చెప్పటానికి ప్రయత్నించి విఫలుడయ్యాడు తన కుడి చేతిమీద ఏదో గుర్తు చూపించాడు రవిధర్. ఏమిటా 'గుర్తు' అనేలోగా అతని ప్రాణాలు గాలిలో కల్సాయి.

# 19

స్కాట్ వెర్రిగా చూస్తూ అన్నాడు. "అసలు మనం ఎంత వరకు కృతార్థులము అంటే- నిల్."

"నో! మిస్టర్ స్కాట్ మనం ముందునుండి అతన్ని మర్చిపోవటమే మనం చేసిన మొదటి పొరపాటు. దట్స్ ఆల్ రైట్."

"ఎలాగ? హంతకు డెవరు? అని మనము మథన పడ్డున్నాము. రవిధర్ చనిపోయాడు. రాజూ అంతే. ఇక మిగిలింది విశాల. ఆమెకూడా ప్రాణాలతో వుంటుందని ఆశ వుందా?"

"యస్. మిస్టర్ స్కాట్! మీరు కొన్ని విషయాలు తెల్సుకోవాలి" అంటూ అతనికి ఏదో చెప్పాడు.

"ఆల్ రైట్ మిస్టర్ విష్ణుకాంత్" స్కాట్ హడావిడిగా బయటికి వెళ్ళాడు.

# 20

అర్థరాత్రి పన్నెండు గంటలయింది.

సుశీలాదేవి బంగాళా వెనక వున్న వాటర్ పైప్ పట్టుకుని ఓ ఆకారం పైకి పాకుతోంది. దాదాపు పది నిముషాల పాటు అతను శ్రమపడ్డాక టెర్రెస్ లోనికి చేరుకున్నాడు.

పైకి చేరుకున్నాక ఓసారి క్రిందికి చూసాడు. అంతా చీకటి. నవ్వుకున్నాడతను. కాని, ఆ చీకట్లో మరో ఆకారం వాటర్ పైప్ పట్టుకుని ప్రాకటం గమనించ లేదతను.

ఆ ఆకారం సరాసరి లోనికి వెళ్ళింది.

అంతలో రెండవ ఆకారం కూడా అక్కడికి చేరుకుంది.

లోనుండి మాటలు వినబడసాగాయి.

"నువ్వా?" అది విశాల గొంతుగా గుర్తించాడు టెర్రెస్‌లో వున్న ఆకారం.

"అవును. ఆశ్చర్య పోతున్నావా? ఈ హత్యలకి, ఆ స్థితికి మూలకారకుడ్ని."

"అవును. నిన్ను గమనించాను. కాని నీవు చనిపోలేదా?"

నవ్వాడు లోనున్న వ్యక్తి.

"అతను డబ్బు తినే మనిషి. డబ్బు ఇస్తానని చెప్పి, నీతో పంపాను. పని పూర్తయింది. కాని దీని వెనక పూర్తిగా నా మెదడుందని మర్చిపోవాక. ఇక నీ సంగతి. నీవు వేశ్యవని నాకు తెల్సు. తెల్సే నిన్ను పావుగా వుపయోగించుకున్నాను. అందుకే అతనికి చెప్పాను. నేను చనిపోయినట్లు నీకు నమ్మకం కల్గించాడు. వెంటనే జరిగే ప్లాన్ నాకు తెల్సు. నీవు రవిధర్ సహాయం కోరావు. రాజు చచ్చాడు. రాజుని చంపాలని కేవలం ఈ నాటకం ఆడాను. ఇందులో నేను పావులుగా వుపయోగించినవా రెవ్వరూ బ్రతికి వుండకూడదు. అందరూ పోయారు. ఇక నీ సంగతి?" అంటూ అతను జేబులో నుండి కత్తి బయటికి తీశాడు.

విశాల ప్రాధేయపడ్తూంది. అతడు వినలేదు. ఒకడుగు ముందుకు వేశాడు.

"వద్దు! నన్ను చంపకు!" దీనంగా అర్చిందామె.

టెర్రెస్‌లో వున్న ఆకారం పరిస్థితి గమనించింది. వెంటనే లోనికి వెళ్ళింది. లోనున్న వ్యక్తి మొహం కన్పించటంలేదు.

"మైడియర్ ఫ్రెండ్! మర్యాదగా దయచేసి చేతులు

ఎత్తు'' ఆజ్ఞాపించిందా ఆకారం రివాల్వర్ గురిపెడుతూ.

లోనున్న వ్యక్తి అదిరిపోయాడు. వెంటనే చేతిలోని కత్తిని ఆ ఆకారం మీదికి విసరబోయాడు. కాని అంతలోనే రివాల్వర్ పేలింది.

"అమ్మో" అంటూ లోనున్న వ్యక్తి కత్తి వదిలేశాడు.

అతని గురి తప్పలేదు. బుల్లెట్ హంతకుడి చేతికి తగిలింది. గాయం నుండి రక్తం కారసాగింది.

నిప్పులు కురిసే కళ్ళతో రివాల్వర్ పట్టుకున్న వ్యక్తి వంక చూసాడు అతను.

"నాకు తెల్సు మిస్టర్ నీవే హంతకుడివని" గంభీరంగా అన్నాడు, రివాల్వర్ పట్టుకున్న వ్యక్తి.

"మిస్టర్ స్కాట్! మీరు నిరూపించలేరు" అన్నాడు హంతకుడు.

నవ్వాడు స్కాట్. "మీ సంభాషణ అంతా రికార్డు చేశాను" అంటూ విశాలవైపు చూసాడు.

ఇంత మంది పచ్చినెత్తురుతో ఆడుకున్న హంతకుడూ, ఆ సికోసం ఇంతటి విషవలయం సృష్టించిన తుచ్ఛుడూ అయిన శ్రీధర్ తలవాల్చేశాడు.

—:ఐపోయింది:—

# చివరిపేజీ వినోదం

''నా భార్యవల్ల నాకు నరాల బలహీనత వస్తోంది. తగు సహాయము చేయండి.'' అన్నాడు క్లయింట్.

''నేను డాక్టరును కాను.'' అన్నాడు లాయర్.

''నాకు కావల్సింది మందు కాదు, విడాకులు'' అన్నాడు క్లయింట్.

* * * *

ఒక ప్రముఖ పత్రికలో ఈ విధంగా ప్రచురితమయింది—

''గత సంచికలో బాగా 'అచ్చుపత్తులు' పడినందుకు విచారిస్తున్నాం.''

* * *

క్రొత్తగా అత్తగారింటికి కూతురును పంపుతూ, తల్లి చెప్పింది—

''బిడ్డా! నువ్వు సదా నీ భర్త చెప్పు చేతులలో మెలగాలి సుమా!''

కొన్నాళ్ళకు కూతురు తల్లిగారింటికి తిరిగి వచ్చింది.

''అమ్మా! నువు చెప్పినట్లే నేనిపుడు నా భర్త 'చెప్పుచేతులలో' మెలుగక తప్పడంలేదు'' అని చెప్పింది తల్లికి కన్నీళ్ళతో.

* * *

''ఏంరా! ఒంటినిండా కట్లు కట్టుకొన్నావ్. ఏమయింది?''

''ఆఁ....ఏంలేదు..........నేనీ సంవత్సరము బి. య్యే. లో. ఫేలవుతే 'పెండ్లి 'చేస్తానన్నాడు. నిజమేననుకొని ఫేలయ్యాను. నిజంగానే పెండ్లి చేశాడు మా నాన్న.''

* * *

సోవియట్ దేశంలో ఒక భారతీయుడు పొరపాటున నీటి కొలనులో పడి "అమ్మోవ్! బాబోవ్!! చచ్చానోవ్!!"అంటూ మొత్తుకొన్నాడు.

వెంటనే అచ్చటనున్న ముగ్గురు సోవియట్ దేశస్థులు హుటా హుటీ పోయి భారతీయుడ్ని నీటిలోంచి రక్షించి, "అన్నట్లు మా ముగ్గురిపేర్లు నీకెలా తెల్సాయి?"అన్నారు ఆశ్చర్యార్థకంగా.

—కొండపల్లి వెంకటేశ్వరరావు, హైద్రాబాదు.

# 2

భర్త: ఎందుకే పక్కింటి పిన్నిగారు ప్రొద్దుటి నుంచి మూలుగుతున్నారు. కడుపులో నొప్పా?

భార్య: వాళ్ళాయనకి జ్వరం వచ్చింది. వంట చేయాల్సి వచ్చిందిట!

* * *

"అదేమిటోయ్ శంకరం! కుడికాలు కదా నీకు సెప్టిక్ అయింది. మరి రెండు కాళ్లు తీసేశారేమిటి?"

"ఎడంకాలు సెప్టిక్ అనుకొని డాక్టరు ముందు అది తీసేశాడు. తరువాత నిజం తెల్సుకొని కుడికాలు తీసేశాడు!"

* * *

డాక్టరు: ఏమయ్యా! నిన్న ఏం తిన్నావు. ఇంత ఎక్కువగా కడుపు నొప్పితో బాధపడుతున్నావు?

అతడు: అబ్బ! అమ్మా!! చివరిపేజీ వినోదం చదివానండి. అప్పటినుంచి కడుపునొప్పి విడవకుండా పట్టుకుంది.

—కురుమద్దాలి విజయలక్ష్మి, విజయవాడ.

# 3

ఎదురుగా ఒక ఆవు - దూడ ముక్కులతో రుద్దుకోవడం చూసి రాజరావు, ప్రక్కింటి సుజాతతో—"నాకు అలా చెయ్యా

అని ఉంది. నీకేమైనా అభ్యంతరమా.'' అన్నాడు రెప్పవాల్చకుండా ఆమెనే చూస్తూ.

''నో! నో! నాకు అభ్యంతరం దేనికి? అది నీ ఆవు. నీ యిష్టం'' అంది సుజాత.

*　　*　　*

''నేను కాశ్మీరు వెళ్ళినప్పుడు అక్కడ చలి విపరీతంగా ఉండేది. ఒకసారి ఒక లేడి చిన్న గుట్టమీదనుంచి క్రిందకు దూకింది. కాని అది క్రింద పడకుండా మధ్యలోనే గాలిలో చలికి బిగుసుకుపోయి అలా మధ్యలోనే ఆగిపోయింది.'' అన్నాడు ఓ కోతలరాయుడు.

''కానీ 'గరిమనాభి' సూత్రం దానికి ఒప్పుకోదు.'' అన్నాడు డో ప్రాజ్ఞుడు.

దాని కా కోతలరాయుడు-''నిజమే. కాని ఆ చలికి అక్కడ 'గరిమనాభి' సూత్రంకూడా గడ్డకట్టుకు పోయింది.''అన్నాడు.

*　　*　　*

ఒక మీటింగ్‌లో మాట్లాడటానికి ఒక వ్యక్తిని ఒప్పించారు. అతడు మీటింగ్ జరిగే సమయానికి తాగేసివచ్చి. మైక్ ముందు నిల్చుని, మైకంలో, ''ఇక్కడ కుడి ప్రక్కన కూర్చున్న వారంతా వెధవలు! ఎడమ ప్రక్కన కూర్చున్న వారంతా చవటలు!!'' అన్నాడు.

వెంటనే కుడిప్రక్కన కూర్చున్నవారిలో ఒకతను కోపంగా లేచి, ''అయితే నేను వెధవనా?''అన్నాడు ధుమధుమలాడుతూ.

''మరి కుడి ప్రక్కన ఎందుకు కూర్చున్నావు? ఎడమ ప్రక్కకిపో,'' అని అరిచాడు ఆ త్రాగుబోతు వక్త.

*　　*　　*

నిద్రపోతున్న భర్తను లేపి,''ఏమండీ! బయట చాలా చలిగా ఉందండీ! ఆ కిటికీ తలుపులు మూసేయండి!'' అంది భార్య.

భర్త బద్ధకంతో లేవలేదు.

భార్య మళ్ళీ "లేవండీ! బయట చాలా చలిగా ఉంది. కిటికీ తలుపులు వేసెయ్యండీ!" అంది భర్తను గట్టిగా కుదుపుతూ.

భర్త లేచి కిటికీ తలుపులు మూసివేస్తూ "ఇప్పుడు బయట వెచ్చగా వుందా!" అన్నాడు విసుగ్గా.

*    *    *

ఒకడు జబ్బుపడి ఒక ప్రైవేట్ నర్సింగ్‌హోమ్‌లో చేరాడు. అయిదు నిమిషాలకో వ్యక్తి చొప్పున ఆ పేషంట్ వున్న గది లోకి వచ్చి తొంగిచూసి వెళ్ళసాగారు.

ఆ పేషంట్ 'ఆహా! ఈ నర్సింగ్‌హోమ్‌లో పేషంట్స్‌ని ఎంత శ్రద్ధగా చూస్తున్నారు!' అని ఆశ్చర్యపోసాగాడు.

కానీ వారు అలా తొంగిచూసి వెళ్ళిపోవటమేకాని, అతణ్ని ఏమీ అడగటంలేదు.

చివరకు ఆ పేషంట్ ఒకణ్ని లోపలికి పిలిచి, "మీరంతా అలా చూసి వెళ్ళిపోతున్నారు దేనికి!" అని అడిగాడు.

దాని కతడు, "మేము శవాల్ని మోసేవాళ్ళము. మా అవసరము మీకే క్షణములోనైనా రావచ్చుని కనిపెట్టుకు చూస్తున్నాము." అని జవాబిచ్చాడు.

—రంకిరెడ్డి రాము, కాకినాడ-3

# 4

హాస్పిటల్‌లో బెడ్ మీదున్న పేషంట్ టెంపరేచర్ చూస్తోంది నర్స్.

"జ్వరం మళ్ళా ఎక్కువయ్యిందే!" థర్మామీటరు చూస్తూ అంది.

"మీ రొచ్చేవరకు నాకు ఏమీ లేదండీ! మిమ్మల్ని చూడగానే ఎందుచేతనో వళ్ళంతా జిమ్మున వేడెక్కిపోతుంది." అన్నాడా

పేషంట్, నర్స్ లేత బుగ్గలవంక ఆశగా చూస్తూ.

*　　　*　　　*

భార్య:- నేను రాస్తున్న 'నడిచివస్తున్నశవం' నవల పూర్తి కావచ్చిందండీ.

భర్త-: (ఆశ్చర్యంగా)డిటెక్టివ్ పుస్తకాలు చదివే అలవాటు లేని నువ్వు నడిచివస్తున్న శవం గురించి ఎలా రాయగలుగు తున్నావే?

భార్య:- ఏముందండీ? రోజూ మీరు ఆఫీసునుంచి తిరిగి వచ్చేటప్పుడు మిమ్మల్ని చూసి రాసేస్తున్నానంతే!

*　　　*　　　*

ప్రేమసీ, ప్రియులు గాఢాలింగనంలో ఉన్నారు.

ఉన్నట్టుండి ఆమె ఆ అబ్బాయి పెదవుల్ని గట్టిగా ముద్దెట్టు కుంటూ, రక్తమొచ్చేటట్లుగా కొరికేసింది.

"మైగాడ్! ఇదేమిటి నా పెదాలు కొరికేశావ్?" అన్నాడతను.

"నీమీద నాకు గాఢమైన అనురాగము ఏర్పడిందని చెప్ప టానికి ఇంతకన్న మంచి మార్గము దొరకలేదు, డియర్" అందామె గోముగా.

*　　　*　　　*

భార్య:- అయ్యో! ఏంటండీ అలా గుండెలు బాదుకుంటూ ఏడుస్తున్నారు. ఏం జరిగింది?

భర్త:- వచ్చేసిందే!

భార్య:- ఏమిటండీ గుండెల్లో నెప్పా?

భర్త:- కాదే!

భార్య:- మరేంటండీ! రాత్రి వచ్చిన దెయ్యమా?

భర్త:- అదేదీకాదు. నా కథ తిరిగొచ్చేసిందే.

—పెనుబోతు ధర్మారావ్, మచిలీపట్టణం.

# 5

"నువ్వేదైనా క్రొత్తవూరు కెళ్ళినప్పుడు దిక్కులను ఏ విధంగా తెలుసుకుంటావు?" అని ఒక మూడవతరగతి విద్యార్థికి ప్రశ్న పత్రంలో ఇవ్వబడింది.

ఆ విద్యార్థి కొంచెంసేపు ఆలోచించి దానికి జవాబిలా వ్రాశాడు. "ప్రక్కింటి వాళ్ళను అడుగుతాను."

*   *   *

ఇద్దరు స్నేహితులు బజారులో కలుసుకున్నారు.

మొ. స్నే:-ఏరా! రెండుప్రక్కల దవడవాచింది. ఏమిటిసంగతి?

రెం. స్నే:- నా భార్య కొట్టింది.

మొ. స్నే:- ఎందుకు?

రెం. స్నే:- నాకు వేరే అమ్మాయితో సంబంధం వుందని ఆమెకు తెలిసిపోయిందట.

మొ. స్నే:- మరి రెండోప్రక్క....?

రెం. స్నే:- నాకు భార్య వుందని నా ప్రియురాలికి తెలిసిపోయింది!? అన్నాడతను నిరాశ నిస్పృహలతో.

*   *   *

"భలే జోక్ వేశావోయ్!...అబ్బ!!....నవ్వుతుంటే కడుపు ఉబ్బిపోతుంది బాబూ?"

"ఏం జోకు....?"

"అదేనోయ్!....నువ్వు జోక్ వ్రాస్తానని అన్నావుగా!"

*   *   *

"ఏవోయ్ సుబ్బారావ్! ఈ మధ్య వళ్ళు బాగా బలిసినట్టుంది?" అన్నాడు మేనేజర్ కోపంగా.

"అబ్బే, లేదుసార్! ఎంతమాట! తమరు మునుపటిలాగే వున్నారు సార్!!" గుమాస్తా జవాబిచ్చాడు.

—కోనే హరిబాబు, ఏ

